# ఆంధ్ర భాగవతము -

# విశిష్టాద్వైతపాలనము

## రెండవ భాగము



శ్లో॥ శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

---

ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ కొనర్పు ఆర్థిక సహాయముచే ముద్రితము.

---

డాక్టర్ తట్టా లక్ష్మీనరసింహాచార్యులు

# ఆంధ్రభాగవతము - విశిష్టాద్వైతపాలనము

## రెండవ భాగము

## 1. పోతన పరిష్కారములు

1. అమూలకములు :

1. గ్రంథారంభమునందే పోతన యిష్టదేవతా ప్రార్థనము గావించు సందర్భమున విశిష్టాద్వైత సంప్రదాయ ప్రసిద్ధమైన శ్రీమన్నారాయణ తత్త్వమును వివరించినాడు.

భాగవతానువాదమున ప్రథమస్కంధమున ప్రథమపద్యమున నందాంగనా డింభకుని స్మరించినాడు. ఇట్లు పరబ్రహ్మమగు శ్రీకృష్ణునితో ప్రార్థనమును ప్రారంభించి లక్ష్మీస్తుతితో ముగించి యున్నాడు. నడుమ శివుడు, బ్రహ్మ, వినాయకుడు, సరస్వతి

స్తుతులున్నవి. శ్రీకృష్ణుని, శివుని, బ్రహ్మను స్తుతించిన వరుసలోనే లక్ష్మి పార్వతీ సరస్వతుల స్తుతులుండుట సాధారణపద్ధతి. కాని పోతన యట్లుగాక శ్రీకృష్ణునిస్తుతితో ప్రారంభించి లక్ష్మీస్తుతితో ముగించినాడు.

ఇందులో విశిష్టాద్వైత సంప్రదాయసంబంధమగు పరమార్థమిది ఆస్తంబ బ్రహ్మ పర్యంతము సకలచేతనాచేతన ప్రపంచము పర-బ్రహ్మమగు శ్రీమన్నారాయణునకు శరీరము. ఆయన శరీరి. అనగా ఆత్మ. లక్ష్మి యాయనతో ననపాయిని. అపృథక్సిద్ధమను నేకత్వ-మును నారాయణతత్త్వ శ్రీతత్త్వములకు విశిష్టాద్వైతము చెప్పు-చున్నది. కావున శ్రీకృష్ణునిస్తుతితో ప్రారంభించి లక్ష్మీస్తుతితో ముగించి పోతన శ్రీమన్నారాయణుని యేకత్వమును, పరబ్రహ్మత్వమును వ్యక్తము చేసినాడు. అనగా శ్రీకృష్ణ పరబ్రహ్మమును, నాయన దేహమగు దేవతాంతరులను, దరువాత—ఆతనితో నపృథక్సిద్ధయగు లక్ష్మీదేవిని స్తుతించుటచే శ్రీమన్నారాయణుని యద్వితీయమును నేకైకమునగు దివ్యతత్త్వము చెప్పినట్లైనది.

భగవద్రామానుజులు శ్రీమన్నారాయణ తత్త్వమును వివరించుచు. .

"తస్మాత్సర్వస్య చిదచిద్వస్తునః పరమాత్మ శరీరతయా తత్ప్ర-కారత్వా త్పరమాత్మని ముఖ్యతయా వర్తన్తే సర్వే తద్వాచకాశ్శబ్దాః"[1] అని సిద్ధాంతీకరించియున్నారు. దీని భావము—సకల చిదచిత్తులు పరమాత్మకు దేహము. కావున చిదచిత్తులను దెలుపు సర్వ శబ్దములు బ్రహ్మమునకు వర్తించును.

ఈ సందర్భముననే నారాయణానువాక్యముల నుదాహరించి

---

1. వేదార్థసంగ్రహః

శ్రీమన్నారాయణుడు పరబ్రహ్మము శివబ్రహ్మాద్యనంత రూపములు కలిగినవాడని భగవద్రామానుజులు వివరించియున్నారు. మఱియు ఈ సందర్భముననే మహాభారతమున బ్రహ్మరుద్రసంవాద ఘట్టమునగల శ్లోకముల నుదాహరించి రుద్రునియందును, బ్రహ్మయందు తదితర దేహులయందు నారాయణుడంతరాత్మయై నిలిచియున్నాడనియు, నంతరాత్మగా నిల్చియున్న నారాయణునిచేత జూపబడిన మార్గమున బ్రహ్మరుద్రాదులు సృష్టిసంహారకార్యములు నెరవేర్చుచున్నారనియు భగవద్రామానుజులు పేర్కొనియున్నారు.

కావున శ్రీకృష్ణ పరబ్రహ్మను స్తుతించి, యాతని శరీరభూతులగు శివబ్రహ్మల స్తుతించుట శ్రీమన్నారాయణస్తోత్రము తప్ప తదన్యము కాదు. ఇక గడపట లక్ష్మీస్తవము సేయుట విశిష్టాద్వైతసంప్రదాయమే

"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ"[1] (నిత్యయు, జగములకు తల్లియునగు శ్రీదేవి విష్ణువును విడచియుండునదికాదు.) ఇత్యాదిగా విశిష్టాద్వైతులచే శ్రీశ్రియఃపతుల నిత్యసంబంధము చెప్పబడినది.

మఱియు శ్రీకైవల్యము సర్థించి శ్రీకృష్ణ పరబ్రహ్మమును గూర్చి చింతించవలెన శ్రీస్తుతి తప్పనిసరియగు విషయము. ఇందు విశిష్టాద్వైత సంప్రదాయమిట్లు నిర్దేశించుచున్నది...

"లక్ష్మ్యాసహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా।
రక్షకస్సర్వ సిద్ధాన్తే వేదాన్తేఽపి చ గీయతే॥"[2]

---

1. అష్టశ్లోకీ-ఆంధ్రవ్యాఖ్య పుట 62

2. ముముక్షుప్పడి-తిరుమన్త్ర ప్రకరణము పుట 64-65

(దయ్యుద్యే స్వరూపస్వభావగుణగాగల శ్రీదేవితో గూడియే సర్వేశ్వరుడు రక్షకుడగుచున్నాడని సర్వసిద్ధాంతములందును వేదాంతములందును చెప్పబడుచున్నారు.)

"ఇత్థం ప్రపత్తి విద్యాయాం తత్తన్మంత్రాను సారతః।
విభుః పత్న్యాగుణాద్యైశ్చ విశిష్టో విషయో ప్రపదః॥"[1]

(ప్రపత్తి విద్యయందును నాయా మంత్రములయందు చెప్పి యున్న ప్రకారము శ్రీదేవితోను గూడియున్నట్టి నారాయణుడే మా యొక్క శరణాగతికి విషయభూతుడు.)

"శేషైయం న చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి।
వ్యాపకావతి సంశ్లేషాదేక తత్త్వమివోదితౌ॥"[2]

(శ్రీశ్రియః పతులొకరిని విడచి మఱియొకరు క్షణకాలమైనను నిలువజాలరు. కావున వీరుభయులును నొకరితో నొకరు చేరియుండి యంతటను వ్యాపించియున్నందున నిద్దఱును జేరియొక్కటి యే తత్త్వమని చెప్పబడుచున్నారు.)

ఇట్టి సంప్రదాయసిద్ధములగు ననేకవాక్యములచే లక్ష్మీనారాయణుల యేకత్వము వెల్లడియగుచున్నది.

పోతన కృత్యాది పద్యములలో దివ్యావతార విశిష్టుడు లోక రక్షైకారంభకుడు, భక్తపాలన కళాసంరంభుడు దానవభేది లోకసృష్టి కర్త సమస్త చరాచరములకు నాత్మభూతుడునగు నారాయణుని, నాతని శరీరభూతులగు తదితర దేవతాగణమును, నాతనితో నిత్యా

1. రహస్యత్రయసారము పుట 342
2. రహస్యత్రయసారము పుట 346

నపాయినియగు శ్రీదేవిని వరువగాస్తుతించి శ్రీమన్నారాయణతత్త్వ ముకునాళవి విశిష్టాద్వైత తత్త్వమును వెల్లడించి తన సంప్రదాయ వరిజ్ఞానమును, తత్సంప్రదాయ వరాయణత్వమును వెల్లడించి-యున్నాడు.

పోతనామాత్యుని యీ నిర్వహణమునకు ప్రబలవ్రమాణము శ్రీ నమ్మాళ్వారుల తిరువాయ్మొళి దివ్యవ్రబంధమునుండి యిట్లు వ్రదర్శింపవచ్చును. "తిరువాయ్మొళి" ద్వితీయశతకమునద్వితీయ దశకమున శ్రీమన్నారాయణుని పరత్వమును స్థాపించుచు- "వృషభ వాహనుడైన రుద్రుని, బద్మము నుండి పుట్టిన బ్రహ్మను, బద్మమునుండి పుట్టిన శ్రీమహాలక్ష్మిని వేఱుగా లేకుండ తన మేనియందు దివ్యలారా-ధించునట్లు ధరించువాడై సకల లోకములును, దన చరణములందడగు నట్లు కొల్చుకొనినందువలన సర్వేశ్వరునికంటె బరమైన వేఱొక దైవ మున్నదా?"[1] అని శ్రీ నమ్మాళ్వారులు వ్రశ్నించియున్నారు.

ఇందు స్పష్టముగ శ్రీమన్నారాయణుని దేహమునందే శంభుడు బ్రహ్మ, లక్ష్మియు నున్నట్లాళ్వారులు వ్రకటించి అదియే శ్రీమన్నా రాయణ పారమ్యమునకు నిదర్శనమని నిశ్చయించినారు.

పోతన సరిగ నిదే మార్గమున తన దైవస్తుతి ఘట్టమును నిర్వ హించియున్నాడు.

మఱియు తిరువాయ్మొళి చతుర్థశతకమున అష్టమదశకమున శ్రీనమ్మాళ్వారులు "ఏఱాళుమ్" ఇత్యాది పాశురమున....

"వృషభమును వాహనముగాగల రుద్రుడును, నాల్గుముఖముల

---

1. తిరువాయ్మొళి 2.2.3

కల ఖిశ్యాయు, శ్రీదేవియు భోగించుకొని యనుభవింపదగిన యద్వితీయమైన దేహము కలవాడు"[1] అని శ్రీమన్నారాయణుని పేర్కొనియున్నారు. ఈ వర్ణనముగూడ మన పోతన స్తుతిపద్యముల మూలముల వ్యక్తముగావించిన నారాయణతత్త్వమునే వెల్లడించునదై యున్నది.

మఱియు నాల్గవశతకమున-అష్టమదశకమునవే శ్రీనమ్మాళ్వారులు "జటతోగూడిన శిరస్సుకల రుద్రుడు ప్రత్యేకముగా తమరి యొక పార్శ్వమునందు నిత్యనివాసము చేయదగిన శరీరము కలవాడు"[2] అని శ్రీమన్నారాయణుని వర్ణించియున్నారు.

ఈ నమ్మాళ్వారులు విశిష్టాద్వైత సంప్రదాయమున నత్యున్నత స్థానము నాక్రమించియున్న వన్నిద్దరాళ్వారులలో నతిముఖ్యులు శ్రీ వైష్ణవసంప్రదాయమున నీ యాళ్వారులు తక్కిన యాళ్వారులకు నాత్మస్థానీయులు. తక్కినవారు అవయవస్థానీయులు. అందుచే వీరి వాక్కులు పరమప్రమాణములుగా నేను గైకొని యుదాహరించితిని.

2. ప్రథమస్కంధమున బరీక్షిత్తు శమీకమహర్షియొద్దకు వచ్చిన ఘట్టమున శమీకుడు సమాధి నిష్ఠలోనుండి యా రాజు పలుకులు విన-డాయెను. ఆ సందర్భమున శమీకుడు 'హరి చింతాపరుడై "యుండినా డనునది పోతన కల్పనము. మూలమున శ్రీహరి ప్రసంగము కానరాదు.

మూలమున నీ సందర్భమున శమీకుని వర్ణనమిది....

---

1. తిరువాయ్మొళి 4-8-1

2. " 4-8-10

"ప్రతిరుద్ధేంద్రియ ప్రాణ మనోబుద్ధి ముపారతమ్।
స్థానత్రయా పరం ప్రాప్తం బ్రహ్మభూత మవిక్రియమ్।
విప్రకీర్ణ జటాచ్ఛన్నం రౌరవేణాజినేన చ।
విశుష్యత్తాలు రుదకం తథాభూత మయాచత॥

ఈ శ్లోకములయందు శమీకుని హరిచింతా ప్రసక్తి ప్రసక్తము కాలేదు.

కాని శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనాకుతూహలుడై- ఆ నారాయణ పరబ్రహ్మముయొక్క గాథను దప్ప "వేఱొందు గాథ లలుకగనేలా"యని ఇద్ధకంఠుడైన పోతన తనవిశిష్టాద్వైతానురక్తియు నిరంతర హరి చింతాయత్తమగు చిత్తమువ్యక్తమగునట్లు మూలమున లేని యిట్టి కల్పనమును జేసినాడు. ఇంత మాత్రముననే పోతన తృప్తి జెందక శమీక పుత్రుడగు శృంగిచే-"సమాధి నిష్ఠుడై వీడడు లోని చూడ్కులను విష్ణుని దక్క నితరప్రపంచమున్ జూడడు మద్గురుండు"[2] అని పలికించినాడు. ఇదియు నమూలకమే. శమీకుడంతర్దృష్టిని విష్ణుని దప్ప వేఱొక దైవమును జూడడను నీయమూలకల్పనము గూడ కేవలము పోతనయొక్క నారాయణ ప్రియత్వమునే సూచించుచున్నది

3. ద్వితీయ స్కంధమున నారదుడు బ్రహ్మకడకేగి పర- మేశ్వరునిగూర్చి ప్రశ్నించినపుడు బ్రహ్మ తనను మఱి కొందఱిని విష్ణుమాయ నెఱిగిన వారిని మూలభాగవతమున పేర్కొనినట్లుండగా పోతన మార్పుచేసి తన్నుగూర్చి-

---

1. శ్రీమద్భా 1-18-26, 27

2. ఆం.భా. 1-467

"నేను నీ ప్రభుత్వంబునం జెందు రాజసంబు విడిచి యమ్మ
హాత్ముని పాదారవిందములం భక్తినిష్ఠుడనై శరణాగతత్వంబు భజించు
వాఁడను తెలియుడు. రాజసగుణాంతనై యున్న వేళం దెలియంగాం
గావున శాస్త్రంబు ప్రపంచింపక కేవల భక్తిజ్ఞానయోగంబున సేవింతుఁ"
(7-283) అని పలికినట్లుగా వ్రాసియున్నారు. ఈ వాక్యములు
విశిష్టాద్వైత దర్శన ప్రభావముచే పోతనచే చేర్పబడినవి. ఇట్టి భావ-
ములు భాగవతమున పెక్కు తావులందు ప్రపంచింపబడియున్నను
నీ సందర్భమున మాత్రము పోతన కల్పనమే.

భగవద్రామానుజులకు పరమగురువులు-శ్రీవైష్ణవసంప్రదాయ-
మున పరమ ప్రామాణికులనగు శ్రీయామునాచార్యులవారు తమ
స్తోత్రరత్నమున....

"నధర్మ నిష్ఠోస్మి చ దాత్మవేదీ
న భక్తిమాన్ త్వచ్చరణారవిందే।
అకించనోఽనన్యగతి శ్శరణ్య
త్వత్పాద మూలం శరణం ప్రపద్యే॥[1]

(నేను ధర్మనిష్ఠ కలవాడనుగాను. గత్యంతరము కలవాడను గాను.
ఆత్మజ్ఞానము కలవాడనుగాను. అకించనుడను. రక్షకా! నీ పాదము
లనే శరణము జొచ్చుచున్నాను) అని యిట్లు శరణాగతిస్వరూపమును
వెల్లడించియున్నారు. శరణాగతియే విశిష్టాద్వైతసిద్ధాంతము లోకము
నకు విశిష్టముగా నందించిన మహాతత్త్వము.

ఇట్టి శరణాగతి తత్త్వమును పోతన యమూలకమగు నీ కల్పన
ముచే లోకమునకు చాటినాడు.

1. స్తోత్రరత్నము 22వ శ్లో.

రహస్యత్రయముగా శ్రీవైష్ణవులు భావించు వానిలో తిరుమంత్రార్థమును ద్వయమంత్రార్థము వివరించుచుండగా నాద్వయమంత్రార్థమును జరమశ్లోకము వ్యాఖ్యానించుచున్నది. అట్టి చరమ ప్రతిపాద్యము శరణాగతి. అట్టి విశిష్టాద్వైత సిద్ధాంత ప్రసిద్ధమైన శరణాగతత్వంబున భజించునపుడు బ్రహ్మ శ్రీవిష్ణుతత్త్వమును గ్రహింపగలడని పోతన నిబంధించి సంప్రదాయ విషయములందు దనకుగల పేత్తృత్వమును వెల్లడించుకొనినాడు.

మూలమునలేని కల్పనమును గావించి యందు విశిష్టాద్వైత దర్శనమునకు ప్రాణప్రమానమైన "శరణాగతి"యొక్క ప్రసంగమును గొనివచ్చి సమర్థించుటచే పోతన విశిష్టాద్వైతసిద్ధాంతమును క్షుణ్ణముగా నెఱిగినవాడనియు, దత్సిద్ధాంతమువల్ల ననురక్తి యతిమాత్రముగా గలవాడనియు నిశ్చయముగ జెప్పవచ్చును.

4. బ్రహ్మ తపస్సునకు మెచ్చి శ్రీమన్నారాయణుడు వైకుంఠమును జూపినాడు. ఆ సందర్భమున మూలమునలేని భావములతో పోతన....

పలనొప్పగా "నదైవం కేశవాత్పర
మ్మ"ని పల్కు రాజకీరావళియును
మహిమ "జగద్విష్ణుమయ మఖిలమ్మ"ని
చదివెడు శారికా సముదయంబు
నేపారగా "జితంతే పుండరీకాక్ష"
యని లీలబాడు పికావళియును
లవిమీరగా "మంగళం మధుసూదన"
యనుచు బల్కెడు మయూరావళియును
దవిలి ప్రోషత్సుషట్ప్ర ధేశ్యాది శబ్ద

కలితమతిగ గ్రాలు మధువైరి దాసులకును
గలిగి యున్నట్టి దివ్యమంగళవిలాస
మహిమ నొప్పారు వైకుంఠమందిరంబు" (2-228)

అని యత్యద్భుతముగా వైకుంఠ వర్ణనము గావించియున్నాడు. అందు "వర్ధి వతి చేతాత్పరతమ్" ఇత్యాదిశ్రుతులయు మరియుం ఇత్యాది వాక్యములను నీ వర్ణనాంశముల శ్రీవిష్ణుభక్తితో పోతన చేసియుండు నని తోచుచున్నది.

ఈ ఘట్టమున బ్రహ్మకు పరబ్రహ్మము స్వలోకము జూపినాడని మూలమున నుండినది. పోతన మాత్రమాలోకము "అపునరావృత్తి మార్గము" (2-228) అని యమూలకముగా పేర్కొనియున్నాడు. తదనంతరము శ్రీవైకుంఠమున గ్రీడించు నా సర్వేశ్వరుడు "పరమ పురుషుడనియు," "పురుషోత్తముడనియు," "పుండరీకాక్షుడనియు" నారాయణుడనియు, పోతన యమూలకముగనే వివరించియున్నాడు. దీనివలన శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మమని పోతన తాత్పర్య మగుట వ్యక్తమగుచున్నది.

5. విదురుడుద్ధవుని జూచి ద్వారకానగరమునందలి వార్త లడుగు సందర్భమున....

"ధృతరాష్ట్రుడు నరకంబున బడు నాడైన దుఃఖమున నన ఘాత్మ్ము" (3-88) అని ధృతరాష్ట్రుని నిందించి మఱియు....

"అదియునుంగాక పరమశాంతుండవైన నీ మనంబున దుఃఖంబు కర్తవ్యంబు గాదంటిని" (3-87) అని యూరడించినాడు. ఈ వాక్యము మమూలకము. పోతనయే శ్రీకృష్ణపారమ్యమును జీవలక్షణమును వివరింపదలచి తనకుగా దావే యీ ప్రశ్నమును వైచుకొనినాడు.

తమువరి మూలమున గల యీ క్రింది శ్లోకము ననువదించినాడు....

> "సోఽహం హరేర్మర్త్య విడంబనేన
> దృశో నృణాం చాలయతో విధాతుః।
> నాన్యోపలక్ష్యః పదవీం ప్రసాదా
> చ్చరామి పశ్యన్ గతవిస్మయోఽత్ర॥"[1]

ఈ శ్లోకమును పోతన యిట్లనువదించినాడు....

> "సకలలోక విడంబనమున
> హరి పరమపదుండు మానవాకృతితో ని
> ద్ధరబుట్టి యాత్మమాయా
> స్ఫురణన్ మోహింపజేయు భూజన కోటిన్" (3-68)

ఇట్లనువదించి వెనువెంటనే విదురుడు పలికినట్లుగా చెప్పిన పద్యము....

> "కావున నమ్మహాత్ముని వికార విదూరుని సర్వమోహన మా
> యావిల మానసుండ నగునపుడు సంసృతి దుఃఖినాదుని
> ద్దేవుని సత్కృపామహిమ దెలిసినవేళ సుఖింతు నేనకా
> దావిధిశంకర ప్రముఖులివ్విభు మాయ దరింపనేర్తురే" (3-69)

ఈ పద్యమమూలకము. శ్రీకృష్ణ పరమాత్మ మాహాత్మ్యప్రబోధకము. దీనికి వెనువెంటనే.

"అయిన నమ్మహాత్ముని కటాక్షతరంగిణీ పొంగ పరిలబ్ధ విజ్ఞాన దీపాంకుర నిరస్తతమస్తదోషాంధకారుండనగుటం జేసి మదీయచిత్తంబు హరి పరాయత్తంబయిన కారణంబునను దత్త్వంబు సకలంబు నిరీక్షించుచు నుండుదును." (3-70) అని విదురుడు విష్ణుమాహాత్మ్యమును

---

1. శ్రీమద్భా. 3-1-42

వివరించుచు బలికినట్లు పోతన యమూలకముగా నిక్షేపించి తన విష్ణు ప్రీతిని, దాని మూలమున దన విశిష్టాద్వైతానురక్తిని వ్యక్తీకరించి నట్లు తోచుచున్నది.

6. తృతీయస్కంధమున గర్దముడను ముని తపస్సు చేసి విష్ణువు ప్రత్యక్షము కాగా స్తుతించిన సందర్భమున మూలమున....

"ఏకస్స్వయం సన్ జగతస్సిసృక్షయా
ద్వితీయ యాత్మన్నధి యోగమాయయా।
సృజ త్యదఃపాసి పునర్గ్రసిష్యసే
యథోర్ణనాభిర్భగవన్ స్వశక్తిభిః"[1]

ఈ మూల శ్లోకమును పోతన యిట్లనువదించినాడు....

"అనఘా! యొక్కడవయ్యు వాత్మకృత మాయా జాతసత్త్వాదిశ
క్తి నికాయస్థితి నీ జగజ్జనన వృద్ధిక్షోభ హేతుప్రభా
వ నిరూఢిందగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ
ఘనలీలా మహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్ (3-755)

ఈ పద్యమునందలి 'అనఘా!'యను సంబోధనము, మఱియు "సర్వేశ నీ ఘనలీలా మహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్" అను వాక్యము రెండు సమూలకములు.

ఈరెండు కల్పనలతో నీపద్యమును శ్రీమన్నారాయణ పారమ్య ప్రబోధకముగా పోతన విన్యసించినాడు. అనిర్వచనీయమగు నద్వైత మాయయందు ప్రతిబింబితుడైన సగుణబ్రహ్మము కాదీ పద్యమున వర్ణింపబడిన మూర్తి. ఆత్మకృతమాయాజాతమైన జగత్తునకు సృష్టి

1. శ్రీమద్భా. 3-21-19

స్థితి సంహార హేతుభూతమైన ప్రభావము కలవాడు. కావునని పోతన యొక్క యీ పద్యము శ్రీమన్నారాయణుని భువనలీలామహిమార్ణవ మాహాత్మ్యమును మూలమున లేకపోయినను వర్ణించుచున్నది.

"అనేహా" అను సంబోధనమువలన పరబ్రహ్మమునకు గల "అపహతపాప్మత్వము" వ్యక్తమానమై శ్రీమన్నారాయణుని కల్యాణ గుణభరితత్వము చెప్పబడినది.

ఇట్టి యనువాదవిధానము పోతన విష్ణుప్రీతిని విశిష్టాద్వైతాను రక్తిని ప్రస్ఫుటము గావించుచున్నది.

7. చతుర్థస్కంధమున దక్షాధ్వరధ్వంసమైన పిమ్మట సాక్షాత్కరించిన విష్ణువును వర్ణించుచు పోతన.... "ప్రవిమలాత్మీయ దేహజ ప్రభ సరోజభవ భవామర ముఖ్యుల మాన" – (4-168) అని యమూలకముగా రచించెను. ప్రత్యక్షమైన విష్ణుదేవునియొక్క ప్రవిమలమైన దేహమునుండి కలిగిన ప్రభలు బ్రహ్మశంకరాదులగు దేవముఖ్యుల ప్రభలను మాపుచున్నవట. ఈ విషయము మూలమున లేదు.

కాని తరువాత మూలమున "తత్తేజసాపహతరుచః"[1] అను సమాసము కలదు. పోతన దానిని....

"ఆ నలినాయతాక్షుని యనంత పరాక్రమ దుర్నిరీక్ష తే
జో నిహత ప్రదీప్తులగుచున్" (4-169)

అని యనువదించియున్నాడు. కావున నింతకు ముందు జూపినది స్వతంత్రమైనది. అందు శ్రీమన్నారాయణుని రూపముయొక్క

---

1. శ్రీమద్భా. 4-7-23

యుప్రషోతుత్వము లక్షితమైనది. విశిష్టాద్వైతమత సమ్మతమగు సగుణత్వమీ శ్లోకాంతర్గతములచే ప్రస్ఫుటమగుచున్నది. ఎట్లనగా....

సమస్తాశ్శక్తయశ్చైతా నృప యత్ర ప్రతిష్ఠితాః।
తద్విశ్వరూపవైరూప్యం రూపమన్యద్ధరేర్మహత్॥[1]

(ఓ రాజా! ఈ శక్తులన్నియు దేనియందు నిలిచియున్నవో యది విశ్వరూపమునకంటె విలక్షణమగు విష్ణువుయొక్క మఱియొక గొప్పరూపము.) అట్లాదిగా చెప్పంబడిన శ్రీమన్నారాయణ పరబ్రహ్మముయొక్క రూపవైలక్షణ్యము నీ "ప్రవిమలాత్మీయ దేహజ ప్రభ" అను పదములు వివరించుచున్నవి.

మఱియు తరువాత మూలమునగల "తత్తేజసాపహృతచక్షుః" అను పదములకు ననువాదము చేయు సందర్భమునగూడ "అనంతపరాక్రముడు" అనుదానిని మూలమున లేకుండ పోతనయే కల్పించినాడు. "తత్తేజసా" అనుదానిని "దుర్నిరీక్ష్యతేజము" అని యనువదించినాడు. ఈ దుర్నిరీక్ష్యతేజము, ననంతపరాక్రమము ననునవి శ్రీవిష్ణుదేవునకుగల విశిష్టాద్వైతమతసమ్మత సగుణత్వైక వ్యాఖ్యానమునకు దగియున్నవి.

"తేజో బలైశ్వర్య మహావబోధ
సువీర్యశక్త్యాది గుణైకరాశిః।
పరః పరాణాం సకలా న యత్ర
క్లేశాదయస్సన్తి పరావరేశే॥"[2]

---

1. విష్ణుపురాణము 6-7-78
2. " 6-5-85

ఆచార్యులగు సంప్రదాయ ప్రవర్తకులగు శ్రీధరాదుల శ్లోకములు వివరించిన మార్గమున పోతన విష్ణుదేవుని తత్త్వమును విశిష్టాద్వైత దర్శన ప్రదర్శితమైన సిద్ధాంతముల కనుకూలముగా నిరూపించియున్నాడు.

8. దక్షాధ్వరఘట్టమున దక్షుడు విష్ణువును స్తుతించిన సందర్భమున మూలమున గల శ్లోకమిది....

శుద్ధం స్వధామ్న్యుపరతాఖిల బుద్ధ్యవస్థం
చిన్మాత్రమేక మభయం ప్రతిషిధ్యమాయామ్।
తిష్ఠంస్తయైవ పురుషత్వముపేత్య తస్యా
మాస్తే భవానపరిశుద్ధ ఇవాత్మతంత్రః[1]

పోతన యీ శ్లోకము ననువదించిన తీరును గమనించినచో నీతనికి విశిష్టాద్వైత సిద్ధాంతమువల్ల గల మక్కువ వ్యక్తమగును.

"దేవా! నీవు స్వస్వరూపంబు నందున్నపుడు పరతంబులుగాని రాగాద్యఖిల బుద్ధ్యవస్థలచే విముక్తుండవును నద్వితీయుండవును జిన్మాత్రుండవును భయరహితుండవునునై మాయం దిరస్కరించి మఱియు నామాయ ననుసరించుచు లీలా మానుషరూపంబుల నంగీకరించి స్వతంత్రుండవయ్యును మాయాపరతంత్రుడపై రాగాది యుక్తుండునుం బోలె రామకృష్ణాద్యవతారంబుల గానంబడుచుందవు. గావున నీలోకంబులకు నీవ యాశ్రయుండవనియు నితరులైన బ్రహ్మ రుద్రాదులు భవన్మాయావిభూతులగుటంజేసి లోకంబులకు నీశ్వరులు గారనియును భేదదృష్టిగల నన్ను రక్షింపుము. ఈ విశ్వాకారులైన

---

1. శ్రీమద్భా. 4.7.26

ఫాలలోచనుండును, బ్రహ్మయు దిక్పాలురును సకలచరాచరజంతువు లును నీవ భవద్వ్యతిరిక్తంబు జగంబున లేదు." (4-170)

ఈదక్షుని స్తుతిలో సమూలకముగా శ్రీమన్నారాయణునియొక్క పరబ్రహ్మత్వము, నేకత్వమును పోతన తన యనువాద సందర్భ-మున పొందుపరచియున్నాడు.

9. ధ్రువోపాఖ్యానమున గుబేరుడు వరమునిచ్చి యంతర్హితు డైన పిమ్మట ధ్రువుడు తన పట్టణమునకు పోయి భాగవత వర్తనముతో మెలగుచుండెనని చెప్పు సందర్భమున మూలమున....

"సర్వాత్మ న్యచ్యుతే సర్వే తీవ్రౌఘాం భక్తిముద్వహన్।
దదర్శాత్మని భూతేషు తమేవావస్థితం విభుమ్॥"[1]

అని యున్నది. అట్లుండగా పోతన దీనినిట్లనువదించినాడు.

........"సర్వోపాధి వర్జితుడుత్తముడు
సర్వాత్మకుడగు జలజాక్షునందు దీ
వ్రంబై ప్రవాహరూపంబుసైన
భక్తి సలుపుచు నఖిల ప్రపంచమందు
వలర దనయందు నున్న మహాత్ము హరిని
జిదచిదానందమయుని లక్షిపరుబరమ
నీశ్వరేశ్వరు బొడగనె సిద్ధచరిత" (4-387)

ఈ యనువాదములో మూలములోలేని చిదచిదానందమయత్వమును లక్ష్మీ పరత్వమును ప్రస్తావింపబడినది. విశిష్టాద్వైత దర్శనమున శ్రీమన్నారాయణుని బరబ్రహ్మముగా స్థాపించు ముఖ్యాంశములలో

---

1. శ్రీమద్భా. 4-12-11

ఈ విధపు దాసాంతమయత్వము-లక్ష్మీ విశిష్టత్వము లను వానినిఁ బరిగణింతుము. శ్రీవైష్ణవ ప్రవాహ రూపముగు భక్తి కూడ విశిష్టాద్వైతులకు నుపాదేయమే. ఈ విధముగు పరిష్కారమును పోతన సంప్రదాయము నెఱిఁగియే చేసినాఁడని నాయభిప్రాయము.

10. గజేంద్ర మోక్షణ ఘట్టమున మూలమున లేకపోయినను వైకుంఠపుర ప్రస్తావనము గావించినాఁడు పోతన. ఈ సందర్భముననే దివ్యాయుధములను, నిత్యము స్తుతింపఁదగు గరుడుని, ముక్తి పురుషులుగా వైకుంఠమునందున్న యాబాల గోపాలమును, నిత్యానపాయిని యగు శ్రీదేవిని వర్ణించియున్నాఁడు. ఇదంతయు విశిష్టాద్వైత మతమునకే పరమార్థముగా సమన్వయింపఁగలదు. ఆపద్యము లివి—

"అల వైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందార వనాంత రామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై"

(8 · 95)

"సిరికిం జెప్పఁడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁ డు వివాద ప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై" (8 9)

పోతనామాత్యుని మానసాకాశమున మెఱయుచుండిన దివ్యోహాద్యోతము లీ రెండు పద్యములు. ఈ పద్యములకు మూలమున —

"హరి రావిరాసీత్" (హరి యావిర్భవించెను) అనియు—

"చక్రాయుధోఽభ్యగమదాశు యతో గజేంద్రః।"

[ఆ గజేంద్రుఁడున్న తావునకుఁ జక్రాయుధుఁడు వేగముగా వెడలెను] అనియు మంతగాఁ పై రెండు పద్యములలోని భావములను పోతన కల్పించినాఁడు.

గజేంద్రుఁడు మొఱఁబెట్టుకొను సమయమునకు వైకుంఠపురములో నంతఃపురములో రమారమణితో నారాయణుడు వినోదించుచున్నాఁడనియు, నట్టి రసపర్వ సమయమున సైతము విహ్వల నాగేంద్రము యొక్క యార్తారావమును విని 'అనా

శ్చాహమున' సంబంధించినాఁడని పోతన సాభిప్రాయముగా వివరించి భక్తపాలనో ద్యోగమున శ్రీహరికిఁగల సంరంభమును వ్యక్తమానముఁ గావించినాఁడు.

వైకుంఠపురము, లక్ష్మీ సాహచర్యము, నిత్యసూరులు నివియన్నియు విశిష్టాద్వైతులు నిత్యవస్తు సముదాయముగా భావింతురు. ఈ సంప్రదాయము ప్రకారము నివియన్నియు స్వరూపతో నిత్యములు శ్రీమన్నారాయణుఁడే నిత్యవస్తు సముదాయమునకు ప్రాప్యము, ప్రాపకము, వాదారము నైనవాఁడు. నారాయణపదము నకు "నారములకు అయనము" అను వ్యుత్పత్తి చెప్పి యీ యర్థమును సాధించుట విశిష్టాద్వైత సంప్రదాయము. నారములనగా నాశనము లేనివి. అనగా నిత్యవస్తు సముదాయము. ఇట్టి నిత్యవస్తువులను నారాయణుని స్థానమగు వైకుంఠమును నీ సంప్రదాయమువారి పరమార్థములు[1]

ఇట్టి సంప్రదాయ సౌరభమును వెదజల్లుటకే పోతన యమూలకముగా నీ పద్దినముఁ గావించి యున్నాఁడని తలఁతును.

భగవద్రామానుజులు తమ సిద్ధాంతమునఁ బరబ్రహ్మము శ్రీమన్నారాయణు నకు దివ్యస్థాన, దివ్యమంగళ విగ్రహ, దివ్యమహిషీ దివ్యాయుధములు కలవని శ్రుతి స్మృతి పురాణేతి హాసముల నుండి యనేకములగు దృష్టాంతములను ప్రదర్శించి నిరూపించి యున్నారు.[2] పోతన యీ మార్గమునే యనుసరించి మూలమున లేని యీ హృద్యానవద్యములగు పద్యములను వెలయించి యుండును.

నిర్విశేషము, చిన్మాత్రమే బ్రహ్మమను నద్వైత సిద్ధాంతమునఁ బరబ్రహ్మము నకీ "వటాటోపము" కలదనుట పరమార్థము కాదు. విశిష్టాద్వైత సమ్మతము లగు దివ్యస్థానము, దివ్యమహిషీ, దివ్యాయుధములను నిత్య సూరులను మాత్రమే గాక శ్రీమన్నారాయణ పరాయణులై పరమమగు సాయుజ్యముఁ బొంది పరమ పురుష నిత్యకైంకర్య భోగభాజనులగు ముక్తపురుషులందరిని "వైకుంఠ పురంబునం గలుగు వా రాబాల గోపాలమున్" అని పేర్కొని వారినందఱను గొనివచ్చి గజేంద్రమోక్షణ మహాదృశ్యమును పోతన దర్శింపఁజేసినాఁడు.

ఈ సందర్భమున గజేంద్రుఁడు నిల్చియుండిన "సంకటాకరము—" "వైకుంఠపురంబునం బోలె శంఖచక్ర కమలాలంకృతం బై" (8-188)యుండిన

1. అష్టశ్లోకి — ఆంధ్రాను వాదము. పుట-34 - 38
2. వేదార్థ సంగ్రహః

దని పోతన పేర్కొనుట భగవద్రామానుజప్రోక్త విశిష్టాద్వైత సిద్ధాంత మార్గమును తన యనువాదములోఁ బ్రతిఫలింపఁ జేయవలయును సంకల్పము చేసెనేమో యని నా యభిప్రాయము. కానిచో నమూలకముగా విశిష్టాద్వైతమునకుఁ బరమార్గముగా నన్వయించు సంకములతో నీ పద్యములను వ్రాయవలసిన యక్కఱ యుండదు.

11. గజేంద్ర మోక్షణ ఘట్టమున గజేంద్రుఁడు పాహి పాహి యని కుయ్యిడినాఁడు. అతనిని రక్షించుటకు శ్రీహరియుత్సహించినాఁడు. ఆ శరణాగత త్రాణ సంరంభములో శ్రీకుచోపరిచేలాంచలమును సైతము వదలక వేగముగా వెడలెనట దవ్వునకరిగా నాతని వెంటఁబోవుచున్న లక్ష్మి తనలోఁ దానిట్లు వితర్కించినది—

> "తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁడు నాథుం డే స్త్రీ జనాలాపముల్
> వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
> దనుజానీకము దేవతానగరిపైఁ దండెత్తెనో భక్తులం
> గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్"
>
> (8–100)

రఁ దర్కించుచు నట్టి శ్రీహరి వేగముగాఁ గాపాడుటకుఁ దొల్లి వెడలిన సన్నివేశములు కొన్ని వెల్లడి చేయఁబడినవి. అవియన్నియు శ్రీమన్నారాయణుని యాయా దివ్యలీలా ఘట్టములను జ్ఞప్తికిఁ దెచ్చునవి. ద్రౌపదీ మాన పరిరక్షణము, మత్స్యావతారము, వామనావతార ఘట్టము—నృసింహావిర్భావ వృత్తాంతము పై పద్యమున స్మరింపఁబడినవి. ఇది యమూలకముగాఁ బోతన భావించిన కల్పనము.

ఇట్లు ప్రస్తుత గజేంద్ర మోక్షణ ఘట్టమున నీ యన్యావతార ప్రసంగము చేయఁబడుటచే విలక్షణ విగ్రహయుక్తుఁడగు పరమేశ్వరుని సర్వతాది వందక ప్రకారమున నవ్యక్తమగు విభవ స్వరూప వైభవము ప్రకటింపఁబడినదైనది. దీని వలన దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంస్థాపన యను నవతార ప్రయోజనములు స్ఫురించి పరబ్రహ్మమగు నారాయణుని సర్వశక్తిత్వము—భక్తపాలన కళా వైదగ్ధ్యము వ్యక్తమానములగును. దీనిచేఁ బోతనకుఁగల విష్ణుప్రీతి-విశిష్టాద్వైతానురక్తి స్పష్టములగుచున్నది.

12. శ్రీహరి గజేంద్రుని రక్షించినాఁడు. గజేంద్రుఁడు పూర్వ జన్మమున నింద్రద్యుమ్నుఁడను రాజయి, ఖ్యాతుఁడు వైష్ణవ ముఖ్యుఁడునై మౌన

ప్రతమునతో "సవిశేషముగా" వ్యాఖ్యానించి బోధించినవాఁడనియు, సర్వసాక్షి జగత్కర్త శాపవశమున గజరూపము కలిగినదనియు—"హరిచరణ సేవ కతమున నాతనికట్టిన నదికముక్తి"— కలిగినదనియు వివరింపఁబడినది.

మూలమున నింతమాత్రమే యుండఁగాఁ బోతన యీ సందర్భమునఁ దన యభిప్రాయము నిట్లు మూలమున లేనంత స్వీయముగా వెల్లడించినాఁడు

"కర్మతంత్రుఁడగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయ నియత వృత్తి నుండెనేని
జెడును గర్మమెల్ల శిథిలమై వెల్లువఁ
బ్రబలమైన విష్ణుభక్తి చెడదు" (8–)

"చెడుఁ గరులు హరులు ధనములుఁ
జెడుదురు నిజసఖులు సుతులుఁ జెడుఁ జెనఁటులకుం
జెడక మనునట్టి గుణములుఁ
జెడని పదార్థములు విష్ణుసేవానిరతుల్" (8–)

ఈ పద్యములందుఁ గర్మయోగముతో గూడిన భక్తియోగము వలనఁ గర్మ బంధము శిథిలమై మోక్షము కలుగునని విష్ణుసేవానిరతులు శాశ్వతములని పేర్కొని పోతన యీ సందర్భమున విశిష్టాద్వైతమత ప్రసిద్ధములైన తత్త్వహిత పురుషార్థము లను వివరించియున్నాఁడు.

"స్వజ్ఞానం ప్రాపకజ్ఞానం ప్రాప్యజ్ఞానం ముముక్షుభిః।
జ్ఞానత్రయ ముపాదేయ మేతదన్యం న కించన"[1]

అని సంప్రదాయ విదుల యభిప్రాయము. దీనిని బట్టి—

ముముక్షువగువాఁడు—
తత్త్వము (అనగా) జీవ పర స్వరూపము
హితము (అనగా) మోక్షమును బొందుట కాశ్రయింపఁదగు నుపాయము
పురుషార్థము (అనగా) ఫలము

అను నీ మూఁడింటిని దెలిసికొనవలయును.

1. మంత్రరాజ మాహాత్మ్యము






పై పద్యమునందు 1) 'చేతఃపునుష్టి గుణులు' అమ[illegible]స్వరూపమును భక్తిచే సేవింపఁదగిన నారాయణునియొక్క స్వరూపమును వివరించి తత్త్వమును చెప్పినాఁడు.

2) కర్మతంత్రుఁడై కమలాక్షు వర్ణించుచు నుభయ నియత వృత్తితోఁ బ్రవర్తింపవలయునని కర్మయోగ మంగముగాఁ గల భక్తియోగము నుపాయముగా విధించినాఁడు. మఱియుఁ బ్రబలమైన విష్ణుభక్తి చెడదనియుఁ జేతన పదార్థములు విష్ణుసేవా నిరతులనియు నమ్మి నమ్మఁబలికినాఁడు.

3) కర్మ వైఫల్యమును బేర్కొని ఫలరూపమైన ముక్తిని సూచించినాఁడు.

ఈ విధముగాఁ బోతన విశిష్టాద్వైత సంప్రదాయము సమూలముగా వివరించి యున్నాఁడు.

భగవద్రామానుజులు తమ సిద్ధాంతమున నీ విషయమునే—
"జీవ పరయాథాత్మ్యజ్ఞాన పూర్వక వర్ణాశ్రమ ధర్మేతి కర్తవ్యతా
పరమ పురుషచరణ యుగళ ధ్యానార్చనా ప్రణామాదిః అత్యర్థ
ప్రియః తత్ప్రాప్తిః"[1]

అనుచు - జీవ పరస్వరూపములను దెలిసికొని వర్ణాశ్రమాచారములను నిర్వర్తించుచు శ్రీమన్నారాయణునిఁ బ్రణామాదులచే భక్తితో సేవించినచో మోక్ష ప్రాప్తియగునని వివరించియున్నారు.

ఈ విషయమును సరిగ నిదియే సరణిలోఁ బోతన యథామూలముగా వ్యాఖ్యానించుట చూడగా నాతనికి రామానుజ సిద్ధాంత సంప్రదాయము లెస్సగాఁ దెలియుననియు, నాతఁడీ సిద్ధాంతముపట్ల నాకృష్టుఁడనియుఁ జెప్పక తప్పదు

13. దశమ స్కంధమునఁ గంసుని వైరానుబంధమును వివరించుచు మూలమున—

"ఆసీనః సంవిశంస్తిష్ఠన్ భుంజానః పర్యటన్ పిబన్।
చింతయానో హృషీకేశ మపశ్యత్తన్మయం జగత్॥"[2]
అని యున్నది. ఈ శ్లోకమును బోతన యిట్లు యథా మూలముగా ననువదించినాఁడు—

1. వేదార్థ సంగ్రహః
2. శ్రీమద్భా 10-2-26

"ఉఱుఁగుచుఁ గుడుచుచుఁ ద్రావుచు
నరుగుచుఁ గూర్చుండి లేచు నవసరములన్
హరిఁ దలఁచి తలఁచి యగమా
హరిమయముగఁ జూచెఁ గంసుఁ డఖిలజగంబున్"

(10-పూ. కా-85)

పోతన యింతతోఁ దృప్తినొందక స్వతంత్రముగా నొక యద్భుత కల్పనముఁ గావించి యీ వైరానుబంధమును మఱింత విపులముగా వివరించినాఁడు. వైరముచే నైనను శ్రీమన్నారాయణ స్మరణము చేసిన కంసుని వైరభక్తిని వివరించు పద్య మిది–

శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు
    నది హరి రవమని యాలకించు
నక్షిమార్గమున నెయ్యది చూడఁ బడు నది
    హరిమూర్తిగా నోపునంచుఁ జూచుఁ
దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన
    హరి కరాఘాతమో యనుచు నదరుఁ
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన
    హరిమాలికా గంధమనుచు నదరుఁ
బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు
పలుకఁ బడియె ననుచు భ్రమసి పలుకుఁ
దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు
హరి తలంపులనుచు వణఁగఁ దలఁచు" (10- పూ.కా. 87)

పోతన కృతమగు నీ పద్యము నిరంతర స్మరణ రూపమగు వైరభక్తిని వివరించుటకు సదనముగా వ్రాసినది. కంసుఁడు మరణించిన సందర్భమున —

"రోష ప్రమోద నిద్రా
భాషాశన పానగతులఁ బాయక చక్రిన్
రోషరతిఁ జూచియైన ని
శ్శేషరుచిం గంసుఁడతనిఁ జెందె నరేంద్రా"

(10 పూ.కా. 1376)

అని తలయని ముక్తి విశేషము వర్ణింపఁబడినది. ఈ పద్యమునకుఁ బై పద్యము పూర్వ రంగము."

ఎడ తెగని స్మృతి సంతానమును గలిగియుండుట స్మరణము లేక ధ్యానము కాగా ప్రీతి పూర్వకమై యుండుట భగవత్ప్రీతికారణమై మోక్షదాయక మగుట సాధారణ విషయము. కాని ప్రాకృత గుణాతీతుఁడగు శ్రీమన్నారాయణుని తత్త్వము వైరభక్తికిఁ గూడ సమకూలమైన దను విషయ మీ సందర్భము వలన విశదమగుచున్నది. కంసుఁడు తైలధారవలె - నవిచ్ఛిన్నముగ - నిరంతరము - సర్వేంద్రియ వ్యాపారములచే శ్రీహరి స్మృతినే కలిగియుండి వైరభక్తి ననుసరించిన వాఁడాయెను. కావున విష్ణు సాయుజ్యము నందినాఁడు. ఇట్టి సాయుజ్య ప్రాప్తికిఁ గారణమైన వైర రూపభక్తి కనుకూలమైన నిరంతర స్మరణమును నిపుణముగాఁ బోతన యీ ఘట్టమున సమూలకముగా వివరించినాఁడు.

14. బాల కృష్ణుని వర్ణించుచుఁ బోతన కావించిన యొక స్వతంత్ర కల్పన మత్యద్భుతము. విష్ణు పారమ్యమును నిరూపింపనెంచి చేయఁబడిన యమూలక కల్పనమిది.

నారాయణుఁడే పరబ్రహ్మము. అతఁడే కృష్ణుఁడు. శ్రీకృష్ణుఁడు బ్రహ్మ మతఁడే విష్ణువు. శివుఁడు నాతఁడే-అను విశిష్టాద్వైత సిద్ధాంతమిట నవస్థితమగు చున్నది బాలకృష్ణుని చేష్టల వర్ణించు ఘట్టమిది—

1) బాలకృష్ణుఁడు జనులను జూచి గుర్తించు వయస్సునకు వచ్చెను. ఆ విష యమున—

"చూడని వారల నెవ్వరుఁ
జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చిన బాలక
చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్"

(10-పూ.భా 292)

ప్రీతి పూర్వకముగా దనను సేవింపని వారి వంకఁ జూడని శ్రీమన్నారాయణుఁడగు శ్రీ కృష్ణుఁడు లోకులను జూచి గుర్తింపఁగలిగి నాఁడఁట.

2) నామమాత్రమున నవిద్యను బోఁగొట్టఁగలవాఁడు శ్రీకృష్ణ పరబ్రహ్మము. అట్టి యా పరమాత్మ యొక్క బాలకస్థితి –

"నగవుల నలిక్య హోరిమి
నగుఁబాటుగఁ జేయువేల్పు నగవరి యంతన్
నగు మొగముతోడ నెల్లన
నగు మొగమున నమ్మఁ బిలిచి నగవేర్చె నృపా"

(10-పూ భా-293)

3) పరబ్రహ్మము 'అనంతుఁడు' 'అపరిచ్ఛిన్నుఁడు.' 'నిత్యమార్యాదితుఁడు'. అట్టివాఁడు 'అవ్వా ! అవ్వా' యనుట చెప్పినాఁడఁట

"అవ్వల నెఱుఁగక యువ్వరి
దివ్వెల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా
యవ్వలకు సంతసంబుగ
నవ్వా యవ్వా యనంగ నల్లన నేర్చెన్"

(10-పూ భా-294)

శ్రీకృష్ణ పరబ్రహ్మ మాది మధ్యాంత రహితుఁడు కావున తల్లుల నెఱుఁగఁడు. మఱియుఁ బ్రాకృత గుణాతీతుఁడు కావున అనన్యాశ్రితం బవ్వరి దివ్వెల వెలుఁగుచుండువాఁడు అట్టి పరముఁడు ప్రాకృత స్త్రీల నవ్వా యనుట యిది విశేషమని నాఁడు పోతన.

4) శ్రీకృష్ణుఁడు నడువ బోఁగినాఁడు. ఆ వైభవమును పురుష సూక్తార్థముతో జను సంధించి యనుభవించి మనచే ననుభవింపఁ జేసినాఁడు మన పోతన–

"అడుగులు వే గలిగియు రెం
డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం
డడుగిడఁ దొడఁగెను శాత్రవు
లడుగులు నడుగులును వదలి యడుగంటఁబడన్"

(10-పూ.భా-295)

శ్రీకృష్ణుఁడే పురుష సూక్త ప్రతిపాద్యుఁడగు శ్రీమన్నారాయణుఁడు.

"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాఙ్గులమ్॥"[1]

అని యీ పరబ్రహ్మమును పురుషసూక్తము వర్ణించినది.

దీనిని బట్టి పరమాత్మ సహస్రపాదుఁడు ఈ 'సహస్రపాదుఁడు' — అను దానికి శ్రీ ప్రతివాద భయంకర అనంతాచార్యుల వారి సంస్కృత వ్యాఖ్యయు. శ్రీ దే॥ కిం॥ గోపాలాచార్యుల వారి యాంధ్రాను వాదము నిట్లు వివరించినవి-

పాద శబ్దః కర్మేంద్రియాణాం సర్వేషాముపలక్షణం. తేన తత్కార్యం లక్ష్యతే. శిథాచ పరిచ్ఛిన్నా శక్తిమానితి పర్యవసితార్థః ['పాద శబ్దమునకు సకల కర్మేంద్రియములు ముఖ్యార్థములు. వాటి వ్యాపారములు లక్ష్యార్థములు. ఇట్లు చెప్పి.... య పరిచ్ఛిన్న శక్తిసంపన్నుఁడని యర్థము నిర్ణయింపబడెను][2]

ఇట్టి పురుష మూర్తి ప్రతిపాద్యుఁడగు శ్రీమన్నారాయణుఁడే వామనావతారమున రెండు పాదములతో భూమ్యాకాశముల నాక్రమించి యుండినాఁడు. అట్టి యాతఁడే ప్రస్తుతము కృష్ణావతారమున నుగ్రపసుగా నడువ నేర్చినాఁడట. ఈ ప్రసంగము వలన శ్రీకృష్ణుఁడు త్రివిక్రమాద్యవతార విశిష్టుఁడు శ్రీమన్నారాయణుఁడే యని నిశ్చయింపఁబడినది.

5) భాగవత పురాణము ననుసరించి శంకరుఁడు నారాయణు నంశచే బ్రహ్మకు జన్మించినవాఁడు విశిష్టాద్వైత సంప్రదాయమునఁ బ్రధాన ప్రతితంత్రమగు శరీర శరీరి సంబంధమును బట్టి శంకరాదు లందఱు శ్రీమన్నారాయణుని దేహము. దాని కాత్మ పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుఁడే. ఆ నారాయణుఁడే ప్రస్తుతము బాల కృష్ణుని రూపమున నున్నాఁడు శంకరునకు శ్రీకృష్ణ తాదాత్మ్యమును పోతన యట్లుత్ప్రేక్షించినాఁడు—

"తనువున నంటిన ధరణీ పరాగంబు
పూసిన నెఱిభూతి పూఁతగాఁగ
ముందల వెలుఁగొందు ముత్యాలలామంబు
తొగల సంగడికాని తునుక గాఁగ

1. పురుషసూక్తము - 1 మంత్రము.
2. పురుష సూక్తము - 1 మంత్రము.

పాలు ద్రాగంగఁ బైఁబరఁగు కావిరిబొట్టు
కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీల రత్నంబుఁ
గమనీయమగు మెడ కప్పు గాఁగ
హారవల్లు లురగ హారవల్లులు గాఁగ
బాల లీలఁ బ్రౌఢ బాలకుండు
శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును
వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు"

(10 - పూ. భా - 297)

శివునకుఁ దనకు వేఱులేకపోవుటఁ దెల్పునట్లు బాలకృష్ణుఁడు శివుని వలెఁ గన్పట్టినాఁడఁట—

భగవద్రామానుజులు నారాయణ పరత్వమును స్థాపించు పట్టున విష్ణు పురాణము నుండి—

"సృష్టి స్థిత్యన్త కారిణీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్।
స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః॥"

అను ప్రమాణమును ప్రదర్శించి, యీ శ్లోకమునఁ ద్రిమూర్తి సామ్యము తోఁచు చున్నదను శంకను బరిహరించుచు—

"ఏక ఏవ జనార్దనః"—అని జనార్దనున కొక్కనికే పారమ్య మనియు బ్రహ్మ శివుఁడు మున్నగు సకల ప్రపంచమునకు జనార్దనుఁ డాత్మయగుట విధింపఁ బడుచున్నదనియు వివరించి యున్నారు.[1] పోతన యీ మార్గముననే పయనించి యత్యద్భుతపటిమ సత్కృతి వలన విష్ణు తాదాత్మ్యమును వ్యక్తీకరించి యున్నాఁడు.

ఇట్లొక పద్యము సమాలకముగాఁ గల్పించి శ్రీమన్నారాయణ పారమ్యము స్థాపించి తన విశిష్టాద్వైతానురక్తిని, విష్ణు ప్రీతినిఁ బోతన ప్రకటించు కొనినాఁడని చెప్పవచ్చును.

15. బాలకృష్ణుని ముద్దు ముచ్చట్లు చూచి నంద యశోదలు సంతోషించెడు సందర్భమున మూలమునఁ బరీక్షిత్తు శుకయోగినిట్లు ప్రశ్నించినాఁడు—

1. వేదార్థ సంగ్రహః.

1. "నందః కిమకరోద్బ్రహ్మన్ శ్రేయ ఏవం మహోదయమ్ ।
యశోదా చ మహాభాగా పపౌ యస్యా స్తనం హరిః॥[1]

2. పితరౌ నాన్వవిందేతాం కృష్ణోదారార్భకేహితమ్ ।
గాయంత్యద్యాపి కవయో యల్లోక శమలాపహమ్॥"[2]

ఈ శ్లోక ద్వయమును పోతన యిట్లనువదించి యున్నాఁడు—

1. "జగదధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లిగా
నేమి నోము నోచె నీ యశోద
పుత్రుఁడంచు నవనిఁ బోషించు తండ్రిగా
నందుఁడేమి సేసె నందితాత్మ"

(10 - పూ. భా. 350)

2. "ప్రబ్బిన భక్తిని హరిపైఁ
గబ్బంబులు చెప్పి కవులు కైవల్యశ్రీ
కబ్బుదురఁట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్"

(10 - పూ. భా. 351)

ఇందలి రెండవ పద్యము పోతన స్వగతమనఁదగిన యమూలకమగు నద్భుత కల్పనము.

లోక కల్మష హరమగు నే కృష్ణుని వర్తనమును గవులు నేటికి నైతము గానము సేయుచున్నారో యట్టి కృష్ణుని ముద్దు ముచ్చటలు తలిదండ్రులు పొందలేక పోయిరి. అందుకు హేతువేమియని మూలమునఁ బరీక్షిత్తు ప్రశ్నము.

కాని భక్తితో హరిపైఁ గావ్యములు చెప్పిన కవులు కైవల్యశ్రీ పొందుదు రని పోతన నిశ్చయ మీ పద్యమున వ్యక్తము చేయఁబడినది.

భాగవతారంభమున "శ్రీ కైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్" అని నాఁడు. మఱియు భాగవతానువాదమును గూర్చి "దీనిం దెనిఁగించి నా జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్" — అని సంతోషముతోఁ బల్కె

1. శ్రీమద్భా 10 - 8 - 48
2 శ్రీమద్భా 10 - 8 - 49

వాఁడు. రామభద్రుని చరణములపైఁ బ్రశ్నయుంచి — "నేఁ బలికిన భవహర మగునఁట పలికెద వేఱొండు గాథ పలుకఁగనేలా ?" అని ప్రశ్నించుకొనినాఁడు. పోతన యొక్క పై వాక్యముల నీ ప్రస్తుత పద్యార్థముతో సమన్వయించి పరిశీలించినచోఁ బోతన కేర్పడినట్టి నారాయణ ప్రీతియు, నది యాయన రచనమునఁ బ్రతిఫలించిన రీతియు స్పష్టమై యాతని వ్యక్తిత్వము వ్యక్తము కాఁగలదు.

16. బకాసుర వధ ఘట్టమునఁ బోతన మూలమునకేని యొక యపూర్వ భావమును దన యనువాదమున నిమిడ్చినాఁడు. గోపాలురందఱు మడుగున నీరు ద్రాగి యావులకు పెట్టుచుండఁగా బకాసురుఁడు వేగముగా వచ్చి కృష్ణుని మ్రింగి నాఁడని మూలమునఁ జెప్పఁబడినది—

"స వై బకోనామ మహానసురో బకరూపధృక్ ।
ఆగత్య సహసా కృష్ణం తీక్ష్ణతుండో౽గ్రసద్బలీ ॥"[1]

ఈ మూల శ్లోకమును బోతన తన యనువాదమున ననుసరింపక బకాసురుఁడు మడుగు నొడ్డునఁ గాపుకాచి యున్నట్లు చిత్రించినాఁడు. సహజముగాఁ గొంగ నీటికడఁ గాపు కాచియుండి సమయము చూచి మీనాదికములఁ బట్టుటయుఁ – గొంగ యట్లు నిశ్చలముగాఁ గాచి నిలిచి యుండుటను "కొంగజపము" అనుటయు లోకమున నున్నదే. బకాసురుఁ డట్టి కొంగజపము చేయుచున్నాఁడు. ఈ విధానమును బోతన యిట్లు వర్ణించినాఁడు—

"ఎల్ల పనులు మాని యేకాగ్రచిత్తుఁడై
మౌన వృత్తి నితర మమత విడచి
వనము లోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ
జేర్చి బకుఁడు తపసి చెలువుఁ దాల్చె"

(10 - పూ. భా. - 443)

బకునకు శ్రీకృష్ణునిచేతఁ జచ్చుటచేఁ బునరావృత్తి రహిత శాశ్వత వైకుంఠ పదప్రాప్తి సిద్ధించియుండు నన్నది సంప్రదాయజ్ఞుల యభిప్రాయము. అట్టి పరమ పద ప్రాప్తికై తపము చేయుచున్నాఁడు బకుఁడు. కాని ప్రస్తుత జన్మ కర్మమునుబట్టి శ్రీకృష్ణుని గ్రసింపవలెనని వాని తాత్పర్యము. వాని యీ యుభయ విధ సాధారణమగు 'వర్తనమును' గని నిపుణముగా నీ పద్యమున నిరూపించి యున్నాఁడు.

---

1. శ్రీమద్భా 10 - 11 - 55.

బకాసురుఁడు శ్రీకృష్ణు సంతమొందించు పనిలో నిమగ్నుఁడై యితరము లగు పనులన్నియు మానినాఁడు. చేయఁదలఁచిన పనిమీదనే మనసు లగ్నము చేసినాఁడు. తన మనములోని దుష్ట యోచన బయల్పడకుండ మౌనము వహించినాఁడు. ఇతర విషయములపై నాసక్తి విడచినాఁడు. వనమున (అడవి యనిగాని నీటనిగాని యర్థము చెప్పవచ్చును) నిలచినాఁడు. శ్రీకృష్ణునిపై దృష్టి నిలిపి 'కొంగజపము' చేయుచున్నాఁడు. ఇది సాధారణార్థము.

ఇఁక సంప్రదాయార్థము నిట్లు చెప్పవచ్చును. బకునకుఁ గాలము సమీపించినది. శ్రీకృష్ణ పరమాత్మ చేతిలోఁ జచ్చి వైకుంఠమునకుఁ బోవుట వాని యధ్యవసాయము. ఇతర కృత్యముల మానినాఁడు శ్రీకృష్ణుని యందే దృష్టి నిలిపినాఁడు. మౌనవ్రతము పాటించినాఁడు లౌకిక వస్తు సంచయముపై మమకారము విడిచినాఁడు. (అనగా వైరాగ్యమును వహించినాఁడు) వనములో (అడవిలో నని గాని నీటిలో ననిగాని యర్థము చెప్పవచ్చును) నిలిచినాఁడు ఇట్లు కృష్ణుని యందే లగ్నమైన మనస్సుతో దపస్సు చేయ సాగినాఁడు బకుఁడు. ఇందుకు ఫలితముగా శ్రీకృష్ణుని చేతిలో మరణము. వైకుంఠ ప్రాప్తి. బకునకుఁ గలుగఁబోవు నీ సద్గతిని బోతన యట్లు "అన్యాపదేశముగా"— అమూలకముగా సంప్రదాయ సిద్ధముగా వెల్లడించి యున్నాఁడు.

17. శ్రీకృష్ణుఁడు రుక్మిణి నపహరించుకొని పోవుచుండగా రుక్మి యడ్డముగా వచ్చి యెదిరించి పరాజితుఁడైనాఁడు. శ్రీకృష్ణుడు వాని తలను దెగ్రేయ గమకింపగా రుక్మిణి యాతని పాదములు పట్టుకొని రక్షింపుమని వేడుకొనినది. ఆ సందర్భమున —

"యోగేశ్వరా ప్రమేయాత్మన్ దేవ దేవ జగత్పతే।
హంతుం నార్హసి కల్యాణ భ్రాతరం మే మహాభుజ॥"[1]

అని మూలమున నున్నది పోతన యీ మూల శ్లోకము నిట్లనువదించెను—

"కల్ల లేదని విన్నవించుట గాదు వల్లభ! యీతనిం
బ్రల్లదుం దెగఁజూచి చేసిన భాగ్యవంతులమైతి మే
మల్లుఁడయ్యె ముకుందుఁడీశ్వరుఁడంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా!"

(10—పూ.భా-1767)

1. శ్రీమద్భా 10 - 54 - 34.

పోతన పద్యమున రుక్మిణి తన యన్నను బంధించుటకు హేతువుగా(దల్లి దండ్రులకు రా(బోవు దుఃఖమును జెప్పినది. మూలశ్లోకమున ముకుందునీశ్వరు( దల్లు(డై నా(తను బొందుమనుకొనుటకు లజ్జించి — తల్లిదండ్రులు సంతోషించి యుండగా వారిని దుఃఖ పెట్టవలదను భావమును లేదు. ఇది కేవలము పోతన చేసిన యమూలక కల్పన మనే.

దీని వలన శ్రీకృష్ణుని మహాత్మ్యమును - ఈశ్వరత్వమును - రుక్మిణీ దేవి యొక్క పురుషకారమును రుక్మిణీ కృష్ణుల యానుకూల్యమును పోతన ప్రవ ర్తించినా(డు.

ముఖ్యముగా - ఆర్తులను రక్షింపుమని శ్రీదేవి శ్రీమన్నారాయణ పర బ్రహ్మము కడ నెరపు లోక్యము పురుషకారమును (అనగా మధ్యవర్తిత్వమని విశిష్టాద్వైత సంప్రదాయ వేత్తల వాడుక) శ్రీదేవి రూపయగు రుక్మిణి వాధార ముగా(గొని పోతన వివరించి తన విశిష్టాద్వైత సంప్రదాయ పరిజ్ఞానమును— తన్మతము వట్లగల యాభిముఖ్యమును వెల్లడించియున్నా(డు.

18. భృగు వృత్తాంతమున భృగువు శ్రీమహా విష్ణువు యొక్క వక్ష స్థలమునందన్నెను. వెంటనే శ్రీమహావిష్ణువు లేచి తన్ను మన్నింపుమని యనేక విధముల వేడుకొనెను. ఆ సందర్భమున మూలమున నిట్లున్నది—

"ఏవం బ్రువతి వైకుంఠే భృగు స్తన్మంద్రయా గిరా ।
నిర్వృత స్తర్పిత స్తూష్ణీం భక్త్యుత్కంఠా శ్రులోచనః ॥
పునశ్చ సత్ర మావ్రజ్య మునీనాం బ్రహ్మవాదినామ్ ।
స్వానుభూత మశేషేణ రాజన్ భృగు రవర్ణయత్ ॥"[1]

శ్రీమన్నారాయణుడు గంభీరముగా నౌదార్య మాటలు పలుకగా భృగువు భక్త్యా వేశము కలవాడై యేమియు( బలుకకుండ వెనుదిరిగి వెడలి మునిపుంగవులతో జరిగినది వివరించినట్లు మూలశ్లోకము లందున్నది.

కాని "అ మ్మునీంద్రుడు వనంత కల్యాణ గుణనిధి నభినందించి"

(10-ఉ.భా-1278)

మరలి మునీశ్వరుల కడకు(బోయినట్లు పోతన యనువదించినా(డు.

---

1. శ్రీమద్భా 10 - 89 - 13, 14 శ్లో.

పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుఁడు కల్యాణగుణ విశిష్టుఁడు-హేయగుణ రహితుఁడు ననియు-పరబ్రహ్మము నిర్విశేషము కాదనియుఁ జెప్పెడు విశిష్టాద్వైత సిద్ధాంతమునకీ యమూలక కల్పనము మిక్కిలి యనుకూలమగుచుండెఁగాక భాగవతమున శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని ప్రతిపాదింపఁబడినదని చెప్పుటకీ ఘట్టము చక్కని తార్కాణగానున్నది.

తదుపరి భృగువు చెప్పినది విని మును లాశ్చర్యపడి మనస్సులలోని సందేహములు తొలఁగిపోఁగా —

"చిన్మయాకారుఁడు శ్రీపతిఁ
దమవమఁ దనవద్యుఁ దఖిల కల్యాణ గు
ణాకరుఁ డాదిమధ్యాంత రహితుఁ
డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడ
కాక గణుతింప దైవ మొక్కరుఁడు లేఁ
డంచుఁదె యనుబుద్ధి విజ్ఞాన కలితులగుచు
హరి పదాబ్జాత యుగళంబు నర్థిఁగొలిచి" (10-ఉత్త-1279)

(వచనము) —"అట్లు సేవించి యవ్యయానందంబగు వైకుంఠ ధామంబు నొందిరి" (10 - ఉ.త్త-1280) అని పోతన తదనంతర విషయమును వివరించెను.

ఇందు "అఖిల కల్యాణ గుణాకరుఁడు" అనునది గుర్తింపవలసిన దశము. ఇది యచ్చముగా భృగు మహర్షి యాలోచనముతో సంపదించినది. శ్రీమన్నారాయణుఁడు కల్యాణ గుణ విశిష్టుఁడను భగవద్రామానుజమత సిద్ధాంతమును తెలుఁగు భాగవతము మఱియు పోతనామాత్యుఁడును సమర్థించినట్లు చెప్పుటకీ యుదాహరణము ప్రబల లక్ష్యము. మఱియు—

"పుండరీ కాక్షుఁ డొకఁడు
గాక గణుతింప దైవ మొక్కరుఁడు లేఁ
డంచె"— (10-ఉ.త్త-1279)

అని నిశ్చయించుకొని మును లుండుట శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమనుటకు తత్త్వ మోదాహరణము. ఇదియు మూలమునకు భిన్నముగా పాగిన యనువాదమే. ఈ భృగు వృత్తాంతమునకుఁ జెవర మూలమున—

"పురుషస్య పదాం భజసేవయా సద్గతిం గతాః"[1]

అని యున్నది. పోతన యా విరమునకు గతిని విశిష్టాద్వైత సిద్ధాంత విధేయముగా వైకుంఠలోక ప్రాప్తిగాఁ దేల్చినాఁడు. పోతన వాక్యమిది—

"అట్లు సేవించి యవ్యయానందం బయిన వైకుంఠ
ధామంబు నొందిరి" (10-ఉ.భా- 1280)

ఇట్లే తుట్టతుదను పోతన యొక్క విశిష్టాద్వైత మతాను రక్తి వెల్లడింపఁబడినది—

19. మకరిము దాని నుండి తన్ను రక్షింపుటకుఁ బరమాత్మను గూర్చి గజేంద్రుఁడు మొరపెట్టుకొను సందర్భమున మూలమున—

"నారాయణాఖిల గురో భగవన్ నమస్తే"[2]

అని ప్రార్థించినట్లు కలదు. కాని పోతన యనువాదములో —

"వేల్పులు నమో నారాయణాయేతని
ష్కాములై మ్రొక్కిరి మింట హస్తి దురవస్థావక్రికిం జక్రికిన్"
(8-107)

అని వేల్పులు గజేంద్ర పాలన కళా సంరంభియగు శ్రీమన్నారాయణుని గూర్చి యాకాశమున మ్రొక్కినట్లు మార్పు చేయఁబడినది.

ఇట్లు గజేంద్రుఁడు ప్రార్థించినట్లు మూలములో నుండగా దేవతలు పల్కినట్లు మార్చుటలోను—

మరియు గజేంద్రుఁడు-నారాయణాఖిల గురో భగవన్నమస్తే-యని ప్రార్థించినట్లుండఁగా "నమో నారాయణాయ"-అని దేవతలు మ్రొక్కి పల్కినారని మార్చుటలోను పోతన యభిప్రాయమేమి ? ఈ విషయమును బాగుగాఁ బరిశీలింపగాఁ దేలిన దేమనగా "నమో నారాయణాయ" అనునది తిరుమంత్ర ఖండము. దీనికిఁ బ్రణవమును జేర్చిన నది మంత్రరాజమగు "అష్టాక్షరి" కాఁగలదు. విశిష్టాద్వైత సంప్రదాయమున నీ 'అష్టాక్షరి'లోని నమో నారాయణాయ యను పదములకు గల యర్థమును బూర్వాచార్యులు వివరించియున్నారు. శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులలోఁ బ్రాతఃస్మర

1) శ్రీమద్భా 10-89-20 :
2) శ్రీమద్భా 8-

శేయులగు శ్రీ పిళ్ళై లోకాచార్యులవారు తమ "ముముక్షుప్పడి" యను గ్రంథము నందును, విశిష్టాద్వైత మతమునకు భగవద్రామానుజుల యనంతర మట్టి వారుగా పేరు పొందిన శ్రీ వేదాంత దేశికులవారు తమ "రహస్యత్రయ సారము" అను గ్రంథమునందును, సంప్రదాయ ప్రవర్తకులలో ప్రథమగణ్యులగు శ్రీభట్టరు వారు తమ "అష్టశ్లోకి" యందును నీ పదములను గూర్చి విపులముగా చర్చించి సంప్రదాయార్థములను వివరించినారు.

ఇట్టి సంప్రదాయ ఖ్యాతి గలిగిన నమో నారాయణాయ యను నీ పద ప్రయోగమును పోతన సమన్వయించి గజేంద్రునిచే గాక పెద్దలచే ననుసంధింపజేయుటలోని యౌచిత్య మేమనగా - గజేంద్రుడు "భరన్యాస పూర్వకమైన" "ప్రపత్తి"నంతకు ముందే చేసియున్నాడు.

ఇక పెద్దలలో యపూర్వమైన శ్రీమన్నారాయణ దర్శనముచే పవిత్రులై యాతని పరబ్రహ్మత్వమునను విధేయులై ప్రపత్తి చేసినారను విశేషార్థ మీ సంపుటనము వలన వ్యక్తమగుచున్నది. ఇందువలన శ్రీమన్నారాయణుని యద్వితీయమగు పరతత్త్వము స్థాపింపబడినది.

ఇట్లు పోతన మూలము ననుసరించి తన శ్రీవైష్ణవ సంప్రదాయ వైశిష్ట్యమును వెల్లడించుకొనినాడు.

ఇచట నొక సంప్రదాయార్థమును గూర్చి ముచ్చటింపవలసియున్నది. "ఓం నమో నారాయణాయ" అనునది తిరుమంత్రము. అది అష్టాక్షర సమాయుక్తమై యుండగా నిట దేవతల ప్రణవమును విడిచి 'నమో నారాయణాయ'-అని మాత్రమే చెప్పినట్లున్నదిగదా ! ఇది సరియా ? యను సందేహము కలుగుట సహజము.

ఈ విషయమున నొకచో శ్రీ వేదాంత దేశికులు చేసిన సమర్థనము గమనింపవలసియున్నది —

"కిం తత్ర బహుభిర్మంత్రైః కిం తత్ర బహుభిర్వ్రతైః।
నమో నారాయణాయేతి మంత్ర స్సర్వార్థ సాధకః॥"[1]

అని నిర్దేశించుచు — ప్రణవమును విడిచి పెట్టినను-నదియున్నను గలుగు ఫలము సమానమే యని శ్రీవేదాంత దేశికుల వారు వ్యాఖ్యానించియున్నారు.

1) రహస్యత్రయ సారము - మూలమంత్రాధికారము పుట 474

ఇట్టి శిష్టమైన సంప్రదాయము నెఱిఁగియే మన పోతన యీ శ్లోకమును విశ్వ హృదయముగా నెంచి యుండునని భావింపఁదగును.

20. శ్రీకృష్ణుఁడు నరకాసురుని సంహరించిన పిమ్మట భూదేవి నరకపుత్రుని తీసుకొని వచ్చి శ్రీకృష్ణునకుఁ జూపి వానిని రక్షింపుమని వేఁడుకొనినది. ఆ సందర్భమున మూలమున నిట్లున్నది—

"తస్యాత్మజో౾యం తవ పాద పంకజం
భీతః ప్రపన్నార్తి హరోప సాదితః ।
తం పాలయైనం కురుహస్తపంకజం
శిరస్యముష్యాఖిల కల్మషాపహమ్॥[1]

'ఇతఁడు నరకుని పుత్రుఁడు. భీతుఁడై నీ పాదముల నాశ్రయించినాఁడు. ఇతని రక్షింపుము. సమస్త కల్మషములను బోఁగొట్టునట్టి యీ నీ హస్తము నితని శిరస్సున నుంచుము'— అని పై శ్లోకమున భూదేవి ప్రార్థించినట్లు వర్ణింపఁబడినది.

ఇందు 1) భీతుఁడై నీ పాదముల నాశ్రయించినాఁడు
2) కల్మషాపహమైన నీహస్తము నితని శిరస్సున నుంచి రక్షింపుము.
3) ప్రపన్నార్తిహర అను సంబోధనము

ఈ మూడంశములు ప్రధానములు.

పోతన యీ శ్లోకము నొక విశిష్టవిధానమునఁ దెనిఁగించి యున్నాఁడు —

"దయ నిటు సూడు మా నరక దైత్యుని బిడ్డఁడు వీఁడు నీదెసన్
భయమున నున్నవాఁడు గడుబాలుఁ డనన్య శరణ్యుఁ డార్తుఁ డా
శ్రయ రహితుండు తంత్రక్రియ కార్యము నేరఁడు నీ పదాంబుజ
ద్వయిఁ బొరఁగాంచె భక్తపరతంత్ర సురక్షణ! నీరజేక్షణా!

(10 - పూ.భా - 204)

సంప్రదాయజ్ఞుఁడగు పోతన శ్రీవైష్ణవ సిద్ధాంతమునఁ బూర్వాచార్యులచే విశ్లేషింపఁబడిన ప్రపన్న లక్షణములతోఁ గూడిన వానినిగా నరకపుత్రుని - భూదేవిచే వర్ణింపఁజేసినాఁడు.

---

1. శ్రీమద్భా 10 - 59 - 31

పోతన యనువాదమున సరసముగాఁ జోటుచేసికొనిన ప్రపన్న లక్షణములు—

1) కరుణార్హుఁడు—అనగా దావల్యయుక్తుఁడు
2) అనన్య శరణ్యుఁడు
3) ఆర్తుడు
4) ఆశ్రయ రహితుఁడు.
5) తంత్రక్రియ కార్యము నేరఁడు.

ఆపైన మూలమునఁగల ప్రపన్నార్తి హర యను సంబోధనమును భక్త పరతంత్ర సుపీతః ! —దీన రక్షకా — అని మార్చినాఁడు.

పోతన గావించిన యీ మార్పు వలన నరకపుత్రునిలో సంపూర్ణముగాఁ బ్రపన్న లక్షణము లేర్పడినవి. భూదేవి యాబాలుని రక్షింప సమకట్టి యట్టి రక్షణము శ్రీమన్నారాయణుని వలన మాత్రమే సాధ్యమనియు - నారాయణ కారుణ్యముపడఁ గావలసిన — అనన్య శరణ్యత్వము - అనన్యగతిత్వము - అనన్య భోగ్యత్వము - అనువానిని గుర్తించి యిట్లు ప్రార్థించినట్లు వ్రాయుట పోతన యాంతర్యము.

భగవద్రామానుజులకుఁ బూర్వాచార్యులగు శ్రీ యామునులు స్వోపదేశముగాఁ బ్రపన్న లక్షణముల నిట్లు పేర్కొనియున్నారు

"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తిమాంస్త్వచ్చరణారవిందే !
అకించనోఽనన్యగతిశ్శరణ్య
త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"[1]

ఈ శ్లోకమున 1) ధర్మనిష్ఠ లేకపోవుట 2) ఆత్మజ్ఞానము లేకపోవుట 3) భక్తి లేకపోవుట 4) అకించనుఁడై యుండుట 5) శరణ్యుఁడు 6) అనన్యగతి గలవాఁడగుట 7) భగవత్పాదమూలముల నాశ్రయించుట - అనునవి ప్రపన్న లక్షణములుగాఁ బేర్కొనఁబడినవి. ఈ మార్గముననే పోతన యనువాదము సాగినది. పోతన విశిష్టాద్వైతమునఁ బ్రపన్న లక్షణములనెఱిఁగియే యిట్టి యనువాదమును జేసినాఁడనుట యుక్తము.

---

1. స్తోత్రరత్నము శ్లో 22

21. బ్రాహ్మణ పుత్రులని గొని వచ్చుటకు కృష్ణార్జునులు వైకుంఠ లోకమునకు వెడలిన సందర్భమునఁ బోతన యనువాదము స్వతంత్రముగా విశిష్టాద్వైత సమ్మతముగా సాగినది.

మూలమున -

"తతః ప్రవిష్టః సలిలం నభస్వతా
బలీయసైజద్బృహదూర్మిభూషణమ్।
తత్రాద్భుతం వై భవనం ద్యుమత్తమం
భ్రాజన్మణి స్తంభ సహస్ర శోభితమ్॥"[1]

అని యుండగాఁ బోతన దీనినిట్లను వదించియున్నాడు —

"దారు దివ్యమణి సహస్ర సంభాసి రామంబును, నాలంబిత కమనీయ నూత్నరత్న మాలికాలం కృతంబును, భానుశశిమయూఖా గమ్యంబును, వసంత తేజో విరాజితంబును, బునరావృత్తి రహిత మార్గంబును నిత్యైశ్వర్య దాయకంబును నవ్యయంబును నత్యుస్నతంబును నసూన విభవంబును బరమయోగీంద్ర గమ్యంబును బరమ భాగవత నివాసంబునునై యొప్పు దివ్యధామంబునందు"

(10 - ఉ.భా - 1307)

ఇట్లు స్పష్టముగా—

శ్రీమన్నారాయణుని లోకమని చెప్పఁబడు వైకుంఠమును వర్ణించి యున్నాఁడు. ఇందు వైకుంఠలోకము పునరావృత్తి రహితమనుట— అవ్యయము నత్యున్నతము బరమ భాగవత నివాసమును ననుట కేవలము విశిష్టాద్వైత సమ్మతమగు విషయము. మూలమున నిట్టి ప్రసంగము లేకపోయినను బోతన ప్రత్యేకముగాఁ జేర్చియున్నాఁడు.

మఱియు మూలమున నా సందర్భముననే—

"సునంద నంద ప్రముఖైః స్వపార్షదైః
శ్చక్రాదిభి ర్మూర్తి ధరై ర్నిజాయుధైః॥
పుష్ట్యా శ్రియా కీర్త్యజయా-ఖిలర్ధిభిః
నిషేవ్యమాణం పరమేష్ఠినాం పతిమ్॥"[2]

---

1. శ్రీమద్భా 10 - 89 - 53
2. " 10 - 89 - 57

యని యుండఁగాఁ బోతన తన యనువాదమున నిట్లు పేర్కొని యున్నాఁడు-

"మఱియు నందాది తరుణ సంసేవితు, నానంద కందళిత హృదయారవిందు, నరవింద వాసినీ వసుంధరా సుందరీ సమేతు, నారద యోగీంద్ర సంకీర్తనానందితు, నవ్యయు, ననఘు, నప్రమేయు, నజితు, నవికారు, నాది మధ్యాంతరహితు, భవ విలయాతీతు, కరుణా సుధాసముద్రు, నచ్యుతు, మహాపురుషుఁ బరమపురుషు నిఖిల జగదుత్పత్తి స్థితిలయకారణుఁ జిదచిదీశ్వరు, నష్టభుజు, గౌస్తుభ శ్రీవత్సవక్షు, శంఖ చక్ర గదాపద్మ శార్ఙ్గాది దివ్యసాధను సర్వశక్తి సేవితుఁ బరమేష్ఠిజనకు నారాయణుం గనుంగొని" (10-ఉ-1312)

ఈ యనువాదము విశిష్టాద్వైతమత ప్రభావముచేఁ బోతన గావించినదనుట సర్వ సమ్మతము.

ఇందు ముఖ్యముగా గుర్తింపఁదగినది- "చిదచిదీశ్వరు"- అను విశేషణము. మూలమునలేని యీ సమాసమును బోతన విశేషముగా నిటఁ బ్రయోగించి యున్నాఁడు. "విశిష్టాద్వైత దర్శనమున" శ్రీమన్నారాయణుఁడు చిదచిద్విశిష్టుఁడని వ్యవహారము. చిత్తగు జీవుఁడు-నచిత్తగు ప్రకృతియుఁ బరమేశ్వరుని శరీరము. పరమేశ్వరుఁ డగు శ్రీమన్నారాయణుఁ డా చిదచిత్తులకు నీశ్వరుఁడని యీదర్శనము బోధించుచున్నది.

మఱియు శ్రీమన్నారాయణుని వర్ణనమందు- అవికారుఁడు- ఆది మధ్యాంత రహితుఁడు- భవవిలయాతీతుఁడు- నిఖిల జగదుత్పత్తి స్థితిలయ కారణుఁడు- అను విశేషణములన్నియు నాతఁడే పరబ్రహ్మమని నిరూపించుచున్నవి. ఇందు కొన్ని యమూలకములే.

మఱియు మూలమున లేని- కరుణాసుధా సముద్రుఁడు అను విశేషణము వలనఁ బరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుని కల్యాణ గుణములలోని "కారుణ్యము" పేర్కొనఁబడినది. అవ్యయుఁడు, అవికారుఁడు, అనఘుఁడు- అనునవి పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుని హేయ గుణరాహిత్యమును సూచించుచున్నవి. దీనిచే భగవద్రామానుజుల వారియొక్క సిద్ధాంతమునఁ జెప్పఁబడిన పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణునకుఁ గల కల్యాణ గుణ కలితత్వము, హేయగుణ రాహిత్యము ప్రసక్తములైనవి. ప్రత్యేకముగాఁ బరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడనియు-

నాతఁడు నిర్విశేషుఁడు- నిర్గుణుఁడు గాఁడనియు, సవిశేషుఁడు- సగుణుఁడునని నిర్దేశించు విశిష్టాద్వైత సిద్ధాంతమున కీ పద్యమునందలి యీ దృశమగు నిర్వహణ మనుకూలమై పోతన కవియొక్క యాంతర్యమును బట్టి యిచ్చుచున్నది.

22. వృకాసుర వృత్తాంతమున భీతుఁడై శివుఁడు వైకుంఠమునకు వెడలిన సందర్భమున మూలమున-

"తతో వైకుంఠ మగమత్ భాస్వరం తమసః పరమ్।
యత్ర నారాయణ స్సాక్షా ద్న్యాసినాం పరమాం గతిః॥
శాన్తానాం న్యస్త దండానాం యతో నావర్తతే గతః॥"[1]

అని వైకుంఠ వర్ణనము చేయఁబడి యున్నది.

పోతన యీ శ్లోకభావము ననువదించిన విధానమిది-

"నిరుపమానందమై నిఖిల లోకములకు
నవలయై యమృత పదాఖ్యఁదనరి
దినకర చంద్ర దీధితులకుఁ గోరరాక
నలఘు సహజ తేజమున వెలుఁగ
సమధికంబగు శుద్ధ సత్త్వగరిష్ఠమై
కరమొప్పు యోగీంద్ర గమ్యమగుచు
హరి పదధ్యాన పరాయణులైన భ
క్తాసుల కలరు నివాస మగుచుఁ
బ్రవిమలానంద కేళీవిరాజమాన
దివ్యమణి హేమకలిత సందీప్త భవ్య
సౌధమంటప తోరణ స్తంభ విపుల
గోపురాది భాసురము వైకుంఠపురము (10-ఉత్త-1251)

ఈ యనువాదమున వైకుంఠవర్ణనమును భక్తిశ్రద్ధలతోఁ జేసినాఁడు భక్తపోతన యని చూడగనే తోచుచున్నది. మఱియు – అమృత పదాఖ్యదనరుట – శుద్ధసత్త్వగరిష్ఠ మగుట - భక్తాసుల కలరు నివాసమగుట - ఇవియన్నియు సమూలకములు పోతన, విశేషాభిముఖ్యముతో - విశిష్టాద్వైతా మరక్తితోఁ గావించిన కల్పన లివియన్నియు.

1. శ్రీమద్భా 10-88-25, 26

తదనంతరము మూలమున -

"తం తథా వ్యసనం దృష్ట్వా భగవాన్ వృజినార్దనః।
దూరాత్ ప్రత్యుదియా ద్భూత్వా బటుకో యోగ మాయయా॥"[1]

అదిమాత్రముండగాఁ బోతన తన యనువాదమున విపులముగా -

"క్రమంగొని యమ్మహాస్థానంబు డాయంజనుటయు నప్పుండరీకాక్షుం డఖండ వైభవంబునం గుండలీశ్వరభోగతల్పంబునం బరమానంద కందళిత హృదయారవిందుండై యిందిరానయనచకోరరుచిర విలసన్మందహాస సాంద్రచంద్రికా వితతిం దేల్చుచు నార్తరక్షణ రతుండు వనిగా మెలంగుచు వివిధ వినోదంబులం దగిలి యుండియు ఫాలలోచనుం దద్దనుజపాలనకుం దలంపకయిచ్చిన వరంబు దన తల మీదవచ్చినం గలంగి చనుదెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి యక్కాలకంధరుని యవస్థ విచారింపఁదలంచి యయ్యిందిరాదేవితోడి వినోదంబు చాలించి" యప్పుడు మాయావటుని రూపమును ధరించినట్లు వర్ణించినాఁడు. (10-ఉ-1052)

ఇదియంతయుఁ బోతన యమూలకముగనే గావించినాఁడు.

23. తృతీయ స్కంధమున - రుద్రగణములవలన విశ్వక్షోభము గలుగగా బ్రహ్మవారిని రావించి 'మీ సృష్టిచాలును తపస్సుచేయుఁడు' - అని చెప్పిన సందర్భమున -

"తపసైవ పరంజ్యోతి ర్భగవంత మధోక్షజమ్।
సర్వభూత గుహావాస మంజసా విందతే పుమాన్॥"[2]

పరంజ్యోతియు, నధోక్షజుఁడును సర్వభూత గుహావాసుఁడునునగు పరబ్రహ్మను బురుషుఁడు తపస్సుచే మాత్రమే పొందఁగలఁడు - అని బ్రహ్మ రుద్రగణములతో నన్నట్లు మూలము.

ఈ మూలశ్లోకమును బోతన యీ క్రింది విధమున ననువదించి యున్నాఁడు-

"భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వ భూ
త గుహావాసు నధోక్షజున్ నిజజన త్రాణైకపారీణు నా
జగదాత్ముం గనుచుందు రార్యులు దపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై" (3-373)

---

1. శ్రీమద్భా 10-88-27
2. శ్రీమద్భా 3-12-19.

ఈ యనువాద పద్యమునఁ బోతన మూలమునఁగల 1. పరంజ్యోతి 2. అధోక్షజుఁడు 3. సర్వభూతగుహావాసుఁడు - అనువానిని విడువక తక్కిన విశేషణములను విశిష్టాద్వైత సిద్ధాంతానుకూలముగా సమూలకముగఁ జేర్చియున్నాఁడు.

అందు ముఖ్యముగా భక్తులు కోరఁదగిన విధముగా -

1. శక్తిసామర్థ్యములు గలవాఁడనుటకు భగవంతుఁడను పదమును,
2. భక్తులను గుణించుటకుఁ గృపాపారీణుఁడను పదమును,
3. పురుషకారమునెరపి భక్తులకు భగవంతునితో సమసంధానము గలిగించునట్టి లక్ష్మీదేవి ప్రమేయముగల లక్ష్మీశ్వరుఁడను పదమును,
4. విశిష్టాద్వైత సిద్ధాంతములోఁ బరబ్రహ్మ లక్షణములలోని సగుణత్వమును తెలుపునట్టి 'సుగుణభ్రాజితున్' అను పదమును
5. విశిష్టాద్వైత సిద్ధాంతములోఁ బ్రపన్నులకు భగవంతునిలోఁ గోరఁదగిన శ్రిత జన త్రాణైక పారీణత్వమును తెలుపునట్టిదగు శ్రితజనత్రాణైక పారీణుఁడను పదమును -
6. శ్రీమన్నారాయణ పారమ్యమును సూచించు 'పురుషోత్తముఁ'డను పదమును ప్రత్యేకాభినివేశముతో నిక్షేపించినాఁడు. ఇఁక హరి - అచ్యుతుఁడు - వరుఁడు - ప్రభువు - జగదాత్ముఁడు - అను పదములు పరబ్రహ్మత్వద్యోతకములు.

ఇట్లు మూలమున లేని కతిపయ విశేషణముల సాయమునఁ బోతన తన విష్ణుప్రీతిని - విశిష్టాద్వైత సంప్రదాయ వైశిష్ట్యమును వెల్లడించురీతిగా పద్యమును నిర్వహించినాఁడు. కానిచో నిట్టి యనువాద విధానము ననుసరింపవలసిన యావశ్యకము లేదు.

24. తృతీయ స్కంధమున విదురుఁడు మైత్రేయునితో బ్రహ్మ సృష్టిని గూర్చి యడుగగా వాఁడు వివరించిన సందర్భమున మూలమున నిట్లున్నది —

"శ్లో — శయిష్టాబ్ధి సలిల మండకోశో నిరాత్మకః॥
సాగ్రం వై వర్ష సాహస్ర మన్వవాత్సీ త్తమీశ్వరః"[1]

---

1. శ్రీమద్భా 3-20-15.

ఈ మూలశ్లోకమును పోతన యీ క్రింది విధముగ ననువదించియున్నాఁడు--

"నారాయణాఖ్య నన్నుతి నొప్పు బ్రహ్మంబు
సాహస్ర దివ్య వర్షంబులోలి
వసియించియుండె" (3-720)

ఇందుఁ బ్రత్యక్షముగాఁ బరబ్రహ్మము నారాయణాఖ్యచే నొప్పునని పోతన వివరించియున్నాఁడు. మూలమున "ఈశ్వరివి" అను పదము ప్రయోగింపఁబడి నది.

ఈ యనువాదము 'నారాయణుండే పరబ్రహ్మము' అని సిద్ధాంతీకరించునట్టి రామానుజ సిద్ధాంతమును నిరూపించును.

ఈ యుదాహరణము వలనఁ బోతన విష్ణుప్రీతియు-విశిష్టాద్వైతానురక్తియు వ్యక్తమగుచున్నవి.

25. ప్రథమ స్కంధమునఁ బాండవుల మహా ప్రస్థానమును వివరించు పం క్తిగా మూలమున నిట్లు చెప్పఁబడినది—

"యచ్ఛ్రద్ధయైతద్భగవత్ప్రియాణాం
పాండోః సుతానామితి సంప్రయాణమ్ ।
శృణోత్యలం స్వస్త్యయనం పవిత్రం
లబ్ధ్వా హరౌ భక్తిముపైతి సిద్ధిమ్ ॥"[1]

దీనిఁ బోతన యనువాదము చేసిన విధానమిది —

"పాండవ కృష్ణుల యానము
పాండురమతి నెవ్వఁడైనఁ బఠించిన విన్నన్
ఖండిత భవుఁడై హరి దా
సుండై కైవల్య పదముసొచ్చు నరేంద్రా!" (1-389)

మూలమున హరిభక్తినిఁ బొంది సిద్ధినిఁ గాంచునని మాత్రముండగా దానిని హరిదాసుఁడై కైవల్యమునఁ బ్రవేశించునని పోతన వివరించియున్నాఁడు. దాసత్వము-అట్టి శ్రీహరి దాసత్వముచే కైవల్యమును బొందుట యనునవి విశిష్టాద్వై

1. శ్రీమద్భా. శ్రీవీరరాఘవీయ వ్యాఖ్య 8-3-30

తాను కూడ తానమును- వీనికిఁ దోడు "పొచ్చున" అను క్రియ వైకుంఠ గమనమును నిర్దేశించుచు విశిష్టాద్వైతానుకూలమై యున్నది.

26. గజేంద్ర మోక్ష ఘట్టములో గజేంద్రుఁడు గావించిన ప్రార్థనము పరమేశ్వరుని గురించి- మూలమున నది యొక దేవుని పరముగా గాక 'ఎవఁడు. పరబ్రహ్మమోవాని' పరముగా సాగినది. ఈ విషయమే శ్రీ వీరరాఘవీయమను భాగవతమునకుఁగల విశిష్టాద్వైత వ్యాఖ్యలో నిట్లు పేర్కొనఁబడినది - "స్తోత్రే బ్రహ్మ విష్ణుశివాది శబ్దరహితే-వ్యక్తి విశేషాణాం బ్రహ్మాదిష్వ సంభవాన్నతే సమాగతాః వస్తు సామర్థ్యా న్మమిష్ఠోత్తమ ఏవ విశేషణానన్వితత్వాత్ ఏవ ఆగత ఇతి భగవతో వాస్తవా న పచ్ఛిన్న మాహాత్మ్య యోగో దర్శితః"[1]

[స్తోత్రమందు బ్రహ్మయని గాని, విష్ణువనిగాని, శివుఁడని గాని ప్రత్యేక శబ్దములు ప్రయోగింపఁబడక పోయినను పేర్కొనఁబడిన విశేషణములు బ్రహ్మాదులందు సంభవములు కావున వారెవ్వరు రాలేకపోయిరి. వస్తు సామర్థ్యము వలన పేర్కొనఁబడిన విశేషములకు సరిపడిన వాఁడగుటచే శ్రీమన్నారాయణుఁడు గజేంద్ర రక్షణార్థము వచ్చినాఁడనుటచే నాతని మహిమము వర్ణింపఁబడినది]

ఈ పై వాక్యముల వలన గజేంద్ర ప్రార్థన మే యొక్క దేవునకుఁ బ్రత్యేకించినది కాదని స్పష్టమగుచున్నది.

కాని పోతన మాత్రము పరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడేయని నమ్మియుండుట చేతను, నట్లే స్ఫురింపఁజేయ సంకల్పించియుండుటచే స్పష్టముగా నా విషయమును వెల్లడించి యున్నాఁడు.

"ఓ కమలాప్త ! యో వరద ! యో ప్రతిపక్ష విపక్షదూర ! కు
య్యో కవియోగి వంద్య ! సుగుణోత్తమ ! యో శరణాగతామరా
నోకహ ! యో మునీశ్వర మనోహర ! యో విపుల ప్రభావ ! రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్నుఁగావవే !" (8-92)

ఈ పద్యమున "కమలాప్త" యను విశేషణము విశిష్టమైనది. కమలాప్తుఁడనగా శ్రీదేవీ ప్రియుఁడగు శ్రీమన్నారాయణుఁడు. ఈ విశిష్ట ప్రయోగము శ్రీ శ్రియః పతుల విశిష్టాద్వైత తత్త్వమును బోధించునది. ఆర్తుఁడగు గజేంద్రుడు లక్ష్మీ విశిష్టుఁడగు నారాయణుని శరణుఁ జొచ్చుటలో నెంతయో యౌచిత్యము - మరెంతయో సంప్రదాయ వైశిష్ట్యము నిమిడియున్నవి.

---

1. శ్రీ మద్భా - శ్రీ వీరరాఘవయ్య వ్యాఖ్య - 8-3-30

"కారుణ్య రూపిణియగు లక్ష్మీదేవితో గూడియున్నవాఁడగు నారాయణుఁడు సర్వ సిద్ధాంతములయందును వేదాంతమునందు సర్వ రక్షకుఁడుగాఁ జెప్పఁబడి యున్నట్లు శ్రీ వేదాంత దేశికులు పేర్కొనియున్నారు.[1]

మఱియు ధ్యానవంతులగునట్టివారు శ్రీదేవిని ముందుంచుకొనియే సత్త్వ రజస్తమోగుణ సముద్రమగు ఈ సంసారమును సులభముగా దాటుచున్నారని శ్రీ వైష్ణవాచార్యుల యభిప్రాయము. గ్రాహ రూపమగు సంసారమును గజేంద్రుఁడను జీవి జయించుటకు శ్రీ తత్త్వజ్ఞుఁడగు నారాయణ పరబ్రహ్మమును ధ్యానించుటయు నాశ్రయించుటయు విశిష్టాద్వైత సమ్మతములు. ఇట్టి సంప్రదాయమును పోతన చక్కగా నెఱిఁగియే యీ యమూలకమగు "కమలాక్ష" యను సంబోధనమును పొందుపరచియున్నాఁడు.

"ఓ కమలాక్ష" యను ఈ సంబోధనమును గుఱించి శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు 'పోతనామాత్యుని అభేద దృష్టి-పాఠ పరిశీలనము' అను వ్యాసమున[2] "ఓ కమలాక్ష యో వరద యని గజేంద్రుడు మొరపెట్టుచున్నాఁడు. ఇచట అకాడమీ ప్రతిలో "ఓ కమలాత్మ" యను పాఠము కలదు. ఈ సందర్భమునకే వావిళ్ళ ప్రతిలో "ఓ కమలాక్ష" అని కలదు వారుకలో "ఓ కమలాక్ష !" అని కలదు"- అని వ్రాసియున్నారు. ఏది యెట్లున్నను కమలాక్ష-కమలాత్మ-కమలాక్ష-అను ఈ మూటిలోఁ బ్రతి యొక్కటియు శ్రీమన్నారాయణునకు మాత్రమే చెందిన వగుటచే ఈ పద్యమునందుఁ బ్రస్తుతము కావింపఁబడిన వివేచనమునకు భంగము లేదు. కమలాక్ష యనునది విష్ణువునకే యుపయోగింపఁబడు సంబోధనము-కమలాత్మ యనగా శేషభూతురాలగు శ్రీదేవి కాత్మయగు పరమాత్మయని యర్థము సిద్ధించి యీ సందర్భమునకు మఱింత వన్నెవచ్చును.

ఈ పద్యమున "ఓ సుగుణోత్తమ !", "ఓ శరణాగతామరానోకహ" అని మఱి రెండు సాభిప్రాయ సంబోధనము లుపయోగింపఁబడినవి. సుగుణోత్తమ యనుటచే శ్రీమన్నారాయణుని కల్యాణగుణ విశిష్టత వ్యక్తమగుచున్నది. నిర్గుణ సగుణ శబ్దములకు హేయగుణ రహితత్వమును, కల్యాణగుణ కలితత్వమును

1. రహస్యత్రయ సారము పుట 336
2 భాగవత వైజయంతిక పుట 251

జెప్పు విశిష్టాద్వైతులకీ సంబోధనములు పరబ్రహ్మమును గూర్చి ముఖ్యార్థ బోధకములై సార్థకము లగును. సుగతోత్తమ యను సంబోధనము వలన స్థిరపరిచిన పరబ్రహ్మము యొక్క కల్యాణ గుణములలోఁ బ్రస్తుతము తన స్థితికి పనిపడుటవల్ల "శరణాగతాపరానోకహ" యని శరణాగత త్రాణము ప్రస్తావింపఁబడినది. ఈ సంబోధనమునకు "శరణార్థిని నన్నుఁగావవే!" యనిన యర్థ్యర్థనమునకు వెనుక నెంతయో విశిష్టాద్వైత సంప్రదాయ మిమిడియున్నది. ఇట్లీ పద్యము విశిష్టాద్వైత పరముగాఁ దీర్చిదిద్దఁబడినది.

27. దశమ స్కంధము నందుత్తర భాగమున గల బాణాసుర వృత్తాంతమున శివజ్వరము పైకి శ్రీకృష్ణుఁడు వైష్ణవ జ్వరమును బంపినాఁడు. జ్వరములు రెండును భయంకరముగాఁ బోరినవి. శివజ్వరము పరాజయము నొంది పారిపోవుచుండగా వైష్ణవ జ్వరము దాని వెంటఁబడినది. శివజ్వరము వేఱు దిక్కు లేక శ్రీకృష్ణుని పాదములపైఁబడి కాపాడుమని వేడుకొనినది. ఆ సందర్భమున మూలమున

> "తప్తో౽హం తే తేజసా దుస్సహేన
> శాంతో గ్రేణా త్యుల్బణేన జ్వరేణ
> తావ త్తాపో దేహినాం తే౽ఙ్ఘ్రి మూలం
> నో సేవేర న్యావదాశాను బద్ధాః॥[1]

అని కలదు. పోతన యీ విషయమును మూలముతో సంబంధము లేని విధముగా నీ క్రింది విధముగా ననువదించి యున్నాఁడు-

> "శాంతమై మహిత తీక్ష్ణ దుస్సహంబై యు
> దారమై వెలుగొందు తావకీన
> భూరి బాహ్య తేజమునఁ దావ మొందితిఁ
> గడుఁ గృశించితి నన్నుఁ గరుణఁజూడు
> మితర దేవోపాస్తిరతిమాని నీ పాద
> కమలముల్ సేవించు విమలబుద్ధి
> యెందాఁక మదిఁదోఁప దందాఁక నే కదా
> ప్రాణుల నిఖిల తాపములఁబడుట

1. శ్రీమద్భా 10-63-28

యనిరతానన్యగతికుల నరసి ప్రోచు
బిరుదుగల పీవు నను గావుబడుదె దేవ
ప్రవిమలాకార సంసార భయవిదూర
భక్తజనపోష పరితోష! పరమ పురుష" (10-ఉత్త-431)

ఈయనువాదమున 'ఇతర దేవో పాస్తిరతియూని నీ పాద విపులముల్
సేవించు బుద్ధి' — అను భావము పోతన కల్పనము "అనిరతానన్యగతికుల నరసి
ప్రోచు బిరుదు" — వాలాయిజునకు గలదని పోతనయే న్వయముగా ప్రార్థగా
చెప్పినాడు. అందు కుపలలకముగా "భక్తజన పోషపరితోష" యను సంబోధనమును
సేతఁదే పొందుపరచినాడు. ఈ మార్పు వలన శివజ్వరము తన — అనన్యార్హ
శేషత్వము—అనన్య శరణత్వము—అనన్య భోగత్వము—అను లక్షణములు గల
ప్రపన్నత నాశ్రయించి - యోగ్యతను వెల్లడించినట్లైనది.

ఈ శివజ్వరము యొక్క శరణాగతి శ్రీహరి పలుకులలో మరింత స్పష్ట
ముగా గోచరమగుచున్నది.

"మదీయ సాధన మనన్య నివారణమౌట నీ మదిన్ గని నను నార్తిఁ

జొచ్చితివి" అనియు, "నీవు మత్ప్రసత్తిం జొచ్చుటయు" అనియు శ్రీకృష్ణుడు
పలుకును.

దీని వలనఁ బోతన శివజ్వరము యొక్క ప్రవత్తిని సూచించినవాఁడాయెను.

ఇది విశిష్టాద్వైత మతమునఁ బ్రపత్తికిఁగల స్థానము నెఱిఁగిన పోతనతన్మత
ప్రీతితోఁ జేసిన యమూలక కల్పనము. ఈ కల్పనము పోతన యాంతర్యమును
వెల్లడించుచు శ్రీవైష్ణవ పౌరభమును గుబాళింపఁజేయుచున్నది.

28. మూలమున లేకున్నను దశమస్కంధమున బాల కృష్ణుని వర్ణనము
దివ్య ప్రబంధములలో నాళ్వారుల భవ్య భక్తి భావ బంధుర సాంతములలోఁజేసిన
దివ్యస్తుతులను దలఁపించుచు నా బాలకృష్ణుని పరబ్రహ్మత్వమును నిరూపింప నను
కట్టినట్లు స్పష్టము చేయుచున్నది.

## 1. బాలకృష్ణునకు వల్లవ లలనలు స్నానము చేయించు ఘట్టము

పటుతోయంబుల జగములఁ
బటుతోయములందు ముంచి భావిల్లెడి యా
పటుతోయగాఁడు వల్లవ
లలనా కర తోయములఁ జెలఁగుచుఁ దడియున్"

(10-పూ-భా-192)

చిత్ర విచిత్రములైన యీ జగములను జలమయము గావించి ప్రకాశించు సామర్థ్యము కల పరబ్రహ్మమయిన శ్రీకృష్ణుఁడు జలకములాడు దృశ్యమును జూచి పోతన ముగ్ధుఁడైన ట్లీ పద్యము చాటుచున్నది.

## 2. శ్రీకృష్ణుని జోకొట్టు దృశ్యము

"లోకములు నిదుర వోవఁగ
జోకొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్
జోకొట్టిపాడ నిదురం
గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్"

(10–పూభా–193)

లోకములన్నియు నిద్రింపగ జోకొట్టుచు నిద్రా భంగము లేకుండఁ జేయుచుఁ దాను మాత్రము మేల్కొని యుండు పరమేశ్వరుఁడు గొల్లపడుచులు పాట పాడి జోకొట్టగా నిద్రించినట్లు కనుదెఱవక పరుండిన దృశ్యమును పోతన దర్శించి పరవశించినాఁడు.

## 3. శ్రీకృష్ణుని బాల్యము

"ఏ దాము లెఱుఁగక యే పాదు మేటికిఁ
బసుల కాపరియింట దాము గలిగె
నే కర్మములు లేక యొనయు నెక్కటికిని
జాత కర్మంబులు సంభవించె
నేతల్లి చనుబాల నెఱుఁగని ప్రోడ య
శోద చన్నుం పాలఁ జొరవ నెఱిఁగె

నే హాని వృద్ధుల నెఱుఁగని బ్రహ్మంబు
    పొదిఁ గిటిలో వృద్ధిఁ బొందఁ దొణ్పె
నే తపముల నైన నెలమిఁ బండని పంట
పల్లెపై జనముల వారఁ బండె
నే చదువుల నైన నిట్టిట్టిదనరాని
యర్థమవయవముల నందమందె"                    (10-పూ.భా.-194)

శ్రీకృష్ణుడే పరబ్రహ్మమని భాగవత మహాపురాణమునఁ బ్రతిపాదింపఁబడుచున్నదని గట్టిగ నమ్మిన పోతన యా పరబ్రహ్మ స్వరూపమును పేర్కొనవచ్చునెల్ల—తన యానందమును అనుభవమును భక్తి పారవశ్యమును—చాటించి వెల్లడించు చుండుట పరిపాటి. అట్టి వానిలో నీ పద్యమొకటి. మూలమున లేని యీ భావము నత్యద్భుతముగా నిక్షేపించి స్వీయ హృదయము ననువదించియున్నాఁడు పోతన. జన్మము, కర్మము, ననుభవము, హానివృద్ధులు లేనట్టివాఁడును, తపములకు మెచ్చని వాఁడును, చదువుల కందని వాఁడును నగు పరబ్రహ్మము శ్రీకృష్ణుఁడై బాలుని విధమునఁ బవర్తించిన విధానమును పోతన యక్షరముల నక్షర రూపమున నిక్షేపించినాఁడు.

## 4) శ్రీకృష్ణుని బాల్య చేష్టలు

"చెయుఫల్ సేయు తపస్ విధాత కిరటం జెన్నొందు సంతోష దృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనుని మూర్తింబొల్పు దోఁచింపి యు
స్న మొదన్ దుద్రునిఁ బంగి నొప్పును సుఖానందంబునుం బొందిత
న్మయుఁడై బ్రహ్మముధారి బాలుఁడమరు న్నాహాత్మ్య బాల్యంబునన్"
(10 - పూ. భా. - 195)

ఈ యమాలంకమైన పద్యము శ్రీమన్నారాయణుని తత్త్వమును స్పష్టముగా వెల్లడించుచున్నది. బాల కృష్ణుఁడు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల వలె బ్రహ్మము వలె నుండెనఁట. నారాయణుఁడే పరబ్రహ్మము. శ్రీకృష్ణుఁడాతని యవతార విశేషము. అను సిద్ధాంతమును "పరమార్థముగా" భావించు విశిష్టాద్వైత దర్శనముచే నాకృష్టుఁడై పోతన యమాలంకముగా నీ హృద్యాసపద్యమగు పద్యమును విన్యసించినట్లు తోచుచున్నది.

తన కొక విశిష్టమగు విధానము - విశిష్టాద్వైత దర్శనము తల్ల లాలి సత్యము లేక కేవల మనువాదమును చేయుటకు మాత్రము పూనుకొనిన వానికిగాని, యద్వైతికిగాని, కేవల శివభక్తునకుగాని యపూర్వముగా శ్రీకృష్ణుఁడే శ్రీమన్నారాయణుఁడని పలుకుల దృష్టికిఁ గాని రావలసిన యావశ్యకములేదు. పోతన కొక కార్యక్రమము - నొక ప్రణాళిక – యొక సిద్ధాంతాభినివేశము నుండుటచే నీ దృశ మగు నిర్వహణమును గావించి యున్నాఁడని నా యభిప్రాయము.

29. ఇది దశమస్కంధములోని యొక సన్నివేశము. పోతన యే సన్నివేశమును విడువక భక్తి రసమగ్నంబగు వాక్యాల వలె శ్రీకృష్ణ లీలామృత పరిణామ పారవశ్యమున నా నారాయణుని దివ్యావతార వైభవమును దనివి తీర వర్ణించుచు భక్తి యోగ వశమున శ్రీమన్నారాయణుని పరబ్రహ్మ స్వరూపము ననుసంధానము చేసి తరింపఁ జూచినట్లు గోచరించును.

1) శ్రీకృష్ణుని బాల్య చేష్టలను వర్ణించు సందర్భములోని యొక యపూర్వ మగు కల్పనమిది—

> "కని చేతన్ వెలగోల పట్టికొనుచుం గానిమ్ము గానిమ్ము రా
> తనయా యెవ్వరి యందుఁ జిక్కువడ వే దండంబునుం గాన వే
> పనివారంబును బొంద నే వెఱపు నే విశ్రాంతియుం జెందఁ డె
> మ్మనియో నీ విటు సన్నుఁగై కొనమి నేఁ డారీతి సిద్ధించునే"
>
> (10 - పూ. భా. - 362)

బాల కృష్ణుఁడు పాల కుండను బగులఁగొట్టి యెక్కడకో పోయినాఁడు. యశోదకుఁ గోపము వచ్చినది. కృష్ణుని వెదకి వెదకి చివరకొక యింటిలో వెన్నను దొంగిలించుచుండగాఁ జూచి కోపముగ నదలించిన సందర్భములోనిదీ పద్యము. — పైకి సామాన్యార్థముతో నున్నను సూక్ష్మముగాఁ బరిశీలించినచోఁ దాత్త్విక భావ పరిపుష్టమై గంభీరమైనదీ పద్యము.

ఈ పద్యమునందున్న కొన్ని వాక్యములని—

1. ఎవ్వరి యందుఁ జిక్కువడవు
2. ఏ దండమును గానవు
3. ఏ పరివారమును బొందవు
4. ఏ వెఱపు నే విశ్రాంతి యుం జెంద వమ్మ—

ఇవి యన్నియు సాభిప్రాయములు. నారాయణ పరబ్రహ్మ లక్షణ లక్షితములు.

2. శ్రీకృష్ణు డీ రీతిగా నడలించ తనలో యశోద యీ క్రింది విధముగా వితర్కించుచుండ —

"బాలుఁ డీతం డని భావింతమందునా
    యే పెద్దలును నేరరీ క్రమంబు
వెఱవెఱఁగుటకునై వెఱపింతమందునా
    కలిగి లేకొక్కఁడు గాని లేఁడు
వెఱపుతో నా బుద్ధి వివరింత మందునా
    తనకుఁ దానై బుద్ధిఁ దప్పకుండు
నెంతెఱుంగక యింట నుండెడి నందునా
    చొచ్చిచూడని చోక చోటు లేదు
తమ్ము నెవ్వరైనఁ దలపోయ జాలరి
యోజలేదు రీతి యొకటి యెఱుఁగఁ
నెలమి నూరకుండఁ జెక్క నశక్యములాఁడుఁ
బట్టి శాస్తి సేయు తంగిమెట్లు"

(10 - పూ. భా. - 364)

ఈ పద్యము నైతిక సాభిప్రాయమే. పైకి బాలుని చపల స్వభావము వ్యక్తమైనను గూఢముగా నీ పద్యము విష్ణుపారమును గాఢముగా బోధించుచున్నది.

1. ఏ పెద్దలును నేరరీ క్రమంబు = త్రివిక్రమ స్ఫురణము
2. కలిగి లే కొక్కఁడుగాని లేఁడు = ఏకత్వము
3. తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు = విజ్ఞాన మయత్వము
4. చొచ్చి చూడని చోకచోటు లేదు = బహిరంతర వ్యాప్తి
5. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ జాలరి = భక్తి ఆవశ్యకత (సగుణత)
6. రీతి యొక్కటి యెఱుఁగఁడు = ప్రాకృత గుణరాహిత్యము
7. ఎలమి నూరకుండఁ జెక్క నశక్యము లాఁడు = యోగనిద్ర చాలించి క్రీడార్థము సృష్టికిఁ బూనుకొనుట.

ఈ విధముగ నంతరార్థముతో నీ పద్యము విష్ణు పారమ్యమును బోధించి పోతనగారి విశిష్టాద్వైత ప్రీతిని స్ఫుటీకరించుచున్నది.

30. శ్రీకృష్ణుని లీలలు ప్రముఖముగా భక్తకవుల నాకట్టుకొన్నవి. అది పరబ్రహ్మముయొక్క లీలా విభూతికి సంబంధించిన క్రీడా వైదగ్ధ్య చేష్టలు. పోతన శ్రీమన్నారాయణునే పరబ్రహ్మముగా భావించి శ్రీకృష్ణుఁడా నారాయణా వతార విశేషముగా సంభావించి తరింప నెంచిన వాఁడగుటచే విశిష్టాద్వైత సిద్ధాంతము మూలముగా నా లీలా విశేషములను వర్ణించియున్నాడు. అట్టివానిలో నీ క్రింది సన్నివేశమొకటి. దశమస్కంధములోని దీ సన్నివేశము.

యశోద శ్రీకృష్ణుని వెదకి పట్టుకొనినది. కొట్టఁదలఁచి చేతులు రాక కట్టఁదలఁచినది. ఆ సందర్భమున నామెపలికిన వాక్యాలు గూఢార్థనిభరములై - యమూల్యములై పోతన యొక్క విష్ణుభక్తి పారవశ్యమును - విష్ణువే పరబ్రహ్మమను విశిష్టాద్వైత సంప్రదాయము నందలి ప్రీతిని వ్యక్తము చేయుచున్నది.

శ్రీ కృష్ణుఁడే పరబ్రహ్మము కావున నాతని చేష్టలలోఁ బరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుని తత్త్వమును వెదకు కొనినాఁడు భక్తపోతన.

1) "పట్టిన పట్టువిడని వినుఁ
బట్టెదనని చలము గొనినఁ బట్టుట పెట్టే
పట్టువడ చంద్రు పట్టె
పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే" (10 - పూ - 375)

ఈపద్యము వలన ధ్వనిరూపమున నారాయణుని స్వామిత్వము, స్వాతంత్ర్యము, భక్తవశ్యత, కారుణ్యము వ్యఙ్గ్యమానములగుచున్నవి.

2) మఱియొక పద్యము—
"ఎక్కడ నైనను దిరిగెద
నొక్కయెడన్ గుణము కలిగియుండవు వినుమం
డెక్కడిది నీకు మఱువఁ
జిక్కఁగఁ బోయెదవు పెక్కు జాడలఁ బుత్రా" (10-పూ.భా 376)

ఈ పద్యమున నతివిశేషాలు—

1) ఎక్కడనైనను దిరిగెదవు=సర్వవ్యాపిత్వము
2) ఒక్కయెడన్ గుణము కలిగియుండవు=ప్రకృతి గుణముల కతీతుఁడగుట

3) నియమంతెక్కడిది = అనంతత్వము

4) మఱచేనఁ జిక్కగఁ బోయెదవు = దుష్టజనాగోచరత్వము

5) పోయెదవు పెక్కుజాడల = త్రివిక్రమత్వము లేక సర్వశక్తిమత్వము

ఈ భావాలు స్ఫురించుచున్నవి. ఈ విధంగా ఈ పద్యము వలన శ్రీమన్నారాయ ణుని మహిమాతిశయము వ్యక్తమగుచున్నది.

3) చిన్నికృష్ణుని బాలచేష్టితములందు శ్రీమన్నారాయణుని దివ్యావతార తత్త్వ లీలావిలాస విన్యాసములను దర్శించి మనచే దర్శింపఁజేయుట పోతన కవితా శిల్పము లోని మర్మము.

ఈ క్రింది పద్యమున యశోద కృష్ణుని చిలిపి చేష్టలను మందలించు చున్నది. ఆయా చేష్టలలో పదునగా నాయా యవతారముల వైభవముద్యోతకమగుచుండును.

"తోయము లివియని తొలఁగక చొచ్చెదు
తలఁచెదు గట్టైనఁ దరల నెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నత స్తంభంబులూఁపఁ బోయె
దన్నుల నల్పంబులడుగంగ దాఁచెదు
రాచ పేఁటలఁ గాల నవ్వదెచ్చె
దలయవు పీఁకకు సర్వంబు గట్టెదు
ముసలిపై హరి వృత్తి మొనయఁ జూచె
దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గల్కి చేఁత లేల పుత్ర !
నిన్ను వంప బ్రాల్పనేనేర నెరియొ నీ
విట్టి క్రిందు మీదు నెఱుఁగ కునికి"

(10 పూ.భా - 377)

పరమ సుందరమగు ఈ పద్యమున గల భావ గాంభీర్యము నొకసారి పరి శీలింతము—

1) తోయములివి యని తొలఁగక చొచ్చెదు :-

చిన్న పిల్లలకు నీటివాడుట బాల్య చాపల్య వశమున సహజమగు విష యము. శ్రీకృష్ణుఁడు చిన్నవాడు నీటిలోనికిఁ బోవనుండుట - యశోద వారించుట

సామాన్యార్థము. కాని మత్స్యావతార ప్రస్తావ మీ వాక్యమునకు వెనుకనున్న పర మార్థము.

2) తలఁచెదు గట్టైనఁ దరల నెత్త :-

పెద్ద పెద్ద రాళ్ళు రప్పలు నెత్తఁబోవుట పిల్లల స్వభావము. గూఢముగా మంధరగిరి నెత్తిన కూర్మావతారమును గురించిన ప్రస్తావము.

3) పంటితో వాటు మానవు కోరాడెదు :-

పంతు క్రీడ బాల లీలా విశేషము. అంతరార్థము మాత్రము వరాహావతార ఘట్టము.

4) ఉన్నత స్తంభంబు లూపఁబోదు :-

సాధ్యాసాధ్యములను గుర్తింపక స్తంభాదుల నూపఁబోవుట బాల్యమున నైజకృత్యము. కాని స్తంభము నూపినచో నక్కడకుఁ బోవుట నృసింహావతార సూచకము.

5) అమ్మల నల్పంబు లడుగంగ బోటెదు :-

పిల్లలు చిన్న చిన్న వస్తువులను చాపల్యముచేఁ జుట్టు ప్రక్కల వారల నడుగుట సాధారణ విషయము. అంతరార్థము మూడడుగులు మాత్రము బలిని వేడిన వామనావతార ఘట్టము స్ఫురించును.

6) రాచపేఁటలఁ జాల నుప్పతెప్పెదు :-

"ఇరుగిండ్ల పిల్లలలోఁ బొరుగిండ్ల పిల్లలతోఁ" గలహములు కొని పచ్చుట బాలకులకు సహజము. అంతరార్థమున రాజుల పేటాడిన పరశురాముని వృత్తాంతము ననుసంధించుకొననలయును.

7) అలయవు పీళ్ళకు నడ్డంబు గట్టెదు :-

చిన్న చిన్న ప్రవాహములకుఁ గట్టలు కట్టి క్రీడించుట బాలచేష్ట. ఇందంత రార్థము సముద్రమును బంధించిన రామలీల.

8) ముసలిపై హరి వృత్తి మొనయఁ జూచెదు :-

ముదుసళ్ళపైకి నెగబడుట పిల్లలకు సహజము. అంతరార్థమున మాత్రము

వృద్ధ భీష్ముని పైకిఁ "గరికి లంఘించు సింహంబు కరణిఁ" దోయిన కృష్ణుని దివ్య చేష్ట.

9) అంబరము మోలకు వడుగవు :-

ఇది బుద్ధావతార సూచకము

10) ఇంకఁ గల్కి చేత చేం :-

ఇది — అతి తెలివిఁ బ్రదర్శించు మడుపు చేష్టలెందుకని సామాన్యార్థమును - గల్క్యవతార చేష్ట లెందుకని విశేషార్థమును తెలుపుచున్నది.

కడకు 'క్రిందు మీదు నెఱుఁగ కునికి' — అనుటలో గూడ భూమ్యాకాశము లను నవధులులేని విశ్వ వ్యాపి యగు నారాయణుని సర్వ శక్తిత్వము, ప్రసక్త మగుచున్నది.

ఇట్లీ పద్యము సామాన్యార్థమున బాలకృష్ణుని మందలించు యశోద వాక్యము లను వివరించుచు నన్యార్థమున దశావతార వైభవమును వర్ణించుచున్నది. ఇది యమూలకముగా పోతన సాగించిన కల్పనము పోతన యిట్టి విధానమును మొత్తము తన భాగవతానువాద ఘట్టములలోఁ బెక్కుతావులందు ననుసరించి దివ్యావతార స్ఫురణము గలుగునట్లు చిత్రించినాడు.

అమూలకముగాఁ జిత్రించుట, పరమార్థముగా భావించినట్లు ద్యోతకమగు రీతిగా దివ్యావతారములను నారాయణ మహాత్మ్యమును సందర్భము సంభవించినప్పు డెల్ల వర్ణించుట యను నీ యంశములను బరిశీలించినప్పుడు — దివ్యావతార పార మార్థ్యమును, శ్రీమన్నారాయణ పారమ్యమును ప్రముఖముగాఁ బ్రతిపాదించు విశిష్టా ద్వైత మతమున కనుకూలమగు నీ నిర్వహణము పోతనకుఁగల విరతిశయమగు శ్రీవైష్ణవ సంప్రదాయాభిమానమును వెల్లడించుచున్నదని నా యభిప్రాయము.

కవి తాను జేసిన యీ నిబిడార్థ రచనమును లోకమునకు వెల్లడింప దలఁ చియో "అని మర్మంబులెత్తి" [1] అని తరువాత వచనమునఁ జేర్కొనుట కవితా శిల్ప నైపుణ్యమును - యౌచిత్య రామణీయకమును బాసిల్లఁజేయుచున్నది. పోతన యిట్లు తాను గావించిన కవితా శిల్పమునందలి మార్మికతను సహృదయ పాఠకులకుఁ గడు సరసముగాఁ దెలియఁ జేసినాఁడు.

31. దశమ స్కంధమున మఱియొక యుదాహరణము. గోపకులు శ్రీకృష్ణుని సాహచర్యమున ననుభవించిన సౌఖ్యానందములు సాయుజ్యమున ముక్త జీవులు పొందు దివ్య కైంకర్యానుభవముగా సంప్రదాయవేత్త లన్వయింతురు. శ్రీమద్భాగవతమున శ్రీవ్యాస భగవానుని నిర్వహణము గూడ నిందులకుఁ దగియే యున్నది.

ధేనుకాసుర భంజన ఘట్టమున గోపకులందఱు రామకృష్ణ సమేతులై వనములోఁ దిరుగ సాగినారు. ఆ సందర్భమున మార్గాయాసమును బొందిన శ్రీకృష్ణునకు గోపకులు పరిచర్యలు చేసినారు. ఈ పరిచర్యలు నెరపి గోపకు లెవ్వరు – శ్రీకృష్ణునకు సేవ చేసితిమని విచారింపరైరి. మీఁదు మిక్కిలి సంతోషముతోఁ జేసిరి. వారి యా సేవాభావానుభవ పారవశ్యమును వ్యాస భగవానుఁడిట్లు వర్ణించి యున్నాఁడు.

1) "పాద సంవాహనం చక్రుః కేచిత్తస్య మహాత్మనః ।
పరే తు హతపాప్మానో వ్యజనైః సమవీజయన్॥

2) అనే తదను రూపాణి మనోజ్ఞాని మహాత్మనః
గాయన్తి స్మ మహారాజ స్నేహక్లిన్నధియశ్శనైః॥"[1]

ఈ శ్లోకములు గోపాలురు శ్రీకృష్ణునకుఁ గావించిన సేవలను వర్ణించునవి. కొందఱు కృష్ణునకు పాదసంవాహనము చేసిరి. మఱి కొందఱు విసరినారు. కొందఱింపుగా పాడినారు. ఇట్టి కృత్యములన్నియు వారు సంతోషముతోఁ జేసినట్లు "స్నేహక్లిన్నధియః" - అను సమాసముతో వ్యాసభగవానుఁడు సూచించియున్నాఁడు. సరియే! మఱి యిక్కడ ముక్తజనుల దివ్యానుభవ వర్ణనము గలదని సంప్రదాయ విదులకు వాక్యలనుటలోని యాంతర్యమేమి? ఈ ప్రశ్నమునకు సమాధానముగాఁ దదనంతర శ్లోకమును బరిశీలింపవలసియున్నది. సాక్షాత్తు పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుఁడు శ్రీకృష్ణుఁడై గోపాలురతోఁ గలసి మెలసి యున్నట్లును, నాతఁడు సహజముగా రమాలలనాలాలిత లలిత పదపల్లవుఁడైనను గోపకులలో నొక గోపకుఁడుగా మెలఁగినట్లును వర్ణింపఁబడినాఁడు.

1. శ్రీమద్భా 10-15-17,18

> ఏవం గూఢాత్మగతి స్స్వమాయయా
> గోపాత్మజత్వం చరితై ర్విడంబయన్ ।
> రేమే రమా లాలిత పాద పల్లవో
> గ్రామ్యైః సమం గ్రామ్య వదీశ చేష్టితః ॥"[1]

ఈ శ్లోకమునందలి "గూఢాత్మగతిః" అను విశేషణము వినుతనీయము. "నిగూఢమగు స్వాత్మ ఖ్యాతిగలవాఁడై"- యని విశిష్టాద్వైత వ్యాఖ్యాతయగు వీర రాఘవాచార్యుని వ్యాఖ్యానము. అనగాఁ బైకి వ్యక్తముకాని యానందమని తాత్పర్యము. ఈ ప్రయోగముచేత నిజమునకు శ్రీకృష్ణుఁడు శ్రీమన్నారాయణుఁడైనను మనుష్య వర్తనమున నున్నాఁడని వ్యక్తమగుచున్నది. వైకుంఠమున సాయుజ్య సౌఖ్యము ననుభవించువారు ముక్తజనులు వారి నడుమ నుండువాఁడు పరమాత్మయగు శ్రీమన్నారాయణుఁడు. అట్టి వాఁడు ప్రస్తుతము గోపకుల నడుమనున్నాఁడు. గోపకులు ముక్తజనుల స్థానమున నున్నారు. ముక్తజనులు నిత్యము శ్రీమన్నారాయణుని కైంకర్యమును జేయుటయే పరమ సౌఖ్యముగా భావించియుండువారు. నిరతిశయానంద ప్రదమగు నిత్య కైంకర్యానంద సౌఖ్యమే సాయుజ్య ఫలము. గోపకులు పరమాత్మయగు శ్రీకృష్ణునకు సేవలు చేయుచు నాతనితోఁగలసి బ్రహ్మానందానుభవము ననుభవించుచున్నట్లు శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. పోతన యీ మార్గముననే పై శ్లోకమును ననువదించుటకుఁ బూర్వ మద్భుతమగు నొక పద్యము నమూలకముగా రచించియున్నాఁడు. ఈ పద్యము నందుఁ బోతన స్పష్టముగా శ్రీకృష్ణుని శ్రీమన్నారాయణ పరమాత్మగా వర్ణించియున్నాఁడు. ఈ విధముగా పీఠమునఁ దాను నిర్మింపఁదలపెట్టిన విశిష్టాద్వైత సౌధమునకుఁ బునాది వైచినాఁడు. ఆ యమూలక పద్యమిది —

> "వేదాంత వీధుల విహరించు విన్నాణి
> విహరించు కాంతార వీధులందు
> ఫణి రాజశయ్యపైఁ బవళించు సుఖభోగి
> పల్లవ శయ్యలఁ బవ్వళించు
> గురుయోగి మానస గుహలఁ గ్రుమ్మరుమేటి
> క్రుమ్మరు నద్రీంద్ర గుహలలోన

---

1. శ్రీ మద్భా 10-15-19.

కమలతోఁ బెనంగి కడుదయ్యుఁ జతురుఁడా
ధీర యమల తోఁ బెనఁగి దయ్యె
నఖిల లోకములకు నాశ్రయుండగు ధీరుఁ
డంపి తరుల నీడ నాశ్రయించు
యాగ భాగ చయము లాహరించు మహాత్ముఁ
డడవిలోని ఫలము లాహరించు"

(10-పూ.భా-607)

ఈ పద్యములోఁగల వేదాంత వీథులలో విహరించుట- ఫణిరాజ శయ్యపైఁ బవళించుట- సుమయోగి మానస గుహలలో విహరించుట-కమల తోడఁ బెనఁగుట- అఖిల లోకముల కాశ్రయుఁడై యుండుట యాగభాగచయము లాహరించుట-ఇవి యన్నియు శ్రీమన్నారాయణుని కృత్యములుగాఁ- బరమార్థములుగా విశిష్టాద్వైతము బోధించుచున్నది. ఇట్టి నారాయణుఁడు ప్రస్తుతము శ్రీకృష్ణుఁడై గోపబాలక సహజమైన వర్తనముతో నున్నాఁడట

ఇట్టి పద్యమువలన శ్రీకృష్ణుఁడే శ్రీమన్నారాయణుఁడే యని స్థిరపరచి మూల శ్లోకముల నిశ్లోక సీస పద్యముగాఁ బోతన యనువదించినాఁడు——

"అలసినచోఁ గొంద ఱతిమోదమున వీపు
నెక్కించుకొని పోదు రేపు మెఱసి
సొలసి నిద్రించినచో నూరు తల్పంబు
లిడుదురు కొందఱు హితవు గలిగి
చెమరించి యున్నచోఁ జిగురు టాకులఁ గొంద
ఱొయ్యన విసరుదు రుత్సహించి
దప్పిగి నిలుచుచోఁ దడయక కొందఱు
పదము లొత్తుదు రతి బాంధవమున
గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున
మాధవునకుఁ బెక్కు మార్గములను
బనులు సేసి రెల్ల భవములఁ జేసిన
పాప సంచయములు భస్మములుగ" (10-పూ.భా-609)

ఈ పద్యమున గోపకులు గావించిన భగవత్కైంకర్యము ముక్తజనులు వైకుంఠ వాసునకుఁ జేసిన కైంకర్యముగాఁ జెప్పుటకుఁ దగినట్లు "ఎల్లభవములఁ జేసిన

పాప సంచయములు భస్మములగు" అను వాక్యము వివరింపఁబడినది. పాపచయము భస్మమై పోవుట వలన ముక్తజనుల కాభాగ్యము — పాపచయము భస్మమై పోవుట కొఱకు ప్రస్తుత గోప బాలుర కీయవకాశము.

శ్రీకృష్ణుఁడు గోప బాలురతోఁ జల్దులారగించు ఘట్టమునకైన మిట్టి సమన్వయమునే పెద్దలు చెప్పుదురు. ఆనందవల్లిలోని ముక్త స్వరూపుని యనుభవముతో గోపాలుర యనుభవమును బోల్చి- నరిశర్ల పాలెమున శ్రీవాసుదేవాశ్రమమున పీఠస్థులైయున్న శ్రీ శే।శం। గోపాలాచార్యస్వామి వారిట్లు పేర్కొనినారు—[1]

"బ్రహ్మ విదాప్నోతి పరమ్। తదేషాభ్యుక్తా। సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ। యో వేద నిహితం। గుహాయాం పరమే వ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి।" అని కలదు. దీని సారాంశము- బ్రహ్మవిత్- ఆప్నోతి-పరమ్ అని. ఉపేయమగు బ్రహ్మము, అతనిఁ బొందు నుపాయమగు నుపాసన, దానివలన ముక్తుఁడనుభవించు ఫలము ననునీ మూఁటిని యీ వాక్యము వలనఁ దెలుపఁబడుచున్నది ఆ మూఁటిని "తదేషాభ్యుక్తా"- అనియా శ్రుతియే వివరించినది. సత్యం జ్ఞానం ఇత్యాది వాక్యముచేఁ బ్రాప్యమగు బ్రహ్మ స్వరూపము తెలుపఁబడినది 'యో వేద నిహితం గుహాయాం' అనుటచే నుపాసన చెప్పఁబడినది. 'సోఽశ్నుతే'— అను వాక్యముచే ఫలము తెలుపఁబడినది. ఈ మొత్తమున కర్థమేమనగా ముక్తుఁడు సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరునితో బాటుగా నాతని సమస్త కల్యాణ గుణముల ననుభవించుచున్నాఁడని."

ఇట్లు ముక్తజనులతో గూడి బ్రహ్మానందానుభవము నొందు శ్రీమన్నారాయణుని వలె గోపబాలకులతోఁ గలసి చల్దు లారగించిన శ్రీకృష్ణుని దివ్య చేష్టావైభవమును భక్తపోతన యిట్లు వర్ణించియున్నాఁడు—

"కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
　　లాలిత వంశ నాళంబుఁ జొనిపి
విపుల శృంగంబును వేత్రదండంబును
　　జాఱిరానీక డా చంక నిఱికి

1. తిరుప్పావై- రెండవ భాగము-2 7వ పాశురము, పుట 869-73,

మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలఁరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళ సందుల యందు వెలయ నిఱికి
సంగడీల నడుమఁ జక్కఁగఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్దిగుడిచె" (10 - పూ.భా.498)

ఇట్టి సంప్రదాయార్థమును మనస్సున నుంచుకొనియే పోతన యమూలకముగా "వేదాంత వీథుల" ఇత్యాది పద్యమును రచించి యున్నాఁడని పైనఁగావింపఁబడిన వివేచనము వలన వ్యక్తమగుచున్నది.

# పోతన పరిష్కరణములు

## 2. శ్రీధరవ్యాఖ్యా విరుద్ధములు

పోతనాదులగు భాగవతానువాదకులు పలువు రున్నందున ముఖ్యముగాఁ బోతన తు.చ.తప్పకుండ శ్రీ శ్రీధరాచార్యకృతమగు నద్వైత వ్యాఖ్యానము ననుసరించి తమ భాగవతానువాదమును సాగించినారనుట సరికాదని పరిశీలనము వలన వెల్లడియగుచున్నది.

పెక్కు తావులలో శ్రీ శ్రీధరాచార్య కృతమగు వ్యాఖ్యానమును గైకొన కుండుటయే గాక యాయా సందర్భములందు విశిష్టాద్వైత మత సమ్మతమగు ననువాదమును వెలయించినట్లు కాన్పించుచున్నది. అట్టివానిలోఁ గొన్నింటిని మాత్రము స్థాలీ పులాకన్యాయమున నీ క్రిందఁ బొందు పరచుచున్నాను.

1. ద్వితీయస్కంధమున శుకయోగి పరీక్షిత్తునకు భాగవతమును గూర్చి చెప్పుచు దానికిఁ గల దశలక్షణములను వివరించు సందర్భమున ముక్తి యను దాని లక్షణము మూలమున నిట్లు వివరింపఁబడినది.

"ముక్తిర్హిత్వాన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః"[1]

దీనికి శ్రీ శ్రీధరాచార్యుల వారిట్లు వ్యాఖ్యానము చేసినారు.

"అన్యథా రూపం అవిద్యయా అధ్యస్తం కర్తృత్వాది హిత్వా స్వ స్వరూపేణ బ్రహ్మతయా వ్యవస్థితి ర్ముక్తిః ।"

పోతన యీ వ్యాఖ్యానము ననుసరింపక విశిష్టాద్వైతులు పేర్కొన్న ముక్తి స్వరూపమును వివరించినాఁడు—

---

1. శ్రీ మద్భా 2-7-6

"జీవుండు భగవత్కృపావశంబునం జేసి
దేహాదర్శంబులై ధృతి వసేక

జన్మానుభవిత దృశ్యములైన యష్టారా వ
రణంబు లాత్మధర్మంబులయిన

వన షట్క శాపముక్తాదు విర్యోధ్వా
స్థితినొప్పి పూర్వ వంచితములైన

యపహత పాప్మత్వాద్యష్ట సద్గుణ
సంయుతుడై తగ భగవత్ప్రకీర

భూతుడై పారతంత్ర్యాత్మబుద్ధి నొప్పి
దివ్య మాల్యాను లేపన భవ్యగంధ
కలిత మంగళ దివ్య విగ్రహ విశిష్టు
డగుచు హరిరూపమందుచే యపముక్తి"

(2 - 207)

ముక్తుడు - (శరీర సంబంధము వలన) పుణ్యపాప రూపమైన కర్మచే గనపడ నీయకుండ జేయబడిన యపహత పాప్మత్వాది గుణములను (మోక్షదశలో గర్మ లుండవు గావున) తిరిగి పొందును. అపహత పాప్మత్వాద్యష్టగుణములు గలిగి యుండుటయే జీవుని స్వస్వరూపము. అది సంసారబంధము వలన నేర్పడిన కర్మలచే గప్పివేయబడి యుండును. ముక్తదశలో గర్మలు నశించి వెనుకటి గుణాష్టకయుక్త స్వస్వరూపము సిద్ధించునని చెప్పబడుచున్నది.[1]

మరియు ముక్తదశలో పురుషుడు తాను పరబ్రహ్మము నంటి యవిభక్తు డనని తెలిసికొనుచున్నాడు. పరబ్రహ్మమును బొందుటచే త్రిశక్త్యాత్మ యవిద్యా తిరోధానము లేనివాడై పరమాత్మను దర్శించె నేలనికాక యాత్మడు తనకాత్మ యని యాయనకు దాను శరీరమని తలంచును. స్వయముగా స్వీకరించుకొనినది కాని లేక భగవంతునిచే స్వీకరింపబడినది కాని యగు దివ్యమంగళ విగ్రహము ముక్తునకు

---

1. భక్తుని పరమపద యాత్ర పుట 60

విలసిల్లునదియు, ఇట్టి దివ్య భావములతో భగవంతునితోఁ గూడి దివ్యానుభూతిఁ బొందుటయే ముక్తియని విశిష్టాద్వైత ప్రవర్తకులగు భగవద్రామానుజులు శ్రీ భాష్యమున— "అవిభాగేన దృష్టత్వాధికరణమున"— "అవిభాగేన దృష్టత్వాత్"[1] అను సూత్రమునకు వ్యాఖ్యానము చేయు సందర్భమున వివరించి యున్నారు.

ఈ విధముగాఁ బోతన యనువాదము మూలమున లేనట్టియు, శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యానముతో సంబంధము లేకపోవుటయే గాక యత్యంత విరుద్ధముగా నున్నట్టియు, మీదు మిక్కిలి విశిష్టాద్వైత సమ్మతమగునట్టియు వైఖరిలో ముక్తి విధానమును వివరించినది.

2. తృతీయ స్కంధమున విదురుఁడు పాండవులకు రాజ్యభాగమిమ్మని ధృతరాష్ట్రునకుఁ జెప్పుచు నందుకుఁ గారణముగ శ్రీకృష్ణుఁడా పాండవులను చేపట్టి యున్నాఁడని పేర్కొను సందర్భమునఁ బోతన శ్రీధర వ్యాఖ్యను ప్రక్కకు నెట్టి శ్రీకృష్ణుని సర్వకర్తృత్వమును నారాయణ పరబ్రహ్మత్వమును చాటిచెప్పుచు ననువదించి యున్నాఁడు—

ఈ సందర్భమునందలి మూలశ్లోకమిది—

> "పార్థాంస్తు దేవో భగవాన్ముకుందో
> గృహీతవాన్సక్షితి దేవదేవః।
> ఆస్తే స్వపుర్యాం యదుదేవదేవో
> వినిర్జితాశేష నృదేవ దేవః॥"[2]

దీనికి శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్య యిట్లున్నది—

> "పార్థాంస్తు ముకుందః ఆత్మీయత్వేన గృహీతవాన్. సతు దేవః తత్రాపి భగవాన్ నతు ప్రాకృతః కిం చ సహ క్షితి దేవైః విప్రైః క్షేత్రైః ఇంద్రాది లోక వర్తమానః యత్రాసౌ శ్రీకృష్ణః తత్ర విప్రా దేవా శ్చేత్యర్థః న చ స్వ పుర్యామేవ సుఖమాస్తే.

1. శ్రీ భాష్యమ్ 4-4-4
2. శ్రీమద్భా 3-1-12

నత్వన్యత్ర గతః। కిం చ యదు దేవానాం దేవః పూజ్యః యతోఽపి
తత్రైవ యదు ప్రవీరా ఇత్యర్థః। కిం చ నృదేవేషు
మండలేశ్వరేషు దీవ్యంతే ప్రకాశంత ఇతి నృదేవ దేవాః
రాజానః। నిర్జితాః అశేషాః నృదేవ దేవాః యేన యతోఽపి
తత్రైవ రాజానః సర్వే అతః పార్థానాం దాయ దేహీతి।"[1]

ఈ విధముగా శ్రీ శ్రీధరాచార్యులవారు మూలములోని పదములకుఁ గేవల మర్థమును వ్రాసియుండగాఁ బోతన యనువదించిన తీరును గమనింతము—

"ఏ పరమేశుచే జగము లీ స చరాచర కోటితో నము
ద్దీపితమయ్యె నే విభుని దివ్య కళాంశజు లబ్జగర్భ గౌ
రీ పతి ముఖ్యదేవ ముని బృందము లెవ్వఁడనంతుఁ డచ్యుతుం
డా పురుషోత్తముండు గరుణాంబుధి కృష్ణుఁడువో నరేశ్వరా" (3-30)

దేవుఁడు, క్షితిదేవ దేవుఁడు, భగవంతుఁడునగు ముకుందుఁడు పృథా పుత్రులను జేపట్టి యదు దేవదేవుఁడు నృదేవ దేవుఁడునగు నాతఁడు తన పక్షమున నివసించియున్నాఁడని మూల శ్లోకము వివరింపగాఁ— బోతన తన యనువాదమున శ్రీకృష్ణుఁడే శ్రీమన్నారాయణుఁడనియు, వాఁడే స చరాచర సృష్టికిఁ గర్తయనియు, బ్రహ్మ, శివుఁడు మున్నగు దేవతాగ్రణు లాతని యంశజులనియు- నాతఁడు పరిచ్ఛేద రహితుఁడనియు, నచ్యుతుఁడనియు, మీదు మిక్కిలి భగవంతునిలో భక్తుఁడు ముఖ్యముగాఁ గోరుకొనెడు కరుణాంబుధిత్వమును గూడ చేర్కొనియున్నాఁడు. మూలమున గల "భగవాన్" అను పదమీ పెంపుదలకు మూలము.

శ్రీ శ్రీధరులవారు మూలమున గల "క్షితిదేవ దేవః"— ఇత్యాది పదములకు విశేషముగాఁ బ్రయాసపడి యర్థ విశేషములను వ్రాయగాఁ బోతన వానినిఁ బూర్తిగాఁ ద్యజించి పరాత్పరుఁడు, పరబ్రహ్మము శ్రీకృష్ణుఁడే యని తత్త్వ ప్రతిపాదకముగా ననువదించియున్నాఁడు.

1. శ్రీ శ్రీధరవ్యాఖ్య 3-1-12

3. కపిలుఁడు దేవహూతికి భక్తి యోగమును వివరించుచు తృతీయస్కంధ మున భక్తిచేఁగలుగు ఫలమునిట్లు వివరించినాడు —

"మద్గుణ శ్రుతి మాత్రేణ మయి సర్వగుణాశ్రయే ।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽమ్బుధౌ ॥
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ।
అహైతుక్య వ్యవహితా యా భక్తిః పురుషోత్తమే ॥"[1]

ఈ సందర్భమున శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యయిట్లున్నది—

"తదేవం సగుణభక్తిరేకాశీతి భేదా నిర్గుణాభక్తి రేక విధైవ తామహద్వాభ్యామ్ మద్గుణేతి—మనోగతిరితి యాభక్తిః సా నిర్గుణస్య భక్తి యోగస్య లక్షణ మిత్య న్వయః। లక్షణమితి—లక్షణం స్వరూపం అవిచ్ఛిన్నా సంతతా. అహైతుకీ ఫలానుసంధాన శూన్యా అవ్యవహితా భేద దర్శన రహితాచ మద్గుణ శ్రవణ మాత్రేణ మయి శ్రీ పురుషోత్తమే ।"[2]

ఈ శ్రీధరాచార్యుల వారి నిర్వహణమునకు విరుద్ధముగాఁ బోతన యను వాదము సాగినది—

"మనుసుత ! మద్గుణ శ్రవణ మాత్ర లభించిన యట్టి భక్తిచే
ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడం బరమేశ్వరుండ నై
తనరిన నన్నుఁజెందిన యుదాత్త మనోగతు లవ్యయంబులై
వనధి గామియైన సురవాహినిఁబోలె ఫలించు నిమ్ములన్" (3-956)

పరబ్రహ్మము నిర్గుణమని యద్వైతుల నిశ్చయము. మాయలోఁ బ్రతి ఫలించిన బ్రహ్మమే యీశ్వర నామమున గుణాశ్రయుఁడై యుండునని వారి వాదము. ఇందుఁ గపిలుఁడు పరబ్రహ్మమును గూర్చియే చెప్పుచున్నట్లు పూర్వాపర సందర్భములను బట్టి వ్యక్తమగుచున్నది. ఎక్కడను నిది సగుణతత్త్వము సుమా ! యను భావము వ్యక్తము చేయఁబడలేదు. కపిలుఁడు సాక్షత్తుగఁ బరబ్రహ్మ స్వరూప మైనట్లు ముందుగఁ జెప్పఁబడినది. మూలమునఁ గల 'సర్వగుణాశ్రయే' అను దానిని "శోభన గుణాశ్రయుఁడన్" అని యనువదించిన పోతన "అనవధికాతి

1) శ్రీమద్భా 3-29-12,13.
2) శ్రీధర వ్యాఖ్య 3-29-12, 13

తథా సంఖ్యేయ కల్యాణ గుణగణః[1] —అనుచుఁ బరమాత్మయగు శ్రీమన్నారాయణుని విశిష్టాద్వైతులు వివరించు మార్గమునను సరించిన వాఁడాయెను. 'అనఘుఁడు' అనునొక యద్భుతమగు విశేషణమును ప్రయోగించి—నిరస్తహేయ ప్రత్యనీక తయా కల్యాణైకతానతయా చ స్వేతర సమస్త వస్తు విలక్షణస్వరూపః[2]- అని భగవద్రామానుజాచార్య భగవంతుఁడగు శ్రీమన్నారాయణుని హేయగుణ రాహిత్యమును వివరించినట్లుగాఁ దానును చెప్పియున్నాఁడు.

తరువాత శ్లోకము ననుసరించిన పద్యమున మరింత స్పష్ట ప్రతిపత్తితో విశిష్టాద్వైత మతానుసరణమును బ్రకటించినాఁడు పోతన.

మూలమున గల 'నిర్గుణత్వ' అను పదమును భక్తితో సమన్వయించి శ్రీ శ్రీధరాచార్యుల వారర్థమును వివరింపగాఁ బోతన యా పదమును గవితలో సమన్వయించి యిట్లను వదించి యున్నాఁడు-

"హేయగుణ రహితుఁడనఁగల
నా యందుల భక్తి లక్షణముఁ దెలిపెద నన్
దాయత నిర్హేతుకముగఁ
జేయు మదీయ వ్రతైక చిరతర భక్తిన్" (3–957)

ఈ యనువాదమునఁ గవి బుధుఁడు- "హేయగుణ రహితుఁడనఁగల నా యెడ" అని తనను హేయగుణ రహితునిగా నిర్గుణపదమున కర్థమును వివరించి యున్నాఁడు. ఇది స్పష్టముగా విశిష్టాద్వైత సంప్రదాయాను సరణము.

ఆ తరువాత 'ఆత్యంతిక భక్తి యోగముచే' మత్సమానాకారమును బొందును'— అని విశిష్టాద్వైత సిద్ధాంతానుకూలమగు ముక్తి స్వరూపమును చెప్పియున్నాఁడు.

ఈ సందర్భమున శ్రీ శ్రీధరాచార్యులవారు భక్తికి ఫలితముగా వచ్చు ఫలమానుషంగికమనియు, వట్టి భక్తి- 'మద్భావాయోపపద్యతే' అనగా- మద్భావాయ బ్రహ్మత్వాయ-బ్రహ్మత్వము కొరకు సహకరించును. అని వ్యాఖ్యానించియున్నారు.

---

1) వేదార్థ సంగ్రహః
2)

అందుకు విరుద్ధముగాఁబోతన 'పక్వమానాకారతఁ బొందును' అని వైష్ణవ ముక్తినే వర్ణించి యున్నాఁడు.

ఈ విధముగా నీ ఘట్టమునఁబోతన శ్రీ శ్రీధరుల వారి వ్యాఖ్యను నిరాకరించి-విశిష్టాద్వైత మార్గమునను సరించి తన యనువాదమును సాగించి యున్నాఁడు.

4. తృతీయ స్కంధమున దేవహూతి కోరికపైఁ గపిలుఁడు ప్రకృతిపురుష లక్షణములను దెలియజేయుసందర్భమున —

"సానుబంధే చ దేహేఽస్మిన్న కుర్వన్న సదాగ్రహమ్।
జ్ఞానేన దృష్టతత్త్వేన ప్రకృతేః పురుషస్య చ॥
నివృత్త బుద్ధ్యవస్థానో దూరీభూతాన్యదర్శనః।
ఉపలభ్యాత్మనాత్మానం చక్షుషేవార్క మాత్మదృక్॥
ముక్తలింగం సదాభాస మసతి ప్రతి పద్యతే।
సతో బంధుమసచ్చక్షుః సర్వానుస్యూత మద్వయమ్॥"[1]

దీనికి శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యయిది —

"సాను బంధ ఇతి అసదాగ్రహమ్ అహం మమేదం ప్రకృతేః పురుషస్య చ దృష్టతత్త్వం యేన। తేన జ్ఞానేన నివృత్తేతి నివృత్తాని బుద్ధ్యవస్థానాని జాగ్రదాదీని యస్య స అహంకారావచ్ఛిన్నేన ఆత్మానం శుద్ధం ఉపలభ్య ఏకస్యైవావచ్ఛేదాన వచ్ఛేదాభ్యాం కరణత్వే కర్తృత్వేచ దృష్టాంతమాహ - చక్షుషా చక్షురవచ్ఛిన్నేన అర్కేణ గగనస్థ సూర్యమివ। ఏవం ఆత్మదృక్ శుద్ధమాత్మానం పశ్యన్. ముక్త లింగమితి — ముక్తలింగం నిరుపాధికం అసతి మిథ్యాభూతే అహంకారే సదాభాసం సద్రూపేణావభాసమానం బ్రహ్మప్రాప్నోతి. పద్ధస్య జీవ స్వరూపాద్విశేష మాహ- సతః కారణస్య బంధు మధిష్ఠానం అసతః కార్యస్య చక్షురివ ప్రకాశం సర్వేషు కార్యేషు కారణేషు చానుస్యూతం అద్వయం పరిపూర్ణమ్।"

ఈ నిర్వహణమునకుఁబూర్తి విరుద్ధముగాఁ బోతనయొక్క యనువాదము విశిష్టాద్వైత పరముగా సాగినది.

---

1) శ్రీమద్భా 3 - 27-శ్లో 9 - 11

2) శ్రీధరీయ వ్యాఖ్యా 3 — 27 - 9 నుండి 11 శ్లో వరకు

"ఆత్మకలిత విజ్ఞానియై బంధకంబులైన
మన శరీర పరిగ్రహోత్క్రాంతయందు
నాగ్రహము సేసి పర్తింపవగుమ మఱియు" (3-909)

"జీవేశ్వర తత్త్వజ్ఞానంబునం జేసి నివృత్తంబైన బుద్ధిం దదవస్థానంబునం గలిగి యాదిభూతేతర దర్శనంబై జీవాత్మజ్ఞానంబునం జేసి దశేంద్రియంబున సూక్ష్మవి దర్శించు దందంబున నాత్మనాయకుండగు శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతంబగు నహంకారంబున నద్రూపంబుచేఁ బ్రకాశమానం బగుచుఁ బ్రధాన కారణంబునకు నధిష్ఠానంబును గార్యంబునకుఁ బూర్ణమంబోలెఁ బ్రకాశంబును సమస్త కార్య కారణాము న్యూతంబును బరిపూర్ణంబును సర్వవ్యాపకంబునగు బ్రహ్మంబును బొందుము." (3-910)

శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యయందు-'అహంకారముతో గూడిన జీవుని యందు శుద్ధ బ్రహ్మమును దర్శించుట'— చెప్పఁబడగాఁ బోతన యనువాదమున 'ఆత్మనాయకుండగు శ్రీమన్నారాయణుని'-ప్రసక్తి తీసికొనిరాఁబడినది. దీనిని బట్టి పరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడేయనియు, నాతఁడే జీవాత్మలకు నాయకుఁ డనియు, జీవుఁడాతనికి నశపత్రియనియు—అనగా— విశిష్టాద్వైతులు పేర్కొను "శేష" మనియు, జీవాత్మయుఁ బరమాత్మయు వేఱనియు, నాయకుఁడగు శ్రీమన్నారాయణుఁడు "శేషి" యనియు, నాతఁడు సర్వతంత్ర స్వతంత్రుఁ డనియుఁబేర్కొనినట్లయినది. ఇది విశిష్టాద్వైత మత సంప్రదాయ పథము.

5. దశమస్కంధమున శ్రీకృష్ణావతార ఘట్టమున వసుదేవుఁడు తనకుఁ గుమారునిగా జన్మించిన విష్ణువు నిట్లు ప్రార్థించినట్లు మూలమున నున్నది-

"య ఆత్మనో దృశ్యగుణేషు సన్నితి
వ్యవస్యతే స్వవ్యతిరేకతో బుధః ।
వినానువాదం న చ తన్మనీషితమ్
సమ్యగ్యత స్త్యక్త ముపాదదత్పుమాన్॥"[1]

ఈ శ్లోకమునకు శ్రీ శ్రీధరాచార్యులవారు—

**అతఃఅవస్తుత్వేన త్యక్తం బాధితమేతత్ వస్తు బుద్ధ్యా ఉపాదదత్ స్వీకుర్వన్ అబుధ ఇత్యర్థః"[2]** అని వ్యాఖ్యానించి యున్నారు. వారి తాత్పర్యము-అవస్తువగుట

1) శ్రీ మద్భా 10-3-17
2) శ్రీధరీయ వ్యాఖ్య 10-3-17

చేత వ్యక్తమగు నీ దేహాది పదార్థమును మన్నదని బుద్ధితో గ్రహించువాఁ డజ్ఞాని యేయగు. దీనివలన జగత్తు మిథ్యయను వాదము ప్రసక్తమగుచున్నది.

కాని పోతన తన యీ వాదమును విశిష్టాద్వైత సిద్ధాంత విధేయముగా నిట్లు కావించియున్నాఁడు :

"ఆత్మ వలనఁ గలిగి యమరు దేహాదుల
నాత్మకంటె వేఱులనియెడంచు
దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ
విశ్వమెల్ల నీవ వేఱలేదు" (10-పూ.భా - 121)

పోతన తన యీ యనువాదమున నాత్మవలనఁ గలిగిన ప్రపంచక మంతయు నాత్మకంటె వేఱు కాదనియు, దేహాది ప్రపంచ మాత్మకంటె వేఱుగాఁ దలఁచువాఁడు మూఢతముఁడని విశ్వము నారాయణుడే యనియు వివరించి జగత్తునకు శ్రీమన్నారాయణ తాదాత్మ్యమును జెప్పియున్నాఁడు.

"నీవే తలపు విశ్వములేదు" అని చెప్పుట యద్వైతము. "విశ్వము నీవే" యనుట విశిష్టాద్వైతమని యీ సందర్భమున శ్రీమాన్ యన్.సి.రఘునాథాచార్యులు గారు వివరించినారు.[1]

ఇట్లు పోతన యద్వైత పరముగా వ్యాఖ్యానించిన శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యానమును తిరస్కరించి దాని కత్యంత విరుద్ధముగా విశిష్టాద్వైత సమ్మతముగా ననువదించి యున్నాఁడు.

6. దశమస్కంధమున మఱియిది— దేవకీదేవి గర్భమున నర్భకుండుగా నున్న పురుషోత్తము నుద్దేశించి దేవతలందఱు నారదాది మునులతో గూడి స్తుతించిన సందర్భమున మూలమునగల శ్లోక మిది—

"తథా న తే మాధవ తావకాః క్వచి
ద్భ్రశ్యంతి మార్గాత్త్వయి బద్ధసౌహృదాః
త్వయాభిగుప్తా విచరన్తి నిర్భయా
వినాయకానీకప మూర్ధసు ప్రభో"[2]

1) పోతన సాహిత్య గోష్ఠి పుట 93.

2. శ్రీమద్భా 10-2-35

ఈ శ్లోకమునకు శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యయిట్లున్నది-

"త్వదీయాస్తు న కదాచిదపి పతన్తీత్యాహః తథేతి- వినాయకాః విఘ్నహేతవః తేషామనీకాని స్తోమాః తాని పాంతి యే తేషాంమూర్ధసు విచరన్తి విఘ్నాన్ జయన్తీత్యర్థః యద్వా త్వద్రూపాః ప్రత్యేకం వినాయకా నీకప మూర్ధసు నము దానాం మూర్ధసు చరన్తి"[1]

ఇంకఁ బోతన యనువాదమును బరికింతము-

"నీ వారై నీపెనఁ దమ
భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యే విఘ్నంబులఁ జెందక
నీ వఱలెడి మేటిచోట నెగడుదు రీశా !"

(10-పూ-భా-95)

ఈ యనువాద పద్యమున నిత్యవైకుంఠ లోక నివాసమును గూర్చిన ప్రసంగము పోతనచేఁ గ్రొత్తగాఁ జేయఁబడినది. ఈ పద్యమునఁ గల-'నీవఱలెడి మేటి చోట'-అను నచ్చతెనుఁగు పదముల విన్యాసమున నల్పాక్షరములలో నన ల్పార్థరచనము గోచరించుచున్నది.

మూలమున నీ శ్లోకమునకుఁ బూర్వమున గల శ్లోకమున "నీ యందనాదరము గల మన జాలు బహుజన్మ తపఃఫలముగా పరమపదము నధిరోహించినను సహంకారము తోడను, నవిశుద్ధ బుద్ధులతోడను నధఃపతితులగుచున్నా"రని వివరింపఁబడినది. ఆ సందర్భమున మూలమునఁగల 'పరం పదం' అను పదమునకు "మోక్షసన్నిహితమ్"- అని శ్రీ శ్రీధరాచార్యులవారు వ్యాఖ్యానించి యున్నారు. పోతన మాత్ర మీ శ్లోక సందర్భమున "పరంపదం"- అను పదమును విడచి యా భావము నీ పద్యమున "నీ వరలెడు మేటి చోట"- అని యనువదించి శ్రీమన్నారాయణ పరాయణులు వైకుంఠ లోకమును బొందెదరనియు- నది పునరావృత్తి రహితమగు దివ్యదేశమనియు నిదియే పరమోత్తమ స్థానమనియు- స్పష్ట పరచియున్నారు. ఈ ప్రస్తుత శ్లోకమునకు- శ్రీ వీరరాఘవాచార్యుల వారి విశిష్టాద్వైత వ్యాఖ్య పోతన యొక్క యనువాదముతో సమానముగా నున్నది -

1. శ్రీధర వ్యాఖ్య 10-2-33

"శివదశాయాం నిమ్నానవహత త్వద్భక్తియోగా స్తత్త్వాం ప్రాప్నువం తీతి భావః"[1] అని యీవ్యాఖ్యా వాక్యమే నవైకుంఠలోక ప్రస్తావము చేయఁబడినది. ఆ వరప్రస్తావము "మేటిచోటు" అనుట పోతన చూపిన "కొనమెరపు".

ఈ విధముగా శ్రీవరాచార్యుల వారి వ్యాఖ్యతో సంబంధము లేకుండ మూల ముతో సంబంధము లేకుండ స్వీయ ప్రణాళిక ననుసరించి స్వచ్ఛందముగా విశిష్టా ద్వైత పరముగాఁ బోతన యనువదించి యున్నాఁడు.

7. దశమ స్కంధములోని పదియేకి షట్టము. శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవినిఁ గొని పోవుచుండగా రుక్మి వెంబడించిన సందర్భమునఁ బలికిన పలుకులు మూలమున నిట్లున్నవి —

> "ధనుర్వికృష్య సుదృఢం జిష్ణుం కృష్ణం త్రిభిశ్శరైః।
> ఆహ చాత్ర క్షణం తిష్ఠ యదూనాం కులపాంసన ॥
> కుత్రయాసి స్వసారం మే ముషిత్వా ధ్వాంక్ష వద్ధవిః।
> హనిష్యేఽద్య మదం మన్ద మాయినః కూటయోధినః॥
> యావన్నమే హతో బాణైశ్శయితా ముంచదారికామ్।"[2]

ఈ మూల శ్లోకములను వ్యాఖ్యానించుచు శ్రీ శ్రీధరుల వారు రుక్మి పలుకు లలో నిగూఢార్థమును వివరించు ప్రయత్నమును జేసియున్నారు. వారి వ్యాఖ్యాన పంక్తులివి—

"అ హేతి. యదూనాం కులపాంసన కులదూషణేతి లౌకికార్థః వాస్తవార్థస్తు యదూనాం కులస్యప హే యదుకులపతే. అంసన వ్యయం చ రిపుహనన చతుర అంసన మాఘాత ఇత్యస్మాద్ధాతోః కర్తరి ల్యుట్ ప్రత్యయో నందాది విహితః. ధ్వాంక్షః కాకః. స యథా హవిః ముష్ణాతి తద్వత్ వస్తుతః అధ్వాంక్ష వదితి ఛేదః సహస్రాత్ వదిత్యర్థః సింహశార్దూలవద్వా"[3]

---

1. శ్రీ వీరరాఘవీయవ్యాఖ్యా 10-2-35.
2. శ్రీమద్భా 10 - 54 - 25, 26, 27.
3. శ్రీధరీయ వ్యాఖ్యా 10 - 54 - 25, 26, 27.

ఈ వ్యాఖ్యానము నందు శ్రీశ్రీధరాచార్యుల వారు యదూనాం కుల పాంసన యనుదానికి ఓ యదుకులపతీ! యనియు - ధ్వాంక్షః అని యొకసారి - అధ్వాంక్షః అని మఱియొకసారి విడదీసి 'ధ్వాంక్షః' అనగా 'కాకి' యని సామాన్యార్థమునందును, 'అధ్వాంక్షః' అనగా సహస్రాక్షుఁడని విశేషార్థమునందును చెప్పియున్నారు.

పోతనామాత్యుఁ డీ ఘట్టము ననువదించు పట్టునఁ బైనఁ జేర్కొనిన విధానమును బూర్తిగాఁ దిరస్కరించి స్వీయ కల్పనముతో సందర్భమునకు వన్నెయు వాసియు సమకూర్చి తన విశిష్టాద్వైతాభిమానమును - తద్విషయక పరిజ్ఞానమును - శ్రీమన్నారాయణ పరాయణత్వమును విశదము కావించి యున్నాఁడు.

రుక్మి పలుకులలో గూఢముగ శ్రీమన్నారాయణ తత్త్వమును మేళవించి పోతన తన యనువాదమును నిర్వహించి యున్నాఁడు—

"మా సరి వాఁడవా మా పాపఁగొని పోవ
నేపాటి గలవాఁడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడఁ బెరిగితి
వెయ్యది నడవడి యెవ్వఁ డెఱుఁగు
మాన హీనుఁడ వీవు మర్యాదలును లేవు
మాయఁ గైకొని కాని మలయ లేవు
నిజ రూపమున శత్రు నివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు వావి లేదు
కొమ్మ నిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువ నేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల
గర్వమెల్లఁ గొందుఁ గలహ మందు"

(10 – పూ. భా. - 1764)

ఈ పద్య రచనమునఁ బోతన ప్రదర్శించిన కల్పనా శిల్ప మనల్పము.

సోదరి నపహరించుకొని పోవు నొక దుంటరితో నొక యన్న యన్నమాట లౌకిక యర్థమున, పారలౌకిక యర్థమున రుక్మిణీ హరణమును గావించుచున్న శ్రీకృష్ణుఁడే శ్రీమన్నారాయణుఁడను తత్త్వమును విస్తరింపఁజేయు పద్యప్రస్తారము.

లౌకికార్థము సుబోధ్యము కావునఁ బరమార్థమును మాత్రము వివరింతును.

1. మా నవివాఁడవా = అవిద్యా పరివృతులగు జీవులకంటె విలక్షణుఁడవు లేక లక్ష్మీదేవి (మా) కి పతియైనవాఁడవా యని
2. ఏపాటి గలవాఁడవు = అనంతుఁడవు
3. ఎందు జన్మించితి వెక్కడఁ బెరిగితి వెయ్యది వదవది యెవ్వఁడెఱుఁగు = పరమాత్మయొక్క పుట్టుక స్థితి ప్రవర్తనల నెవ్వరు తెలియఁజాలరు
4. మానహీనుఁడవీవు = మానమనగాఁ బరిమాణమని యర్థముగాన ననంతశక్తి ధరుఁడవనిగాని—మానమనగా నభిమానమని యర్థము గలదు కావున గుణాతీతుఁడవనిగాని చెప్పవచ్చును.
5. మర్యాదలును లేవు = మర్యాద యనగా 'హద్దు' అని యర్థము గాన నపరిచ్ఛిన్నుఁడవని యర్థము
6. మాయఁ గైకొని కాని మలయరావు = మాయ శక్తిగాఁ గలవాఁడవు
7. నిజరూపమున శత్రునివహంబు పైఁబోవు = మత్స్య కూర్మాది వివిధ విచిత్ర రూపములతో దుష్ట రాక్షసులను జంపిన నారాయణుని దుష్టశిక్షణశీల స్ఫురించును.
8. వసుధేశుఁడవుగావు = కేవలము భూమికేగాక సర్వ లోకములకు నీశుఁడవని భావము
9. వావిలేదు = ఒక్కరు దగ్గరవారు-ఒకరు కారనువది భగవంతునకు లేదని యర్థము
10. నీవు గుణరహితుఁడవు = హేయగుణ రహితుఁడవు

ఈ విధముగా రుక్మి పలుకులలో మూలములో లేకుండ— శ్రీ శ్రీధరాచార్యుల వారు చెప్పిన తీరు తప్పించి-స్వతంత్రముగా- విలక్షణ కవితా కళా వైదగ్ధ్యమును బ్రదర్శించి-యవకాశము గలిగించుకొని శ్రీమన్నారాయణ తత్త్వమును విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయానుకూలముగా- నిర్వహించిన పోతన యనువాదమును- భా.భ. తప్పకుండ శ్రీ శ్రీధరీయ వ్యాఖ్య ననుసరించి చేయఁబడిన దనుటయుఁ- నద్వైత పరముగాఁ జేయఁబడిన దనుటయు- దత్త్వాంశములవట్ల శ్రీ శ్రీధరులవారి వ్యాఖ్యాను కూలముగాఁ జేయఁబడినదనుటయు బొసఁగదని తోచుచున్నది.

—౦—

# గంగన పరిష్కరణములు

## 1. అమూలకములు

1. పంచమ స్కంధమున ప్రియవ్రతుని వృత్తాంతమును ముగించుచు శుకయోగి—

> "హరిసేవ నా ప్రియవ్రతుఁ
> డరయఁగఁ గైవల్య పదవి నందుట యరుదే
> ధరఁ జండాలుండైనను
> హరి నామస్మరణఁ జెందు నవ్యయ పదమున్" (5-23)

అని శ్రీహరి స్మరణము యొక్క మహిమను వర్ణించినట్లు గంగన రచించి యున్నాఁడు— ఈ శ్రీహరి స్మరణము యొక్క వర్ణనము మూలమున లేదు. గంగన స్వయముగాఁ గల్పించియున్నాఁడు. ఇట్లు మూలమున లేని భావముతో స్వయముగాఁ గల్పించుటకుఁ గారణము స్వభావ సిద్ధముగ నాతనికిఁ గల విశిష్టాద్వైత ప్రీతియేయని చెప్పవలసియున్నది. ఈ పద్యము స్వరూపమునఁ జిన్నదైనను తత్త్వ దృష్టిచే విశాలార్థద్యోతకమై యున్నది. ఇందు శ్రీమన్నారాయణుఁడే ప్రాప్యుఁడనియుఁ- దత్ప్రాప్తికి నుపాయము భక్తియోగమైనను- నందులకు ఫలము- అవ్యయ పద మగు వైకుంఠమనియుఁ- దద్వైకుంఠ ప్రాప్తి కధికారము భక్తిచే గాని జన్మముచేఁ

గావునియు గంగనచే వివరించఁబడినది. ఈ భావములన్నియు విశిష్టాద్వైత సంప్రదాయ సిద్ధములుగాఁ బ్రసిద్ధములైనవి.

2. ఐదవ స్కంధమున ఋషభ వృత్తాంతమును ముగించుచు గంగనార్యుఁడు మూలగ్రంథమునఁగల భావమునకుఁ గించి ద్విరుద్ధముగ భక్తియోగ ప్రాశస్త్యమును దాని వలననే మోక్షము కలుగుననియు వివరించియున్నాఁడు.

ఈ సందర్భమునఁగల మూలగ్రంథమిది—

"యస్యామేవ కవయః ఆత్మాన మవిరతం వివిధ వృజిన సంసార పరితాపో పతప్యమాన మను సవనం స్నాపయంత స్తయైవ నిర్వృత్యా పరయాహ్యపవర్గ మాత్యంతికం పరమపురుషార్థమపి స్వయమాసాదితం నో ఏ వాద్రియన్తే భగవదీయ త్వేనైవ పరిసమాప్త సర్వార్థాః"[1]

ఈ మూల భాగమును గంగన యిట్లనువదించినాఁడు-"హరి భక్తి తాత్పర్యంబునం బెద్దలు భాగవతులగుటం జేసి సంప్రాప్త సర్వపురుషార్థులగుచు వివిధ వృజిన హేతుకంబగు సంసార తాపంబును దాని యవిరతంబుఁ బ భక్తి యోగామృత స్నానంబు చేసి పరమ పురుషార్థంబగు మోక్షంబును జెందుదురు"(5-89)

ఈయనువాదమున మూలమున గల-"భగవదీయత్వము చేతనే నెరవేఱిన సర్వార్థములు గల వారై పరమ పురుషార్థమగు మోక్షమును గూడ నాదరింపరు—" అను భాగమును గంగన విడిచివైచి—"భగవద్భక్తి యోగముచే మోక్షమును గాంతురు—"అను నర్థమును వెల్లడించి భాగవత జన వైభవమును—భక్తి యోగమే మోక్షమున కుపాయము—అను శ్రీ వైష్ణవ సిద్ధాంతమును బ్రకటించియున్నాడు.

3. పంచమ స్కంధము ద్వితీయాశ్వాసమునఁ బ్రియవ్రతుని వృత్తాంతమును విని పరీక్షిత్తు శుకయోగితోఁ బలికిన పలుకులు మూలమున నిట్లున్నవి—

"భగవతో గుణమయే స్థూలరూప ఆవేశితం మనో హ్యగుణేఽపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరే బ్రహ్మణి భగవతి వాసుదేవాఖ్యే క్షమ మావేశితుం తదుహైతద్ గురోఽర్హస్యను వర్ణయితు మితి"[2]

1) శ్రీమద్భా 5-6-18.

2) శ్రీమద్భా 5-16-3.

ఈ మూలమును గంగన విశిష్టాద్వైత సిద్ధాంతాను సారముగా సమన్వయించి యున్నాఁడు. గంగన యనువాదమిది— "గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరి శరీరంబగు నీలోకంబునందు నిలిపిన చిత్తం బగుణంబును సూక్ష్మంబును నాత్మజ్యోతియు బ్రహ్మంబునైన వాసుదేవుని యందు నిల్పంగావున ద్వీప వర్షాది విస్తారంబు వినిపింపుము" (5–ద్వి. అ. 14)

ఈ లోకము సత్త్వాది గుణ పరిణామ రూపమగు శ్రీహరి యొక్క స్థూల రూపము. ఇట్టి స్థూలశరీరమునందు మనస్సును నిలిపినచో సత్త్వాది గుణరహితమును - అనగా నప్రాకృతమగు నట్టియు, సూక్ష్మమైనట్టియు, స్వయం ప్రకాశమైనట్టియుఁ బరమాత్మ స్వరూపమును బ్రహ్మమునునగు వాసుదేవుని యందు బుద్ధి నిలుచునని గంగన తన యనువాదమున స్పష్టపరచినాఁడు.

'ఈ దృశ్యమాన ప్రపంచము పరమాత్మయగు నారాయణుని శరీరము. లక్ష్మీ ప్రపంచమున కాత్మ'–అను నీ శరీర సంబంధము విశిష్టాద్వైతమునకుఁ బ్రధాన ప్రతితంత్రము. గంగన యీ సిద్ధాంతము న మూలకముగా నీ సందర్భమునఁ బ్రతిపాదించినాఁడు.

ఈ ప్రశ్నమునకు శుకయోగి యిచ్చిన సమాధాన మీ పై భావమునే మఱింత స్పష్టముగా వివరించినది—

"అట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూల శరీరంబగుటం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకల శ్రేయంబులుం గలుగు. నీశ్వరు స్థూల శరీరంబుఁదెలిపిన వారికి శ్రద్ధాభక్తులంజేసి సూక్ష్మ దేహంబు నెఱుంగ వచ్చు భూద్వీప వర్ష నది ద్రి నభ స్సముద్ర పాతాళ దిఙ్నరక తారాగణ లోక సంస్థితంబయి సకలజీవ నికాయ్యంబై యద్భుతం బయిన శ్రీహరి స్థూలశరీర ప్రకారంబు వివిపించితివి" (5-ద్విఅ-164)

ఈ వాక్యముల వలన సమస్త ప్రకృతియు సమస్త జీవనికాయమును శ్రీమన్నారాయణుని శరీరమనియు, దాని యందు దృష్టి నిలిపినచో సూక్ష్మరూపుఁడగు పరబ్రహ్మమును గుఱించిన జ్ఞానము సిద్ధించుననియు వివరించుచు సూక్ష్మ చిదచి ద్విశిష్టమగు బ్రహ్మము స్థూల చిదచి ద్విశిష్ట బ్రహ్మముగాఁ బరిణామము నొందుటయే సృష్టియనియు, స్థూలచిదచి ద్విశిష్ట బ్రహ్మము సూక్ష్మ చిదచి ద్విశిష్ట బ్రహ్మముగాఁ బరిణామము నొందుటయే ప్రళయమనియు విశిష్టాద్వైతులు వివరించు పరిణామ వాదమునకుఁ గడుంగడు ననుకూలమగు భావములను గంగన వెల్లడించి యున్నాఁడు.

# గంగన పరిష్కరణములు

## 2. శ్రీధర వ్యాఖ్యా విరుద్ధములు

1. పంచమ స్కంధము ప్రథమాశ్వాసమునఁ బ్రియవ్రతుని వృత్తాంతమును గూర్చి పరీక్షిత్తు శుకయోగినిఁ బ్రశ్నించినాఁడు. శుకయోగి ప్రియవ్రతుని వృత్తాంతమును వివరించినాఁడు.

నారద సాంగత్యముచేఁ బ్రియవ్రతుఁడు రాజ్యపాలనము సుజ్ఞాన భంజకమని భావించి యంగీకరింపలేదు. రాజ్య పాలనమున కీతని నొడఁబరచుటకు బ్రహ్మ విచ్చేసి పలికిన పలుకులందు విశిష్టాద్వైత మత సమ్మతములగు భావము లున్నవి.

"ఉత్పత్తి స్థితి నాశంబులకు శోక మోహ భయ సుఖ దుఃఖంబులకు నీశ్వరాధీనుండ కాని జీవుండు స్వతంత్రుడు కాఁడు." (5-11)

గంగన చేసిన యీ వాక్యానువాదము విశిష్టాద్వైత విధేయము. మూలమున నున్న విషయమునే మఱింత స్పష్ట ప్రతిపత్తితో వివరించుట జరిగినది. మూల శ్లోకమిది —

"భవాయ నాశాయచ కర్మ కర్తుం
శోకాయ మోహాయ సదాభవాయ।
సుఖాయ దుఃఖాయ చ దేహయోగ
మవ్యక్త దిష్టం జనతాంగధత్తే॥"[1]

ఈ మూల శ్లోకమును శ్రీ శ్రీధరాచార్యుల వారిట్లు వ్యాఖ్యానించినారు —

"తత్ర దేహ యోగే తావ త్పారతంత్ర్యం ప్రసిద్ధ మిత్యాహ—భవాయేతి. భవః జన్మ భవాయార్థం అవ్యక్తేన ఈశ్వరేణాదిష్టం దత్తం దేహయోగం జనతా జీవ సమూహః సదా ధత్తే న త్వన్యథా కర్తుం శక్నోతి అంగ హే ప్రియవ్రత।"[2]

ఈ వ్యాఖ్యలో దేహ యోగముచే జీవునకుఁ బారతంత్ర్యము కలుగునని శ్రీ శ్రీధరాచార్యుల వారుపక్రమించినారు. ఉపాధి భేదముచే ననగా 'దేహము నాశ్రయించి యున్నంత వరకే యీ పారతంత్ర్యము' - అను నర్థమును-దదనంతరము బ్రహ్మైక్యమును ధ్వనింపఁ జేయుచు నద్వైత పరముగాఁ జేయఁబడిన ప్రారంభ మిది —

ఇందులకు విరుద్ధముగా మూలమున నున్న దేహయోగ మను పద బంధమును బూర్తిగాఁ దొలఁగించి సర్వావస్థల యందును జీవుఁడు పరమేశ్వరునకుఁ బరతంత్రుఁడే యని పేర్కొని మఱింత స్పష్టత కొఱకు "స్వతంత్రుడు కాఁడు" అని వివరించినాఁడు గంగన.

2. ప్రియవ్రతుని పుత్రులు ముగ్గురు బాలకు లయ్యు పారమహంస్య యోగము నాశ్రయించిన సందర్భమున గంగన మూలమున నున్న విషయమును యథా తథముగాఁ దెలిగించుటతో వ్యాఖ్యాకారులగు శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యను గమనించియు వారి పరిష్కారములను మాత్రము గ్రహింపక స్వతంత్రించి విశిష్టాద్వైత పరముగా ననువదించి యున్నాఁడు.

"తస్మిన్ను హ వా ఉపశమనశీలాః పరమర్షయః సకలజీవ నికా యా వాసస్య భగవతో వాసుదేవస్య భవ భీతానాం శరణ భూతస్య శ్రీమచ్చరణారవిందా

1. శ్రీమద్భా 5-1-13.
2. శ్రీధరీయ వ్యాఖ్య 5 - 1 - 13.

విరత స్మరణా విగళిత పరమభక్తి యోగాను భావేన పరిభావితాంతర్హృదయాధిగతే భగవతి సర్వేషాం భూతానా మాత్మభూతే ప్రత్యగాత్మన్యేవాత్మ తాదాత్మ్య మవిశేషేణ సమీయుః"[1]

దీనికి శ్రీ శ్రీధరులవారి వ్యాఖ్యా వాక్యములివి—

"తస్మిన్నితి తస్మిన్ పారమహంస్యాశ్రమే శ్రీమచ్చరణారవిందయోః అనవరత స్మరణేన అవిగళితః అఖండితః యః పరమో భక్తి యోగః తస్యానుభావేన విశోధితాంతఃకరణే ప్రతీతో యో భగవాన్ తస్మిన్ ఆత్మనః త్వం పదార్థస్య తాదాత్మ్యం అవిశేషేణ విశేషో దేహాద్యుపాధిః తదపోహేన ప్రాపుః"[2]

ఈ సందర్భమున గంగన గావించిన వ్యాఖ్య యిది—

"సర్వ జీవ నికాయా వాసుందును తవనీతజనశరణ్యుఁడును సర్వాంతర్యామియు భగవంతుఁడు నగు వాసుదేవుని చరణారవిందా విరత స్మరణానుగత పరమభక్తి యోగాను భావంబున విశోధితాంతః కరణులగుచు నీశ్వరు తాదాత్మ్యము నొందిరి" (5-16)

ఈ యనువాదములోని "విశోధి తాంతః కరణులగుచు" అనునది శ్రీధరుల వ్యాఖ్యలోనిదే. అటు పిమ్మట వ్యాఖ్యలో గల 1) ప్రతీతో భగవాన్ తస్మిన్ ఆత్మనః త్వం పదార్థస్య తాదాత్మ్యం — అను విషయమును 'అ విశేషేణ విశేషో దేహా ద్యుపాధిః తదపోహేన' — అను భావమును బూర్తిగాఁ బరిత్యజించి యను వదించుట వలన శ్రీ శ్రీధరులు కల్పింపఁ జూచిన యద్వైత సంస్కారమును దిరస్కరించి నట్లైనది. ఈ ఘట్టమున ముక్తికి భక్తి యోగముపాయమనియు, నా భక్తి వాసుదేవుని చరణార వింద విరత స్మరణాను గతమనియు విశిష్టాద్వైత పథమున గంగనచే వివరింపఁబడినది.

3. ఋషభ వృత్తాంతమును ముగించుచు శుకయోగి పరీక్షిత్తుతో శ్రీకృష్ణుని గుఱించి ప్రస్తావించినట్లు మూలమున నిట్లున్నది—

"రాజన్ పతి ర్గురు రలం భవతాం యదూనాం
దైవం ప్రియః కులపతిః క్వచ కింకరోవః

1. శ్రీమద్భా 5 - 1 - 27.
2. శ్రీధరీయ వ్యాఖ్య 5 - 1 - 27.

అస్త్వేవ మంగ భగవాన్ భజతాం ముకుందో
ముక్తిం దదాతి కర్హిచిన్నతు భక్తియోగమ్"[1]

ఈ శ్లోకమును శ్రీ శ్రీధరాచార్యుల వారిట్లు వ్యాఖ్యానించియున్నారు–

"భగవతోఽతి సులభత్వం దర్శయన్ మోక్షస్య చాతి దుర్లభత్వాద్భక్తే రియమతి స్తుతి రేవేత్యాశయం వ్యాహ- రాజన్నితి. హేరాజన్ ! భవతాం పాండవానాం యదూనాంచ పతిఃపాలకః గురు రుపదేష్టా దైవం ఉపాస్యః ప్రియః సుహృత్ కులస్యపతిః నియంతా కిం బహునా క్వచ కదాచిత్ దూత్యాదిషు వః పాండవానాం కింకరోఽపి ఆజ్ఞానువర్తీ అస్తు నామైవం భజతామన్యేషాం నిత్యంభజతా మపి ముక్తిం దదాతి నతు కదాచిదపి సప్రేమ భక్తి యోగమ్"[2]

వీరి యభిప్రాయము-ఓ పరీక్షిన్మహారాజా ! మీకును యాదవులకును ప్రభువు, గురుఁడు, దైవము. ప్రియుఁడు, కులపతి విశేషించి దౌత్యము వెరవునెడల మీకు కింకరుఁడునై ముకుందుఁడు వర్తించియున్నాఁడు. ముకుందుఁడు సేవించువారికి ముక్తి నొసఁగును కాని యట్టి భక్తి యోగమును మాత్రము ప్రసాదింపఁడు- అను నర్థమును సాగినది. దీనికి గంగన గావించిన యనువాదము విరుద్ధమైనది –

"యాదవులకు మీకు నత్యంత కులగురు
పైన కృష్ణుఁ డెచటనైనఁ గలఁడు
కొలుచువారి కెల్ల సులభుఁడై మోక్షంబు
నిచ్చుఁ జింత సేయనేల నీకు" (5-ప్ర.ఆ-90)

ఇందుఁ గృష్ణుని భక్త సులభత్వము మోక్షదాయకత్వమును ప్రస్తావింపఁబడినవి. మఱియు నీ యనువాదమున మూలమున గల "కర్హిచిన్నతు భక్తియోగమ్"— అను భావము వ్యంగ్యము. "క్వచ కింకరోవః" అను దానికి గూడ ననువాదము లేదు. మఱియుఁ "గొలుచువారికెల్ల సులభుఁడై" అనునది గంగన సృష్టి. "కృష్ణుఁడెచట నైనఁ గలఁడు"— అనుపదియు గంగన సృష్టియే. గంగన యీ "పద్యమునఁ దనదైన పక్కిలో శ్రీ శ్రీధరవ్యాఖ్యా విరుద్ధముగా శ్రీకృష్ణుని సర్వాంతర్యామిత్వమును, భక్తజన సౌలభ్యమును జాటి చెప్పినాఁడు.

---

1. శ్రీమద్భా 5 - 6 - 19
2. శ్రీధర వ్యాఖ్య 5-6-19

తదనంతర శ్లోకము ననువదించు పట్టున సూత గంగన యీ మార్గమునే యనుసరించుట చూడగా గంగన విశిష్టాద్వైత ప్రీతి ప్రకటితమగుచున్నది.

తదనంతరము ఋషభ వృత్తాంతమునకుఁ గట్టికతవంట మూలమున నీ శ్లోక మున్నది—

"నిత్యాను భూత నిజలాభ నివృత్త తృష్ణః
శ్రేయస్య తద్రచనయా చిరసుప్త బుద్ధేః।
లోకస్యయః కరుణయాభయ మాత్మలోక
మాఖ్యాన్నమో భగవతే ఋషభాయ తస్మై"[1]

ఈ మూలశ్లోకార్థమును శ్రీ శ్రీధరాచార్యుల వారిట్లు వివరించియున్నారు—

"వర్ణిత ఋషభావతారం నమస్కరోతి - నిత్యేతి - నిత్యమను భూతం యన్నిజం రూపం న ఏవ లాభః తేన నివృత్తా తృష్ణా యస్య సః అతద్రచనయా దేహాద్యర్థం మనోరథేన శ్రేయసి విషయే చిరసుప్తా బుద్ధిర్యస్య జనస్య కరుణయా నిర్భయమాత్మ స్వరూపం య ఆఖ్యాతవాన్ తస్మై ఋషభాయ నమః"[2]

గంగన యీ మూల శ్లోకము ననువదించిన సందర్భమున విశిష్టాద్వైత సమ్మతమగు శ్రీ వైకుంఠలోక ప్రస్తావమును స్పష్టముగాఁ గావించి యున్నాఁడు. అతని యనువాదమిది—

.... ... "అందఱు కిల నవ్యయంబై దివ్యమై
మహానందమై యత్యంత సేవ్యమై యతులమైన
తనదు లోకంబు చూపంగ దగినయట్టి
మోక్ష మార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ
డగుచుఁ దా దాత్మ్య మొందెఁ బ్రత్యక్ష విష్ణు
వైన ఋషభుండు" (5-ప్ర.అ-91)

---

1. శ్రీమద్భా 5 - 6 - 20
2. శ్రీధరీయ వ్యాఖ్యా 5-6-20

ఇందుఁ బరమార్థ రూపముగా వైకుంఠ లోకము వర్ణితమైనది. విశిష్టాద్వైతుల మతమున విష్ణు భక్తిచే వైకుంఠ లోకమునకుఁబోయి శ్రీమన్నారాయణునితోఁ గలసి భోగము ననుభవించుటే మోక్షము. అది పునరావృత్తి రహితము దివ్యము. నిరతిశయానంద ప్రదము. అత్యంత సేవ్యము. ఆ పరమపద నివాసమునకు సాటియైనది మఱియొకటి లేదు కావున నది యతులము—

ఇది గంగన యనువాద విధానము ఇవి. శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యకుఁ బూర్తిగా విరుద్ధమైనది.

# సింగన పరిష్కారములు

## 1. అపూర్వాలంకములు

1. షష్ఠస్కంధారంభమునఁ బరీక్షిత్తు శుకయోగితో - "ఏదినరకుఁగాఁ బడ
మైన నరకపాపము పాలుకాకుండ బ్రతికెడు మార్గమునుపదేశింపుమని కోరినాఁడు.
అందుకు శుకయోగి సమాధానము చెప్పి యటు పిమ్మట "ఒక మంతన మొసఁగెం
తును"— అని కర్మదమములు కాక శ్రీహరి భక్తియే ముక్తినొసఁగునని వివ
రించి యున్నాఁడు. ఈ సందర్భమున మూలశ్లోకమిట్లున్నది —

"న తథా హ్యఘవాన్ రాజన్ పూయేత తప ఆదిభిః ।
యథా కృష్ణార్పిత ప్రాణ స్తత్పూరుష నిషేవయా॥"[1]

ఈ విధముగా నున్న మూలముకంటె భిన్నగాఁ దసయనువాదమును
సాగించినాఁడు సింగన. మూలమునగల – కృష్ణార్పిత ప్రాణః-తత్పూరుష నిషే
వయా - అను పద బంధములను గ్రైకొని వానికి విపుల వ్యాఖ్యాన రూపముగా
ననువాదము సాగించి మోక్షము నిచ్చువాఁడు శ్రీమన్నారాయణుండే — భక్తి ప్రప

---

1) శ్రీమద్భా 6-1-16

త్తులే మోక్షసాధనము — అను విషయములను వివరించుచు నిట్లు చక్కగా నను వాదము చేసినాఁడు—

హరికి సర్వముఁ బ్రాణ మర్పణంబుగఁ జేయు
వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తివశుఁడ సేవించిన
వాని కైవల్యమెవ్వనికి లేదు
వైరుల నిర్మల వ్రత పరుండైనట్టి
వాని కైవల్య మెవ్వనికి లేదు
సరసిజోదరు కథాశ్రవణ లోలుండైన
వాని కైవల్య మెవ్వనికి లేదు
లేదు తపముల బ్రహ్మచర్యాది నియతి
శమ దమాదుల సత్యశౌచముల దాన
ధర్మ ముఖముల సుస్థిరస్థానమైన
వైష్ణవజ్ఞాన జనిత నిర్వాణ పదము" 6-55

ఈ పద్యము సునిశితమగు సింగనామాత్యుని విశిష్టాద్వైత సంప్రదాయ వైశిష్ట్యమును వెల్లడించుచున్నది. అద్వైతి యైనవాఁడు-లేక శ్రీధర వ్యాఖ్యను తు. చ తప్పకుండ ననువదించువాడు వైనచో నీ ఘట్టమున నీ పద్యమును వ్రాయవలసిన యావశ్యకము లేదు.

మూలమున శుద్ధిని బొందుటకుఁ గృష్ణార్పిత ప్రాణుఁ డగుటయు, భాగవత సేవయు విధింపఁ బడగా నీ యంశములు రెండును గైవల్యమునకు సాధనములుగా నీ సింగన యనువాదమున వివరింపఁబడినవి.

ఈ సింగన పద్యమున సుస్థిరమైన వైష్ణవ జ్ఞాన జనిత నిర్వాణ పదమును బొందుటకు—

1) హరికి సర్వప్రాణముల నర్పితములఁజేయుట యనునది సర్వధర్మములను బరిత్యజించి నన్నేశరణము బొందుము. నిన్ను సర్వపాపముల నుండియు మోక్షమును గలిగింతును-అనియు నిత్యాభియుక్తులై యనన్య చింతతో నన్నెవరు పర్యుపాసింతురో వారి యోగక్షేమములను నేను వహింతును-అనియు గీతలో విధింపఁబడిన 'భర సమర్పణము' అనఁబడు 'ప్రపత్తి' (యీ సందర్భమున) వివరింపఁబడినదై

పడి. తన సర్వస్వమును భగవంతునకు సమర్పించి తన రక్షణ భారము నాతనిపై సంపూర్ణముగా నుంచుటయే భరన్యాసము. 'కృష్ణార్పిత ప్రాణః'-యను మూలమున కిది వ్యాఖ్య. 'మఱి 'అట్టి వాని కైవల్య మెవ్వనికి లేదు'—అనుటచే నా ప్రవత్తి కైవల్య సాధనమను విషయమును సదనముగా సింగన విశిష్టాద్వైత ప్రావణ్యముచేఁ జేసిన పరిష్కారము.

2) 'వనజలోచను భక్తవరుల సేవించిన వాని కైవల్యమెవ్వనికి లేదు'—అను సందర్భమున భాగవతుల వైభవమును, భాగవతుల సేవను మనములుగాఁదేర్కొను పట్టి శ్రీవైష్ణవ సముదాచార్యము స్మర్తవ్యము. ఈ మతమున 'భాగవతసేవ భగవత్సేవ కన్న మిన్న'-యనునది సంప్రదాయము. దాని వలనఁ 'గైవల్యము కలుగును'— అనునది సింగన 'భాగవత నిష్ఠ'-యన విశిష్టాద్వైత సంప్రదాయము నెఱింగి చేసిన పరిష్కారము.

మఱియు నీ ప్రసంగమునకు ముగింపు వాక్యముగ రాఁబోవు 'అజామిళో పాఖ్యానము'నకు నాంది వాక్యముగ-

> "అరయ నెన్నడు చేటు లేనట్టి ముక్తి
> వర్త్మ మీ లోకమందు నెవ్వనికిఁ గలదు
> సాధులును బుణ్యశీలురు సజ్జనులును
> హరిపరాయణ తత్పరులయినఁగాక !" (6-56)

అని శుకయోగి వివరించియున్నాఁడు. ఇట్లీ శుక పరీక్షిత్సంవాద రూపమగు పట్టమున ననేకములగు విశిష్టాద్వైత సమ్మతములగు సంప్రదాయములు నిక్షిప్తములై సింగన యనువాదము స్పష్టముగా నాతని విష్ణుప్రీతిని, విశిష్టాద్వైతానురక్తిని వెల్లడించు చున్నది. ఈ ప్రసంగమున

1) భరన్యాస పూర్వక శరణాగతి-

2) భాగవత సేవా ప్రాశస్త్యము—

3) ఎన్నడు చేటులేని ముక్తి వర్త్మము నారాయణ తత్పరత్వము చేతనే గలుగును.

4) వైష్ణవ జ్ఞానజనిత నిర్వాణ పదము శరణాగతి వలనను, భాగవత సేవా చరణము వలనను సిద్ధించును.

5) అట్లు సిద్ధించిన నిర్వాణ పదము సుస్థిరము,

అను భావము లీ సింగన యనువాదమునఁ జోటు చేసికొని యాతని యను వాదమునకు విశిష్టాద్వైత సౌరభమును సంతరించినవి.

2. అజామిళ చరిత్రమున నాలుఁగవపాద సమయమున నారాయణ స్మరణమును ఇతర వ్యాజమున నైనను జేయుటచే విష్ణుభటులు యమభటుల బారి నుండి యాతనిని విడిపించినారు. అప్పుడా యజామిళుఁడు వెనుకటి తన వర్తనమును దలఁచుకొని పశ్చాత్తప్తుఁడై యిట్లు భావించినట్లు మూలమున నున్నది-

"అన్యథా మ్రియమాణస్య నాశుచే ర్వృషలీపతేః।
వైకుంఠనామ గ్రహణం జిహ్వా వక్తు మిహార్హతి॥
క్వ చాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః।
క్వ చ నారాయణేత్యేత ద్భగవన్నామ మంగళమ్॥"[1]

ఈ మూల శ్లోకముల యను వాదమును సింగన యత్యంత జాగరూకతతో విశేష వైదగ్ధ్యముతోఁ గావించియున్నాఁడు. ఇందుకుఁ గారణము-"నైచ్యానుసంధానము"- అనునట్టి శ్రీ వైష్ణవ సంప్రదాయాంశము విస్తరింపఁబడి యుండుటయే. మూలమును మించి, మించునట్లుగా విశిష్టాద్వైత ప్రాగల్భ్యముతో సింగన చేసిన యనువాద పద్యములివి-

'పాతకుఁడ జడుఁడ బ్రహ్మఘాతకుఁ దను
మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకె నారాయణుని దివ్య
నామ విమల కీర్తనంబు మదిని (6-145)

"దారుణ మోహాంధకార పూరితుఁడను
హరి విస్మయ స్మరణార్హ మతినె
పంచ మహాతీవ్ర పాతకోపేతుఁడ
హరి విస్మయ స్మరణార్హ మతినె
కౌటిల్య కితవ వికార పారీణుండ
హరి విస్మయ స్మరణార్హ మతినె

---

1. శ్రీమద్భా 6-2-34, 35

**యఖిల దుఃఖైక ఘోరార్ణవ మగ్నుండ**
హరి విస్మయ స్వరణార్హ మతిని
నిందలకునెల్ల నెలవైన నిర్గుణుండ
మందభాగ్యుండ నేనేద మధువిదారి
దివ్యగుణ నామకీర్తన తెలియఁగనేద
పూర్వ సుకృతంబు నేనెట్లు పొందఁగలుగు (6-146)

ఈ యనువాదము మూలమునకుఁ గేవలానువాదము కాదు. మూల భావమును విప
రీతముగాఁ జెంపు చేసినట్లు స్పష్టముగా గుర్తింపఁగలము.

భగవద్రామానుజుల వారి పూర్వాచార్యులగు శ్రీ యామునాచార్యులవారు

అమర్యాదః క్షుద్రశ్చలమతి రసూయా ప్రసవ భూః
కృతఘ్నో దుర్మానీ స్మర పరవశో వంచన పరః।
నృశంసః పాపిష్ఠః కథ మహమితో దుఃఖ జలధే
రపారా దుత్తీర్ణ స్తవ పరిచరేయం చరణయోః॥"[1]

అని నైచ్యము ననుసంధానము చేసియుండిరి ఈ శ్లోకభావమిది- ("నేను మర్యాద
లేని వాఁడను. నీచ సేవాచపలుఁడను. అస్థిర చిత్తము కలవాడను. పరుల దోష
ములను ప్రకటించెడివాఁడను. ఉపకారుల కపకారము చేయు స్వభావము కలవాఁ
డను. అందరికంటె నధికుఁడనని తలఁచెడి వాఁడను. మన్మథ పరతంత్రుఁడను.
పాప బుద్ధి కలవాడను. ఇట్టి నే నీ దుఃఖసముద్రమైన సంసారమునుండి యుత్తీర్ణు
డనై నీపాదములకు సేవఁజేసెదను) ఇందు శ్రీ యామునాచార్యులవారు ప్రపన్న
జన లక్షణము వ్యక్తము చేసియున్నారు. ఇట్టి సంప్రదాయము నెఱిఁగిన సింగన
ప్రస్తుత ప్రసంగమున మూలాతిశాయిగ నిట్లు నిర్వహించి యున్నాఁడు. పశ్చాత్త
ప్తుఁడగు నజామిళుని యార్తినిఁ బ్రబంధించి యున్నారు.

ఇట్టి యనువాదమును సాగించిన సింగనకు విష్ణుభక్తి మెండనియు, విశిష్టా
ద్వైత సంప్రదాయము కరతలామలకమనియుఁ, గేవల సంప్రదాయ వేత్తృత్వమే
కాక తత్పరత్వము గలవాఁడనియుఁ జెప్పట వశ్య వస్మృతమగు మతము
కాగలదని నా ప్రత్యయము.

1. స్తోత్రరత్నము-62వ శ్లో

3. అజామిళుఁడు భాగీరథీ తీరమునఁ గళేబరమును విడచి తత్క్షణమే హరి పార్శ్వవర్తులై దాసవరుల స్వరూపము దాల్చి-" ఆ విష్ణుసేవకులతోడం గూడి దివ్యమణిఖచితంబై సువర్ణమయంబైన యపమాన విమానంబెక్కి నిఖిలానంద భోగభాగ్యానుభవా కుంఠితంబైన వైకుంఠనగరంబునకు శ్రీమన్నారాయణ పదార విందసేవా చరణ పరిణామ స్థితికింజనియె"- అని భగవన్నామ గ్రహణమున వదోక్యముక్తుఁ డైనట్లు సింగన యనువాదము తెలుపుచున్నది.

ఇందుకు మూలమున-

1. హిత్వా కళేబరం తీర్థే గంగాయాం దర్శనాదను।
సద్య స్స్వరూపం జగృహే భగవత్పార్శ్వవర్తినామ్॥

2. సాకం విహాయసా విప్రో మహాపురుష కింకరైః।
హైమం విమాన మారుహ్య యయౌ యత్ర శ్రియఃపతిః॥"[1]

ఈ మూలమునఁ జెప్పఁబడిన యంశములివి-

1. గంగా తీరమునఁ గళేబరము ను విడచుట-
2. వెంటనే భగవత్పార్శ్వవర్తులగు మహాపురుష కింకరుల రూపమును గైకొనుట
3. వారితో విమాన యానమున శ్రియఃపతి సన్నిధికి పోవుట

శ్రీధరుల వారి వ్యాఖ్య యీ విషయమునఁ బూర్తిగా మౌనము వహించినది. ఇది యస్పష్టముగా విశిష్టాద్వైతులు పేర్కొను ముక్తి విధానము. మూలమే విశిష్టాద్వైతాను కూలమై యుండగా సింగన మఱింత సంప్రదాయ స్ఫూర్తితో మోక్ష మార్గమును వివరించి యున్నాఁడు.

అందాతఁడు క్రొత్తగాఁ జేర్చిన యంశములివి—

1. హరిపార్శ్వవర్తులగు మహాపురుష కింకరులను దాసవరులనుట.
2. శ్రియఃపతి యుండుతావు వైకుంఠమని నిర్దేశించుట- మఱియు నది నిఖిలా నంద భోగభాగ్యానుభవా కుంఠితమని పేర్కొనుట.
3. శ్రియఃపతి యున్నతావునకు మారుగా- శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణ పరిణామ స్థితికిం జనినట్లు పేర్కొనుట.

---

1. శ్రీమద్భా 6-2-45,46 శ్లో

ఇందద్వైతా గోచరములగు విషయములివి-

1. హరి పార్శ్వవర్తుల స్వరూపము చాల్పుల
2. వైకుంఠగమనమే ముక్తియనుట
3. శ్రీమన్నారాయణ పాదసేవా నందమును బొందుటయే ముక్తి జీవులు పొందు ఫలమనుట

అజామిళుఁడు పొందిన మోక్షము—దాని స్వరూప స్వభావములు పరమార్థము లనియు- నజామిళుఁడు పొందిన ముక్తి పరమోత్కృష్టమనియు సింగన మనసా వాచా నమ్మినట్లే క్రింది పద్యము సాక్ష్యమిచ్చుచున్నది-

"కోరిన వారల కెల్లను
జేయవ కైవల్య పదము శ్రీ పతి మదిన్
గోరని వారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్ని త్రోవల నైనన్" (6–159)

ఈ పద్యమున సింగన పరమార్థ భూతముగాఁ బరమ పురుషార్థము - అని నమ్మియే పైనఁ బేర్కొనిన ముక్తి విధానమును విపరించినట్లు తెలియుచున్నది. అంతియగాని విష్ణుదాసులుగాని యమ కింకరులు కాని యముఁడు గాని యెవ్వరును "ఇది పరమార్థముకాదు. గౌణము. ఇందుకుమించిన మరొక స్థితికలదు. —అదియే పరమార్థము గాఁబొందఁదగినదను భావము నెంతమాత్రము వెల్లడించి యుండలేదు.

4. అజామిళోపాఖ్యానమున యమరాజు భటులతో విష్ణు భక్తులను గొని రావలదనియు, విష్ణుభక్తి విముఖులను బట్టి తెండనియుఁ బలుకుచున్న సందర్భమున సింగన కవితలో శ్రీవైష్ణవ పారవశ్యము విశేషముగా గోచరమగుచున్నది. భాగవతులెవ్వరు ? ఎట్టివారు ? అను విషయములను వివరించుచు మూలమున

"తే దేవగీత పరిగీత పవిత్రగాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః ।
తాన్ నోపసీదత హరేర్గదయాభిగుప్తాన్
నైషాం వయం న వయసః ప్రభవామ దండే"[1]

1. శ్రీమద్భా. 6 - 3 - 27.

దీని కనువాదముగా సింగన వ్రాసిన పద్యమిది—

"అత్యంత విశ్రాంత సత్యమ రమణీయ
భగవత్ప్రసంగకుల్ భాగవతులు
సనకాది ముని యోగి జన సదా నందైక
పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణ పదధ్యాన కేవలా మృతపాన
పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకావీక పటలప ప్రక్రియా
పటుషోగ్ర మూర్తులు భాగవతులు
భావ తత్త్వార్థ వేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
విరుల దవరంగ నెన్నడుఁ జేటులేని
పదవి నొప్పారు వారువో భాగవతులు" (6-186)

ఇట్లింతటి వైదగ్ధ్యముతో నీ భాగవత లక్షణములను వివరింపవలసిన యక్కఱ భాగవత ప్రియునికే కలుగుననుట నిక్కము. భాగవత వైశిష్ట్యతను పోతన సాహచర్యముతో సుసంస్కృతమైన సింగన యాంతర్యమీ కల్పన వలన ననల్పముగా వెల్లడి యగుచున్నది. భాగవతులనేగాక వారితోఁ జేరిన వారిని గూడ సింగన సన్నుతి చేసినాడు—

"పద్మనయను మీఁది భక్తియోగం బెల్ల
ముక్తి యోగమనుచు మొదల నెఱుంగు
వారి వారి వారి వారిఁ జేరిన వారి
త్రోవఁ దలఁప వలదు దూతలార !" (6-191)

ఈ భాగవత పరంపరా ప్రసంగము సింగన బుద్ధి సిద్ధమే. "విరుల దవరంగ నెన్నడుఁ జేటులేని పదవి నొప్పారు వారువో భాగవతులు" అనుటలో సింగన హృదయ మావిష్కృతమైనది. ఇది యమూలకము.

5 అమూలకముగా నవకాశము కల్పించుకొని శ్రద్ధతోఁ గావించిన శ్రీమన్నారాయణుని దివ్య మంగళ విగ్రహ వర్ణనము తిన్నెలకుఁ గట్టినట్లుగా నుండి సింగనకు గల విష్ణుప్రీతిని వెల్లడించు చున్నది.

"తన సేవకులలోనఁ దలఁచు భావంబు
శ్రీవత్స కౌస్తుభ శ్రీఁ దెలుప
నిజ దాక్షిణ్యముల తోడ నీడ్యుఁడు కన్నులు
కడలు దైవారెడు కరుణఁ దెలుప
నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ
గాఁపురం బుండెడు కమల దెలుప
మూఁడు మూర్తులకును మొదలైన తేజంబు
దానఁ బుట్టించిన తమ్మి దెలుప
బుద్ధిఁ దోఁపరాని పుణ్యంబుఁ దత్పాద
విమల జనితమైన గంగ దెలుప
నప్రమేయుఁ డనఘుఁ డవ్యక్తుఁ డవ్యయుఁ
డాది పురుషుఁ డఖిలమోది మెప్పె" (6–333)

సుందరమగు నీ దివ్య మంగళ విగ్రహ వర్ణనము నమూలకముగాఁ గావించుట దాని పారమార్థ్యమును విశ్వసించియే కావచ్చును.

6. ఆళ్వార్లు నారాయణ పరస్తోత్రములఁ దివ్యము చేసిన సందర్భమును మూలమున చేసుకొనగనే "నారాయణుఁడే పరబ్రహ్మము" — అను విషయమును సింగన ఈ క్రింది పద్యమున వివరించి యున్నాఁడు—

"బ్రహ్మేంద్రాదులు సంతసించి పరబ్రహ్మంబుఁ జింతించుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వికలపై బ్రహ్మణ్య మంత్రంబులన్
బ్రహ్మలోకము వాంఛతో నిలుపుచున్ బ్రహ్మాండభాండంబు మున్
బ్రహ్మజ్ఞాన గుణున్ హరిం దపమునం బాటించి రవ్వారలన్"
(6-244)

ఈ పద్యమున శ్రీహరియే పరబ్రహ్మమని స్పష్టముగా నిస్సందేహముగా సింగన నిశ్చయించి పలికినాఁడు.

అమూలకము కాని యట్టి విశిష్టాద్వైత సమ్మత నిర్వాహణము సింగనకు గల శ్రీవైష్ణవ పురస్కారమును స్ఫుటీకరించు చున్నది.

7. వృత్రుఁడు పూర్వ జన్మమునఁ జిత్రకేతుఁడు. అతఁడు శేషునితో సంభాషించు పిమ్మట నాతని వర్తనమును మూలమిట్లు వివరించునది—

"యతశ్చాంతర్హితో ఽనంతస్తస్యై కృత్వా దిశే నమః।
విద్యాధర శ్చిత్ర కేతుశ్చచార గగనే చరః॥[1]

2. సలక్షం వర్షలక్షాణాం అవ్యాహత బలేంద్రియః।
స్తూయమానో మహాయోగీ మునిభిః సిద్ధచారణైః॥

3. కులాచలేంద్ర ద్రోణీషు నానా సంకల్ప సిద్ధిషు।
రేమే విద్యాధర స్త్రీభి ర్గావయన్ హరి మీశ్వరమ్॥

4. ఏ కదా సవిమానేన విష్ణు దత్తేన భాస్వతా।
గిరిశం దదృశే గచ్ఛన్ పరీతం సిద్ధచారణైః॥[2]

ఇట్లు మూలమున "గావయన్ హరి మీశ్వరమ్". అని మాత్రమే యున్న భావమును గైకొని యమూలకముగాఁ బెంచి సింగన వ్రాసిన పద్యములివి—

1. "ఆడించున్ హరి దివ్యనాటక గుణ వ్యాపార నృత్యంబులం
బాడించున్ జలజాతనేత్ర విరుద ప్రఖ్యాత గీతంబులం
గూడించున్ సతతంబు జిహ్వల తుదిన్ గోవింద నామావళుల్
క్రీడం గిన్నర యక్షకామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై" (6-484)

2. వాసించు నాత్మలో వైష్ణవ జ్ఞానంబు
నాసించు భాగవతార్చనంబు
భాషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని
భాసించు హరికథా ప్రౌఢి మెరసి
ఘోషించు హరినామ గుణ నికాయంబులు
పోషించుఁ బరతత్త్వ బోధ మరసి
సేవించు శ్రీకృష్ణ సేవక నికరంబు
సుఖముఁ జేయు నీశునకు బలులు
పాడుఁ బాడించు వైకుంఠ భర్త పటన
రూపవర్తన గుణనామ దీపితోరు
గీతవాద్య ప్రబంధ సంగీత విధులఁ
గేశవ ప్రీతిగాఁ జిత్రకేతుఁడధిపుఁడు" (6-485)

---

1. శ్రీమద్భా 6-17-1.
2. శ్రీమద్భా 6-17-2, 3, 4శ్లో.

ఈ పద్యమున మన్న ప్రబంధ శబ్దము వైష్ణవ దివ్య ప్రబంధముల నుద్దేశించినదై యుండవోవును.

3) "హరిఁ గీర్తించుచు నల్ల నల్ల మదిలో నత్యాశ సేవించుచుం
బరమానందము నొందుచున్ జగములం బ్రఖ్యాతి వర్తించుచున్
సుక రాజో త్తమ మూర్తి యతిగణముల్ సొంపార విద్యాధరా
వ్సరవల్ గొల్వఁగఁ బాడగా సితగిరి ప్రాంతంబు నన్నేగుచున్"

(6-486)

ఈ పద్యమునఁ జిత్రకేతుని గురించి చేయఁబడిన వర్ణనము- ఒక శ్రీ వైష్ణవుని దినచర్యమ- దలపించుచున్నది.

సింగన కిట్టి యనూూంత వర్ణనమును జేయవలసిన యావశ్యకమేమి కలిగిన దని యోచించునెడ నాతఁడు తన యనువాద స్కంధా రంభమునఁ జేసిన పీఠికయందలి పద్యమును బరికింపవలసియుండును—

"శ్రీ వక్షాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్థ్సలు
శ్రీ విభ్రాజిత నీలవర్ణు శుభ రాజీవాక్షుఁ గంజాత భూ
దేవేంద్రాది సమస్త దేవమకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రి సరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్"

(6-1)

ఈ స్కంధారంభ ప్రథమ ప్రార్థనా పద్యమునందే యాతని శ్రీ కృష్ణ భక్తి వెల్లడి యగుచున్నది ఈ తఁడు గావించిన శ్రీమన్నారాయణ దివ్య విగ్రహ వర్ణనము లందు మూలమున లేని శ్రీదేవ్యాది సంప్రదాయాంశముల స్వీకారము పూర్వోదాహర ణము లందు వివరింపఁబడినది. ప్రస్తుత ప్రార్థనా పద్య మీతని కృష్ణ ప్రీతిని వ్యక్తము చేయుచున్న దనుకొంటిమిగదా. పైనఁగల చిత్రకేతు వర్ణనమందును "కృష్ణార్పిత స్వాంతుఁడు" "శ్రీకృష్ణ సేవక నికరము" అనునవి గుర్తింపఁదగినవి.

తన యనువాదమునకుఁ బ్రారంభమున నీతఁడు తనను గూర్చి "కృష్ణ పాదారవింద సందర్శనా దర్శనా దర్శితలాయమాన చిత్తుఁడను" అని చెప్పుకొని యున్నాఁడు. ఇట్టి కృష్ణార్పిత స్వాంతమే యాతనిచే మూలమున లేకున్నను వ్యయ ముగాఁ గల్పించి భాగవత ప్రవర్తనా రూపముగాఁ జిత్రకేతుని వృత్తాంతమును విశిష్టాద్వైత మార్గమున నిర్వహింపఁజేసినది.

శ్రీధరీయ వ్యాఖ్యనే సింగన కు.చ. తప్పకుండ ననుసరించినాఁడనుటకు, నీతఁడద్వైతియే యనుటకు నీ చిత్రకేతు వృత్తాంత మపవాదము.

# సింగన పరిష్కారణములు

## 2. శ్రీధర వ్యాఖ్యావిరుద్ధములు

1. షష్ఠ స్కంధమున అజామిళోపాఖ్యానమున యమ యమకింకరుల సంభాషణ క్రమము విశిష్టాద్వైత మార్గమున సాగినది. హరి కింకర పరాభూతులైన యమకింకరులు తమ ప్రభువుకడకు వెడలి 'నీవే కర్తవని ప్రభువవని నమ్మియుంటిమి. కొందఱు వచ్చి క్రూరుఁడగు అజామిళుని విడిపించుకొని పోయిరి. వారెవ్వరు ?' అని ప్రశ్నించినారు.

అందుకు యముఁడు 'పుండరీకాక్షుని చరణ కమలంబులు తన మానసంబున సన్నిహితంబులుగాఁ జేసికొని వందనం బాచరించి పరమభక్తి వరుఁడై' సమాధానము నొసఁగినాఁడు. ఆ సమాధానము విష్ణు పారమ్యము, విష్ణునామ సంకీర్తన వైశిష్ట్యము, శరీర శరీరి సంబంధముతో జీవేశ్వరులందలి యనుషంగములను ప్రవచించినాఁడు.

ఈ సందర్భమున నున్న మూలశ్లోకములివి—

1) పరో మదన్యో జగతస్తస్థుషశ్చ
ఓతం ప్రోతం పటవద్యత్ర విశ్వమ్।
యదంశతో౽స్య స్థితి జన్మనాశా
నస్యోతవద్యస్య వశే చ లోకః॥[1]

2) యో నామభిర్వాచి జనాన్నిజాయాం
బధ్నాతి తంత్ర్యామివ దామభిర్గాః।
యస్మై బలిం త ఇమే నామ కర్మ
నిబంధ బద్ధాశ్చకితా వహంతి॥[2]

---

1. శ్రీమద్భా 6-3-12
2) శ్రీమద్భా 6-3-13.

దీనికి సింగన కావించిన యనువాదమిది—

"తలఁడు సదస్యుండు ఘనుఁడొక్కఁడతఁడెందు
వెదకిఁ గావఁగ రాక విశ్వమెల్ల
నతిలీలమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి
నుండును లోక మూఢున్న తఁగి
దామెనఁ బశువుల దగిలియుండెడి మూర్ఖ
నామ సంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసిత మత్ప్రాణ
లెవ్వని పదముల నిప్పటిల్లఁ
గనుట, మనుట చనుట గల్గు నెవ్వని లీల
లందు లోక మెవనియందుఁ బొందు
నెన్నఁ బరుచుఁ బరమి నెవ్వని నామముల్
గర్మబంధనములఁ దేర్మి వదలు" (6-169)

మూలశ్లోకములలో నీయనువాద పద్యమున గల "విలసిత మత్ప్రాణ లెవ్వని పద ములఁ బిప్పటిల్లి" అను వాక్యమునకు నాధారము లేదు, మఱియు రెండవశ్లోకమున నున్న "యస్మై బలిం త ఇమే నామకర్మ నిబంధ బద్ధాశ్చకితా వహంతి" అనుదానికి "ఎవని నామముల్ గర్మబంధములఁ దేర్మి వదలు"- అనునది హరినామ కీర్తన మహత్త్వమును బ్రకటింపఁదలఁచిన సింగన, కొందఱు భావించినట్లు శ్రీ శ్రీధరా చార్యుల వారి వ్యాఖ్యను స్వీకరింపక స్వీయాభిరుచి కనుకూలముగాఁ జేసినట్లు స్పష్ట పరచుచున్నది— శ్రీధరీయ వ్యాఖ్య యీ సందర్భమున నిట్లున్నది—

"య ఇతి. బ్రాహ్మణాది నామభిః వాగ్రూపాయాం నిజాయాం తంత్యాం దామన్యాం. జనం యో బధ్నాతి దామ్ని గావః బలీవర్దా ఇవ త ఇమే జీవాః. నామ కర్మభిర్నిబంధైః బంధన సాధనైః బద్ధాశ్చకితాః యస్మై బలిం వహంతి యదధీనాః కర్మ కుర్వంతీత్యర్థః"[1]

ఈ శ్రీధరీయ వ్యాఖ్యావాక్యములలో నామ కర్మములను బంధన సాధనము లచే బద్ధులైయుండియు జీవులు భగవంతుని కొఱకు బలిసమర్పించుచున్నారని—అనగా

1. శ్రీధరీయవ్యాఖ్య-6-3-13

భగవదధీనులై కర్మము చేయుచున్నారని వివరింపఁబడగాఁ దద్విరుద్ధముగా శ్రీ మన్నారాయణుని నామములు కర్మబంధములను చేర్పితో నణఁచునని సింగన యనువాద పాదమున నిశ్చయింపఁబడినది.

2. "అన్యేచ యే విశ్వసృజః ప్రజేశా
భృగ్వాదయో – స్పృష్ట రజస్తమస్కాః।
యస్యేహితం నవిదుః స్పృష్టమాయా
స్సత్వ ప్రధానా అపి కిం తతోఽన్యే ॥"[1]

ఈ మూలశ్లోక భావమిది - 'మహేశ్వరాదులు – అస్పృష్టరజస్తమస్కులైయుం డియు భగవన్మాయా స్పృష్టులై భగవదభిప్రాయమును గ్రహింపఁజాలరు."

దీనికి శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యయిట్లున్నది :
"అన్య ఇతి. న స్పృష్టం రజస్తమశ్చయైః ఈహితం అభిప్రాయం చేష్టితం వా న విదుః స్పృష్టమాయాః మాయయా స్పృష్టాః తతస్తేభ్యోఽన్యే న విదురితి కిం పునర్వక్తవ్యమ్."[2]

ఇట్లు మూల వ్యాఖ్యానములందు భయత్ర "తదీహితమ్" అనగా నా 'శ్రీహరి యభిప్రాయమును' – అని యుండగఁ దదభిప్రాయమునకు విరుద్ధముగా సింగన యనువాద మిట్లుసాగినది.

"సత్త్వేతర గుణ పాశ వ
శత్త్వంబునఁ బొంద పేరు జలజాక్ష నదై
కత్త్వంబు గాన వోవరు
సత్త్వప్రాధాన్య లితరజనముల తరమే (6-171)

ఈ సింగన యనువాద ప్రసంగమునందు మహేశ్వరునితో గూడ బ్రహ్మాది దేవత లందఱు శ్రీహరియొక్క తత్త్వమును గనుగొనఁ జాలరని పేర్కొనఁ బడినది. పోతే మూల శ్రీధరీయములలో "అస్పృష్టరజస్తమస్కాః"—అని యుండగా

1. శ్రీమద్భా 6 - 3 – 15
2. శ్రీధరీయ వ్యాఖ్య 6 - 3 - 15

"విశ్వేతరపారతంత్ర్యంబును బొందినట్లు సింగన చెప్పినాఁడు. "ఈహితమ్" అను దానికి "అభిప్రాయము" అని యర్థము చెప్పఁబడగాఁ దద్విరుద్ధముగా "జలజాక్షు వరైక తత్త్వంబుఁగాన నోపరు"—అని శ్రీమన్నారాయణ పరబ్రహ్మము యొక్క యేకత్వమును బ్రతిష్ఠించి యున్నాఁడు.

శ్రీ విష్ణుపారమ్యమును బ్రకటించువట్ల మహేశ్వరుని విముఖుండుటయు- అమూలకముగా వైర మీ విషయమును నిబంధించుటయు-భాగవతానువాదకులందఱకు సామాన్య లక్షణము. ఈ ప్రస్తుత పద్యమున కనంతరము 177 వ పద్యమున స్పష్టముగా శ్లోకములోని "ఈహితమ్" అనుదానినిఁ గైకొని కాఁబోలు సింగన యిట్లు వివరించి యున్నాఁడు —

"ఎన్నఁడు తెలియఁగ నేరరు
పన్నగ పతిశాయి తత్త్వ భావముమేనం
గన్నులు వేల్పును, దావలఁ
జన్నమరిన వేల్పు ముదుక చదువుల వేల్పున్" (6-177)

ఇందు నింద్రుఁడు, శంభుఁడు, బ్రహ్మయు శ్రీమన్నారాయణ తత్త్వమును గ్రహింప జాలరని వివరించినాఁడు, విష్ణుప్రీతియు, విశిష్టాద్వైతాను రక్తియు విస్పష్టముగాఁ గల సింగనార్యుఁడు.

3. అజామిళోపాఖ్యానమున యమరాజు తన భటులతో విష్ణు వైశిష్ట్యమును వివరించు పట్టున మూలమున —

"యం వై న గోభిర్మనసా సుభిర్వా
హృదా గిరా వా సుభృతో విచక్షతే ।
ఆత్మాన మంతర్హృది సంతమాత్మనాం
చక్షుర్య థైవాకృతయ స్తతః పరమ్॥"[1]

ఈ శ్లోకమునకు శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్య యిట్లున్నది-"యమితి. యం గోభిః ఇంద్రియైః హృదా చిత్తేన నవిచక్షతే న పశ్యంతి । శ్రు। "యద్వాదా నభ్యుదితం యన్మనో నమనుతే-" ఇతి శ్రుతేః। ఆత్మానం జీవానాం ఆత్మానం ద్రష్టారం ఆకృతయో రూపాణి చక్షుర్యథా కర్మభూతం న జానంతి. తతః పరమాకృతీనాం

1. శ్రీమద్భా 6-3-16

ప్రకాశం న హి ప్రమాతా ప్రమాణస్య విషయ ఇతి భావః । ఏవం భూతః పరమే
శ్వరో మదనో೭స్తీతి పూర్వేణైవ సంబంధః"[1]

ఈ సందర్భమున సింగనార్యుని యనువాదమిట్లున్నది —

"అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో
నుభయమునై వెలుంగు పురుషోత్తము గానరు చిత్ర కర్మ వా
గ్విభవ గరిష్ఠులై వెదకి పిటిడి ప్రాణులు సర్వవస్తువుల్
శుభగతిఁ జూడనేర్చి తమఁజూడగ నేరని కంటిపోలికన్" (6-172)

ఈ తెలుఁగు పద్యమునందున్న "పూని మేనిలో"—"ఉభయమునై వెలుంగు పురుషోత్తముఁగానరు" అనుటకు మూలము లేదు. ఇది సింగన చేసిన కల్పనము. తాను దేహమునందుఁ బూని యుండియు నట్లు తనయందున్న పురుషోత్తముని పిటిది ప్రాణులు చిత్రకర్మ వాగ్విభవ వరిష్ఠులై యుండియు వెదకి కూడ కనుఁగొనఁజాలరు. అందుకు దృష్టాంతము బయటి వస్తువులను సమస్తమును జూడఁ గలిగియుండినను మాత్రము చూచుకొనలేని కన్నువలె తాను శ్రీహరి దేహమైయుండి తనలో నాత్మగా శ్రీహరి యుండుటచే నాతనితో నపృథక్సిద్ధముగాఁ దానుండియు జీవుఁడు బయట మాత్రమే వెదకి జీవులు శ్రీహరినిఁ జూడ జాలరు కన్ను. తన్నుఁ దాను జూచుకొనలేనట్లు తనలో నాత్మరూపమున నిర్చియున్న శ్రీమన్నారాయణునిఁ జూడలేదు. అనగా స్వస్వరూపాను భూతినిఁ బొందఁజాలకుందురని సింగన నివరించి యున్నాఁడు. ఈ యనువాదము విశిష్టాద్వైతైక గోచరము.

తదనంతరము యమరాజు "పరమమహాద్భుతమైన వైష్ణవ జ్ఞానంబుఁ" దెలియ నేర్చిన వారినిఁ బన్నిద్దఱను పేర్కొని (6-178) ఇట్టి "ఉపనిషదుదిత శ్రీపతి నామ మహాద్భుత దీపిత భాగవత ధర్మ దివ్యక్రమమున్" ఇతరు లెవ్వరు నెఱుఁగరని నిశ్చయ వాక్యమును బలికియున్నాఁడు అంతటితో నాగక —

"ఏది జపియింప నమృతమై మెఱయుచుండు
నేది సద్ధర్మ పథమని యెఱుఁగఁ దగిన
దదియె సద్భక్తి యోగంబు నావహించు
మూర్తి మంతంబు"— (6-180)

అని శ్రీహరి కీర్తనమును గీర్తించియున్నాఁడు.

---

1. శ్రీధరీయ వ్యాఖ్య 6-3-16

# నారయ పరిష్కరణములు

## 1. అపూర్వకములు

ఏకాదశ స్కంధమున విశిష్టాద్వైత సౌరభము గుబాళించునట్లు నారయ పరిష్కరించిన ఘట్టములలో శ్రీకృష్ణుని దగ్గరకు విశ్వామిత్రాది మునీశ్వరులు వచ్చుట యొకటి.

ఈ స్కంధ ప్రారంభమున మూలమున( పరమేశ్వరుడగు శ్రీకృష్ణుడు యాదవుల నాశనమును గూర్చి యాలోచించుచుండగా నాతని సంకల్పముచే విశ్వామిత్రాది ఋషులు ద్వారకానగర సమీపమున గల 'పిండారకము' అను తీర్థమునకు( చేరినారు. యదు కుమారులు సాంబుని కామవేషము వైచి యా ఋషుల యొద్దకు( గొని పోయిరి. తదనంతరము ముసల వృత్తాంతము ప్రసక్తమైనది.

అనువాదమున నారయ చేతిలో నీ ఘట్టము మార్పు నొందినది.

శ్రీ కృష్ణుడు యాదవ సంహారమును గూర్చి యోచించు చుండగా విశ్వామిత్రాది ఋషులు స్వేచ్ఛా విహారమున ద్వారకకు వచ్చి శ్రీ కృష్ణుని దర్శింప నాతనిచే

నాదరింపఁబడి యాతనిని స్తుతించినారు. శ్రీకృష్ణుఁడు వారి స్తుతులకు సంతోషించి వారి యాగమన కారణమడిగినాఁడు. వారు 'నీ దర్శనము కంటె మిక్కిలి విశేషమేమి కలదు' అని చెప్పి యనిచ్చా విహారులై ద్వారక కనతి దూరమున గల పిండారకము నకు వెడలిపోయిరి. అటు పిమ్మట మునుల వృత్తాంతము వర్ణింపఁబడినది.

నారయ యిట్లు మూలమున నున్న కథాంశమును మార్పుచేసి యక్కడఁ జేసిన విశిష్టాద్వైతాను కూలమగు పరిష్కరణము లివి —

విశ్వామిత్రాదులు శ్రీకృష్ణుని దర్శించినారని చెప్పుచు నాతని దివ్య మంగళ విగ్రహమును విపులతర వర్ణించియున్నాఁడు. ఇట్టి యీ యమూలక కల్పనము విష్ణు ప్రీతి సూచకము. నారయ యి ట్ల మూలకముగా శ్రీకృష్ణుని వర్ణించిన పద్యమిది —

"ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణుఁ
గర్ణకుండల యుగ్మ ఘనకపోలుఁ
బుండరీకాక్షు నంభోధరశ్యామునిఁ
గలిత నానారత్న ఘన కిరీటు
నాజాను బాహు నిరర్గళాయుధ హస్తు
శ్రీకర పీత కౌశేయ వాసు
రుక్మిణీ నయన సరోజ దివాకరు
బ్రహ్మాది సుర సేవ్య పాదపద్ము
దుష్ట నిగ్రహ శిష్టసంతోష కరణుఁ
గోటిమన్మథ లావణ్య కోమలాంగు
నార్తజన రక్షణైక విఖ్యాత చరితుఁ
గనిరి కరుణా సముద్రుని ఘనులు మునులు" (11-12)

తమ కర్ఘ్యపాద్యము లిచ్చి సత్కరించిన శ్రీకృష్ణుని మునులు స్తుతించినట్లు నారయ వ్రాసిన పద్యముల మూలకములు శ్రీమన్నారాయణ తత్త్వ ప్రతి పాదకములు.

1) "జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబులగుచుఁ దిరుగుచునుండుం
దనువులు నిలకడగావఁట
వనములలో మున్నవైన వనరుహనాథా" (11-14)

ఈ పద్యమున విష్ణుసేవా ప్రాగల్భ్య ముగ్గడింపఁబడినది.

2) "శరణంబులు భవజలధికి
హరణంబులు దురిత లతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు
శరణంబులు నీదు దివ్యచరణంబులిలన్" (11-15)

ఈ పద్యమున దివ్యశ్రీచరణముల యందుఁ జేయఁబడిన శరణాగతి పేర్కొనఁబడినది.

3) "ఒక్క పేరను సూక్ష్మరూపము నొందు దీ వణు మాత్రమై
యొక్క పేరను స్థూలరూపము నొందు దంతయు నీవయై
పెక్కు రూపులు దాల్తు నీదగు పెంపు మాకు నుతింపగా
నక్కజం బగుచున్న దేమన సంబుజాక్ష ! రమాపతీ !" (11-16)

ఈ పద్యమున జగత్తు సత్యమనియు విష్ణువుతో నది యపృథక్సిద్ధమైన దనియుఁ జెప్పు విశిష్టాద్వైతుల సిద్ధాంతము సమర్థింపఁబడినది.

భగవద్రామానుజులు —

"నామ రూప విభాగానర్హ సూక్ష్మదశాపన్న ప్రకృతి పురుష శరీరం బ్రహ్మ కారణావస్థమ్। జగతః తదాపత్తిరేవ ప్రళయః। నామ రూప విభాగ స్థూలం చిద చిద్వస్తు శరీరం బ్రహ్మ కార్యావస్థమ్। బ్రహ్మణః తథా విధ స్థూల భావ ఏవసృష్టి రిత్యుచ్యతే।"[1] అని పేర్కొనియున్నారు. దీని భావమిది —

నామ రూప విభాగమునకు వీలుగాని సూక్ష్మదశను జెందినట్టియుఁ బ్రకృతియుఁ బురుషుఁడును శరీరముగాఁ గలిగినట్టి బ్రహ్మము కారణము. అట్టి స్థితియే జగత్తునకుఁ బ్రళయము. నామరూప విభాగమును బొందిన స్థూల చిదచిద్వస్తువులు శరీరముగాఁగల బ్రహ్మము కార్యము. ఇట్టి స్థితియే సృష్టి.

ఈ విధముగఁ దమ సిద్ధాంతమున సృష్టి ప్రళయముల స్వరూపమును రామానుజ భగవానులు పేర్కొని యున్నారు. ఆ వివరణమే నారయ విరచించిన స్వతంత్రమగు నీ పద్యమునకు ప్రేరణము. 'అంతయు నీవయై పెక్కు రూపులు దాల్తువు'. అనుటచేఁ జిదచిత్తులకు బ్రహ్మముతో నపృథక్సిద్ధత్వము చెప్పఁబడినది.

1. వేదార్థ సంగ్రహః

విశిష్టాద్వైతుల 'పేర్కొను 'పరిణామోపాదనము' నారయ శతకమునందు వివరింపఁ బడినది.

మఱియు 'ఒక్కటియే యైయుండి బహువిధములుగా నగుదునని బ్రహ్మము సంకల్పించినట్లు వర్ణించు శ్రుతి నీ పద్యమునఁగల "పెక్కు రూపుల దాల్తువు" — అను వాక్యమున ననువదింపఁబడినది. ఇట్లు బహురూపములుగా నగుదునని సంకల్పించిన బ్రహ్మమే శ్రీకృష్ణుఁడని యీ పద్యము చెప్పినట్లైనది.

"నీదగు పెంపు మాకు నుతింపగా నశక్యంబగు చున్నది" అనునది "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను శ్రుతివాక్యమును వివరించు చున్నది.

మఱియు నీ పద్యమున గల "అంబుజాక్ష" యనునది శ్రీమన్నారాయణు నకు మాత్రమే వర్తించు విలక్షణమగు సంబోధనము. అట్లే "రమాపతీ" యను సంబోధనము నైతము శ్రీదేవి సహిత నారాయణ దివ్యతత్త్వమును విశదీకరించు చున్నది.

4) "శ్రీనాయక నీ నామము
నానాభవరోగ కర్మ నాశమునకు వి
న్నాణంబగు నౌషధ మిది
కానరు దుష్టాత్ము లకట కంజదళాక్ష !" (11.17)

ఈ పద్యము శ్రీమన్నారాయణుని నామ మహాత్మ్యమును శ్రియః పతిత్వమును వర్ణించు చున్నది. ఇందు "శ్రీనాయక" యనునది సాభిప్రాయమైనది. అట్లే "అంబుజాక్ష" అనునది సార్థకమైనది.

ఇట్లే షష్ఠమున నారయ యమకాలంకముగా రచించిన నాలుగు పద్యములు విశిష్టాద్వైత సంప్రదాయమున కనుగుణముగా నుండుటచే నారయ తత్సంప్రదాయము పట్ల ప్రత్యేకాభినివేశము కలవాఁడని చెప్పవొప్పును. అమూలకముగాఁ గల్పింపఁ బడుటయు, నందు కొన్ని తత్త్వాంశములుండుటయు నిట్లూహించుటకు హేతువులు.

2. ఉద్ధవుఁడనేక వేదాంత విషయములను శ్రీకృష్ణునడిగి తెలిసికొనుచు వర్ణాశ్రమ ధర్మములను నిర్ణయించి తెలుపుమని ప్రశ్నింపగా శ్రీకృష్ణుఁడా విశేషముల నెఱిఁగించిన పిమ్మట "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అను

నుపనిషత్తుల్యంబగు గీతావచన ప్రకారంబున నెవ్వండేని నాయందు మతి గలిగి వర్తించువాండు నేనని పలుకంబడు. పెక్కుతంగుల వాదంబులేలయని యెందును దగులుపడక నామీంద దలంపుగలిగి వర్తింపుము" (11-107)

అని వివరించినట్లు నారయ యనువదించి యున్నాండు. ఇది స్వేచ్ఛాను వాదము- "సర్వధర్మాన్ పరిత్యజ్య" - ఇత్యాది శ్లోకపాద ప్రసంగము మూలమున లేదు. భగవద్గీతా ప్రస్తావము మాత్ర మీ యుద్ధవగీతలో నొకచోట ప్రసక్తమైనది. కాని వర్ణాశ్రమ ధర్మములను గుఱించి ప్రశ్నించిన ప్రస్తుత సందర్భము నందీ గీతా వచన ప్రకారము ప్రస్తావింపం బడలేదు. ఇది స్పష్టముగా నారయ కూర్చినదే. మఱియు భగవద్గీతయందలి సర్వధర్మానిత్యాది శ్లోకముపనిషత్తుల్యమని నారయ వివరణము. ఇది నారయకు గల విశిష్టాద్వైత ప్రావీణ్యమునకుం దార్కాణ.

ఇందలి విశిష్టాద్వైత ప్రాముఖ్యమేమనగా భగవద్గీతలోని సర్వధర్మానిత్యాది శ్లోకమునకు "చరమ శ్లోక"మని శ్రీవైష్ణవ వ్యవహారము దీనిని విశిష్టాద్వైతులు మంత్ర త్రయములో నొకటిగా సన్మానింతురు ఈ సంప్రదాయమున తిరుమంత్రము, ద్వయమంత్రము, చరమశ్లోకము- అను నీ మూడును మంత్రములుగా వ్యవహారము. చరమశ్లోకమనగా భగవద్గీతలోం జివరి శ్లోకమనికాని, కృష్ణుని వాక్యములలోం జివరి శ్లోకమనిగాని యర్థము కాదు. మఱి యప్పటివరకుం జెప్పంబడిన కర్మజ్ఞాన భక్తి యోగముల తరువాత చివరి యుపాయముగా 'శరణాగతి' యనంబడు ప్రపత్తిని గూర్చి చెప్పంబడిన శ్లోకమని శ్రీవైష్ణవాచార్యులు వివరింతురు. ఈ చరమ శ్లోకము నకుం బ్రాతస్స్మరణీయులగు పలువురు పూర్వాచార్యులు వివరణములు వ్రాసి విశిష్టాద్వైత సంప్రదాయమున దీనిని పరమ ప్రకృష్టాంశముగాం బరిగణించు చున్నారు.

అట్టి యీ చరమశ్లోక ప్రస్తారమును నారయ మూలమున లేకున్నను స్వీయముగాం గొనివచ్చుటయేగాక యిది యుపనిషత్తుల్యమనియుం దెల్పుటకు పరమాశ్చర్యమును గలిగించు విషయము.

ఇందువలన నారయ విశిష్టాద్వైత ప్రియత్వమును, తత్సిద్ధాంత ప్రాగల్భ్యమును వెల్లడియగుచున్నవి.

3. ద్వాదశ స్కంధాంతమున సూతుండు దైవప్రార్థనతోం దన కథనమును ముగించి యున్నాండు. ఈ పద్యము మొత్తము భాగవతమునకుం బ్రతిపాదింపంబడిన

తత్త్వమును సూక్ష్మముగా వెల్లడించునదై భాగవతాంతమునందు సందర్భమునఁ బోతనా మాత్యుఁ డనుసరించిన ప్రణాళిక ననుసరించి భాగవత తాత్పర్యమును విశదీకరించు చున్నది. ఆపద్యమిది —

"సకల గుణాధీశు సర్వజ్ఞు సర్వేశు
నఖిల లోకాధారు నాదిదేవు
పరమదయా రసోద్భాసితుఁ ద్రిదశాధి
వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రిత మందారు నాద్యంత శూన్యుని
వేదాంత వేద్యుని విశ్వమయునిఁ
గౌస్తుభ శ్రీవత్స కమనీయ వక్షుని
శంఖచక్రగదాసి శార్ఙ్గధరుని
శోభనాకారుఁ బీతాంబరాభిరాము
రత్నరాజిత మకుట విభ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయ పుణ్యదేహుఁ
దలఁతు నుతియింతు దేవకీ తనయు నెపుడు" (12-50)

ఈ పద్యమునఁగల - తలఁతును, నుతింతును అను క్రియలు రెండును భక్తియోగమును సూచించుచున్నవి. స్మరణము - కీర్తనము - అను వాని కవి లక్షణములివి.

పోతనామాత్యుఁడు "శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అని గ్రంథారంభము గావించినాఁడు. ఇట్లు పోతన వారయలలో గ్రంథాద్యంతములందు భక్తియోగ ప్రాముఖ్య వివరణమే గోచరించుచున్నది. ఇద్దరి వాక్యములలో భక్తియోగమే పరమ పురుషార్థ సాధనముగా నెంచఁబడినది. ఇరువురును శ్రీకృష్ణునే పరమాత్మగా విశ్లేషించుట జరిగినది. వారయ సర్వేశ్వరత్వము, నఖిలలోకాధారత్వము, నాద్యంత శూన్యత్వము వేదాంత వేద్యత్వము, విశ్వమయత్వము, సర్వజ్ఞత్వము—అను పరబ్రహ్మ లక్షణములను శ్రీకృష్ణునిలో దర్శించినాఁడు.

సకల గుణాధీశుఁడు— అనుటచేఁ బ్రాకృత హేయగుణ రాహిత్యమును, నాశ్రితమందారుఁడు, పరమదయోద్భాసితుఁడు అనుటచేఁ గల్యాణ గుణ భరితత్వమును చెప్పినాఁడు. శోభనాకారుఁడు, మహనీయ పుణ్యదేహుఁడు, పుండరీకాక్షుఁడు— అను సమానములచే దివ్య మంగళ విగ్రహమును వివరించినాఁడు.

కౌస్తుభ శ్రీవత్స కమనీయ వక్షుఁడు, శంఖచక్ర గదాసి శార్ఙ్గధరుఁడు, పీతాంబరుఁడు, రత్నరాజిత మకుట విభ్రాజమానుఁడు — అని సన్నుతించుటచే దివ్యాలంకారములు, దివ్యాయుధములు పేర్కొనఁబడినవి.

ఇట్లు విశిష్టాద్వైత సిద్ధాంతమునఁ బ్రసిద్ధమైన శ్రీమన్నారాయణ పర బ్రహ్మముయొక్క స్వరూప మీ పద్యమున నుల్లేఖింపఁబడినది. అట్టి తత్త్వమును స్మరింతుననియుఁ, గీర్తింతుననియు నారయ పేర్కొనుటచే ధ్యానాను వర్తన రూప భక్తియోగ స్వీకారము వెల్లడింపఁబడినది.

ఇది పోతన యేర్పరచిన మార్గమే. ఆతఁడును "చింతించెదన్" అనుటచే భక్తియోగము నుపాయముగాఁ జెప్పినాఁడు. లోకరక్షణము, భక్త పాలనము-సృష్టి కర్తృత్వము మున్నగు లక్షణములు గల్గి కృష్ణావతారము నెత్తిన పరబ్రహ్మ మగు శ్రీమన్నారాయణుఁడే గ్రంథారంభమున 'శ్రీకైవల్య పదంబు జేరుటకునై'— ఇత్యాది పద్యమున వర్ణింపఁ బడినాఁడు. ఇదియే నారయ కాదర్శమైనది. కావుననే యాంధ్ర భాగవతమున నుపక్రమోప సంహారములకుఁ జక్కని సమన్వయము కుదిరి యొకే యొరవడిలో - భక్తి వరవడిలో - భక్తజనుల యెదఁదలలో సంత సపు సందడిని సందడింపఁ జేసినది.

# నారయ పరిష్కారములు

## శ్రీధర వ్యాఖ్యావిరుద్ధములు

1. ద్వాదశ స్కంధమున మూడవ యధ్యాయమునఁ బరీక్షిత్తునకు శుకయోగి మమత్వము మిథ్య కావున దానినిఁ ద్యజింప వలయునని చెప్పు సందర్భమున మూలమున నిట్లున్నది —

"యస్తూత్తమశ్లోక గుణానువాద
స్సంస్తూయతే - భీక్ష్ణ మమంగళఘ్నః[1]
తమేవ నిత్యం శృణుయా దభీక్ష్ణం
కృష్ణే - మలాం భక్తి మభీప్సమానః[1]

దీనికి శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యాన మిట్లు క్లుప్తముగా నున్నది.

"కిన్తర్హి పురుషాణా ముపాదేయః పరమార్థ స్తమాహ --
య ఇతి. నిత్యం ప్రత్యహం. తత్రా ప్యభీక్ష్ణమ్"[2]

అని మాత్రమే కలదు. నారయ యీ శ్లోకము నిట్లనువదించినాఁడు :

"ఉత్తమ శ్లోకుఁడన నెవ్వఁ డున్నవాఁడు
సన్నుతుండగు నెవ్వఁడు సకల దిశల
నట్టి పరమేశ్వరునిఁ జిత్తమందు నిలిపి
తద్గుణంబులు వర్ణింపు ధరణినాథ" (12—19)

ఇది మూలశ్లోకమున కనువాదము. ఈ యనువాద పద్యమునకు ముందు పోద్ఘాత ప్రాయముగా నిట్లు పేర్కొనినాఁడు.

"జనార్దన వైకుంఠ వాసుదేవ నృసింహయని నిరంతర హరికథామృత పానంబు సేసి జరారోగ వికృతులం బాసి హరి పదంబు నొందుము" (12—18) అని శుకయోగి పరీక్షితున కుపదేశించినట్లు నారయ కల్పించినాఁడు.

---

1. శ్రీమద్భా 12 - 3 - 15
2 శ్రీధరీయ వ్యాఖ్య 12 - 3 - 15.

ఇది మూలమునకు మించి విశిష్టాద్వైతానుకూలముగా జేయఁబడిన నారయ వ్యాఖ్యానము. శ్రీకృష్ణుని యందు నిర్మలమగు భక్తినిఁ గోరువాఁడు తద్గుణ శ్రవణము నిరంతరము చేయవలయునని మూల శ్లోకభావము. మఱియు శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్య సారాంశము. ఈ భావము ననువదించుటకుఁ బూర్వము జనార్దన వైకుంఠ వాసుదేవ నృసింహ యని నిరంతరము హరి కథామృతము పానము చేయ వలయుననియు నవి యిహ పర సాధక మనియు నారయ శ్రీధర వ్యాఖ్యలో సంబంధము లేకుండ స్వతంత్రముగా వివరించినాఁడు. హరి కథలు హరి పదమును జేర్చు సాధనములని వివరించుటచే భక్తియోగమే ముక్తికి హేతువని చెప్పినట్లగుటయే గాక శ్రీమన్నారాయణ సాన్నిధ్యమే ముక్తి స్థానమని వివరించినట్లైనది.

ఈ నిర్వహణమును బరికించినచో నారయ పోతన గంగన సింగనలవలెఁ గేవలము శు. చ. తప్పకుండా శ్రీ శ్రీధరాచార్యుల వారి యనువాదమును మాత్రమే యనుసరించినాఁడనుట పరికాదనియుఁ, దత్త్వాంశ వివరణ సందర్భములందు విశిష్టాద్వైత మత సంబంధములగు కొన్ని పరిష్కరణములు గావించెననియుఁ జెప్పఁ దగియున్నది.

2. ద్వాదశ స్కంధమున శుకయోగి పరీక్షిత్తు నోదార్చు సందర్భమున మూలమున నిట్లున్నది-

1) "త్వంతు రాజన్ మరిష్యేతి పశుబుద్ధి మిమాం జహి।
న జాతః ప్రాగ భూతో౽ద్య దేహవత్త్వం న నఙ్క్ష్యసి॥

2) న భవిష్యసి భూత్వాత్వం పుత్రపౌత్రాది రూపవాన్।
బీజాంకుర వద్దేహాదేర్వ్యతి రిక్తో యథా నలః॥" [1]

మూల మిట్లుండగా నారయ యనువాద మిట్లు సాగినది—

"ఏను మృతుండ నౌదు నని యింత భయంబు మనంబు లోపలన్
మానుము సంభవంబుగల మానవకోట్లకుఁ జావు నిత్యమౌ
గాన హరింపలంపుమిఁకఁ గల్గును జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్"

(12 - 25)

1. శ్రీమద్భా 12 స్కం - 5అ - 2, 3శ్లో.

ఈ యాంధ్రానువాద పద్యమున హరినామధ్యానమును నారయ యుచితముగాఁ చేర్చినాఁడు. మఱియా హరిధ్యానముచే మాధవ లోక నివాస సౌఖ్యములు కలుగు సన్నిధి కూడ నారయ సృష్టియే.

మాధవలోక నివాస సౌఖ్యములని నిర్దేశించుటచే నిది శాశ్వత వైకుంఠలోక ప్రాప్తిఁజెప్పు విశిష్టాద్వైత ముక్తిని గుఱించిన ప్రసంగమని బోధపడుచున్నది. విశిష్టాద్వైతులు వివరించునట్టి శాశ్వతము-పునరావృత్తి రహితము-సాయుజ్య రూపమును నగు మోక్షమే యిందు వివక్షింపఁబడినట్లు—

“కల్గదు జన్మము పీప ధాత్రిపై” — అను వాక్యము సాక్ష్యమిచ్చెడిని. “మాధవ లోకము” - అనుటలో లక్ష్మీవిశిష్టుఁడగు శ్రీమన్నారాయణుఁడు పేర్కొనఁబడి నాఁడు. ఇందు విశేషమేమనగా విశిష్టాద్వైత సంప్రదాయ వేత్తలు—కారుణ్యరూపిణి యగు లక్ష్మీదేవితో గూడియే నారాయణుఁడు సర్వరక్షకుఁడుగా సర్వసిద్ధాంతములందును వేదాంతములందును గీర్తింపఁబడుచున్నట్లు పేర్కొనుచుందురు.[1] ఇట్టి సంప్రదాయ ప్రసిద్ధమగు లక్ష్మీనారాయణ తత్త్వమును ‘మాధవలోక నివాస సౌఖ్యముల్’ అనుచో గల మాధవ పదముచే నారయ వ్యఞ్జ్యమానము గావించియున్నాఁడు.

ఇందుకు సాధనముగా “హరిం దలంపుము” అని భక్తియోగమే నిర్దేశింపఁబడినది.

మఱియు నారయ యీ పద్యమున విశిష్టాద్వైత సంప్రదాయవేత్తలు విశిష్టమైనదిగా భావించు నర్థపంచకము యొక్క సమన్వయమును సాధించియున్నాఁడు.

1) ‘మాధవుఁడు - అనుపదముచే లక్ష్మీ విశిష్ట నారాయణుని స్వరూపము ‘ప్రాప్యము’-అని వివరింపఁబడినది.

2) “సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిక్కమౌ”—అనుటచే అనాద్య విద్యచే నావేశింపఁబడి కర్మానుకూలమగు దేహమును ధరించి దుఃఖపరీతమైన సంసారము నుండి సముష్మైహిక శోకములచేతను పీడితుఁడగునట్టి జీవాత్మయొక్క స్వరూపము వివరింపఁబడినది.

3) “హరిందలంపుము” — అనుటచే స్మరణ రూపమగు భక్తి యోగము మోక్షోపాయముగా వివరింపఁబడినది.

4) "పొందెదవు మాధవలోక విభవవిశేషముల్ -" అనుటచే వైకుంఠలోక గమన రూపముక్తి పేర్కొనఁబడినది.

5) "ఏను మృతుండనౌదునని యింత భయంబు మనంబులోపలన్ మానుము" —అనుటచే మృత్యుభీతి రూప విరోధి స్వరూపము పేర్కొనఁబడినది.

ఇట్లు వారయు యీ పద్యమున సంప్రదాయ సిద్ధముగ విశిష్టాద్వైత దర్శనమును విలక్షణముగ విశ్వసించియున్నారు.

ఈ సందర్భమున శ్రీ శ్రీధరాచార్యుల వారి వ్యాఖ్యయిది- "త్వంతు పునః కృతార్థ ఏ వేత్యను స్మారయతి-త్వమితి. పశుబుద్ధిం అవివేకం యస్మాన్నక్ష్యసి. కుత ఇత్యత ఆహ-నజాత ఇతి. యథాదేహః ప్రాగభూత ఏ వాద్యజాతో నక్ష్యతి చ. నచైవం త్వం పూర్వం నాభూః న చాద్య జాతో౽సి. అతో ననక్ష్యసి.—

ననుబీజా దంకురవత్ స్వస్మాత్ పుత్రరూపేణ స్వయమేవ భవతి.యథాహ.

శ్రు. "అంగాదంగా త్సంభవతి హృదయాదధిజాయసే, ఆత్మావై పుత్రనామాసి సజీవశరదశ్శత మి"తి. తతః పునరంకురాద్బీజమివ పౌత్రరూపేణాపి స్వయమేవ భవతి. శ్రు. "పితా పుత్రేణ పితృమాన్యోనియోనా" ఇతి శ్రుతేః అతస్తేషు నశ్యత్సు కథం. నక్ష్యామీతి చేత్తత్రాహ-న భవిష్యతీతి. యథా పుత్ర పౌత్రాది రూపవాన్ బీజాదంకురవత్. నభవిష్యసి యస్మా ద్దేహాదే ర్వ్యతిరిక్తస్త్వం. యథానలఃకాష్ఠాత్. దేహాద్దేహో జాయతే నాత్మేతి భావః"— ఈ వ్యాఖ్యాన పంక్తులకు విశిష్టాద్వైత సంప్రదాయ బద్ధముగా సాగిన నారయ యనువాదమునకు సంబంధము లేదనియు శ్రీధరీయమును. కు.చ. తప్పకుండ చేయఁబడిన యనువాదమనుట కెంత మాత్రము వీలు లేదనియు వేఱుగా వ్రాయవలసిన యావశ్యకము లేదు.

## 6వ అధ్యాయము

# ఆంధ్రీకర్తల శ్రీతత్త్వ ప్రతిపాదనము

విశిష్టాద్వైత మతమున నొక విశిష్టస్థానమును సంతరించుకొనిన శ్రీ తత్త్వమును భాగవతానువాదకు లతిమాత్రముగాఁ బ్రతిపాదించి తమ సంప్రదాయ ప్రీతిని, బ్రకటించి యున్నారు. వీరి యీ నిర్వహణమును బరికించినచో వీరందరు విష్ణుప్రియు లనియు, విశిష్టాద్వైత మత సిద్ధాంతము పట్ల నాసక్తియు, నభినివేశమును గలవార నియు స్పష్టపడఁగలదు.

ఇట్టి వీరి శ్రీతత్త్వ నిర్వహణమును బరిశీలించుటకుఁ బూర్వము విశిష్టాద్వైత సిద్ధాంతమున నదియెట్లు వివరింపఁ బడినదో తెలిసికొనవలసి యున్నది.

**1) శ్రీదేవి శ్రీమన్నారాయణునితో ననపాయని :** విశిష్టాద్వైత సిద్ధాంతమున శ్రీమన్నారాయణుఁడు పరబ్రహ్మము. అనగా శ్రీదేవితో గూడిన నారాయణుఁడు పరబ్రహ్మము. ఇట్లనుటచే నీ తత్త్వములు రెండని తోపవచ్చును కాని యీ శ్రీ తత్త్వము నారాయణునితో నవినాభావ-సంబంధము కలది. కావున శ్రీమన్నారాయణుని యేకత్వమునకు భంగముండదు. కావుననే శ్రీదేవి నారాయణునితో నపృథక్సిద్ధ లేక యనపాయని యని చెప్పఁబడుచున్నది. వీరిది దివ్య దాంపత్యము. శ్రీదేవితోఁ గలసియే నారాయణుఁడు సేవ్యుఁడు. శ్రీవిశిష్ట నారాయణ పరబ్రహ్మమే మోక్షప్రదాత యని శ్రీవైష్ణవుల నిర్ణయము.

**2) శ్రీదేవి శేషభూతురాలు :** ఈమె శ్రీమన్నారాయణునకు శేష భూతురాలు- అనగా- శ్రీమన్నారాయణునకు యథేష్టముగా నుపయోగించుకొనఁదగిన యుపకరణము. ఈమె వైకుంఠమున శ్రీమన్నారాయణ పరబ్రహ్మమునకు దివ్య దాస్యము నెరపును.

**3) శ్రీదేవి పురుషకార భూతురాలు :** శ్రీదేవి కారుణ్యరూపిణి. జీవుని మీద దయతో "పురుషకారము"ను నిర్వహించుచుండును. పురుషకారమనగా మధ్య

వర్తిత్వము. ఈ పురుషకార పదమునకు వేదాంత దేశికులిట్లు వివరణము చేసియున్నారు.

"ఏరైన నొక యపేక్ష గల పురుషునిచే నా యపేక్షను నెరవేర్పగల పురుషుడు పొందబడుటకై యుపాయముగా వరింపబడు వేఱొక చేతన వస్తువును బురుషకారమని వ్యవహరింతురు"[1]

ఈ పురుషకారమన దానిని త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ వారిట్లు వివరించినారు.[2]

"పురుషకారమనగా బురుషునిగా జేయునదియని యర్థము. పురుషుడనగా అధికముగా నిచ్చువాడు (పురు = అధికముగా ష = ఇచ్చును) అట్టి వానినిగా జేయునుగాన లక్ష్మికి బురుషకారమని పేరు. శ్రియఃపతి ఐహికాముష్మిక సౌఖ్యము లను గాని పరమపదమును గాని ప్రసాదించుట యామె కొఱకే"

"మఱియు- పురుషుడనగా పూర్ణుడు. అట్టి వానినిగా జేయునుగాన పురుషకారము- అనగా స్వాతంత్ర్యము తల యెత్తిన తరి తలవంచు సౌశీల్య-సౌలభ్యస్వామిత్వ-వాత్సల్య-శాంత్యాది గుణగణములను దన పురుషకారముచే తిరిగి తల మెత్తించి సర్వేశ్వరుని కా లోటును దీర్చునుగాన లక్ష్మిని "పురుషకార" మందురు"

ఈ పై వివరణములనుబట్టి పరమాత్మయగు శ్రీమన్నారాయణుని దే కారణము చేతనైన జీవులపై గోపించిన నీమె మాధ్యస్థ్యము వహించి వారిని బరమాత్మ దయకు బాత్రులగా జేయుటకై విన్నవించునది శ్రీదేవి యని తెలియుచున్నది.

శ్రీదేవి కిట్టి పురుషకారము నెరపునదను లక్షణమును జెప్పుటను శ్రీ శబ్దము యొక్క వ్యుత్పత్తిని బెద్దలు వివరించి సమర్థించి యున్నారు. విశిష్టాద్వైతమతమున "తెంగలి" శాఖకు బ్రవర్తకులైన శ్రీ పిళ్ళ లోకాచార్యులవారు—

"శ్రీశబ్దము లక్ష్మీదేవికి బురుషకారత్వమున కవశ్యాపేక్షితములయిన స్వభావములను జెప్పగలిగినదై యున్నది. 'శ్రిఞ్ సేవాయామ్' - అను ధాతువు నుండి - శ్రీయత ఇతి శ్రీః - అని కర్మణి వ్యుత్పత్తివలన నందటిచే "ఆశ్రయింపబడుచున్నది" అను నర్థమును - శ్రయత ఇతి శ్రీః - అను కర్తరి వ్యుత్పత్తిచే

1. రహస్యత్రయసారము- ద్వయాధికారము పుట571 (ఆంధ్రీకర్త=శ్రీకందాడై శేషాచార్యులుగారు.

2. శ్రీసూక్తము - ప్రస్తావన. పుట 2,3.

'నారాయణుల నాశ్రయించునది' అను నర్థమును చెప్పుట తనతాత్పర్యమన్నది".[1] అని వివరించియున్నారు.

అపర రామానుజావతారముగాఁ గీర్తింపఁబడుచు విశిష్టాద్వైతమున "వడగల" శాఖకుఁ బ్రవర్తకులైన శ్రీ వేదాంత దేశికులు - శ్రీః అను శబ్దము శ్రీయతే, శ్రయతే, శృణోతి, శ్రావయతి, శృణాతి, శ్రీణాతి యని యారు విధములుగా భగవ చ్ఛాస్త్రముల యందు నిర్వచింపఁ బడినదనియు - అర్థస్వభావము, ననుష్ఠానము, లోకదృష్టి, ఆచార్య శ్రీ సూక్తి, శ్రుతులు, స్మృతులు వీనినిబట్టి లక్ష్మీదేవికిఁగల పురుషకారత్వము సిద్ధమగుచున్నదనియుఁ దెల్పియున్నారు.[2]

ఇట్లు మూడు లక్షణములు గలిగియున్న శ్రీతత్త్వమును భాగవతకవులు విశిష్టాద్వైత సంప్రదాయ బద్ధముగా గుర్తించి తమ యనువాద సందర్భమున విరివిగఁ బ్రకటించియున్నారు.

భాగవతాంధ్రీకర్తలగు పోతనాదులు తమ యనువాదమునందుఁ బెక్కు విశిష్టాద్వైత సిద్ధాంతములను స్వీకరించి నిర్వహించు చేతను, నీ శ్రీతత్త్వము తత్సిద్ధాంత మున నొక ప్రధానాంశమగుట చేతను, అనుకూలముగా నీ యంశమును వీరు పెక్కు తావులందుఁ బ్రకటించి యుండుట చేతను, వీరు సర్వులు శ్రీమన్నారాయణ పరాయణులనియు, విశిష్టాద్వైత సిద్ధాంత బద్ధాంతరంగులనియుఁ, దత్సంప్రదాయ ప్రచోదిత ప్రపత్యయులనియు – సిద్ధాంతీకరించుటకు వీలు కలుగుచున్నది. కానిచో మూలమునలేని శ్రీదేవి ప్రస్తావనము మఱి మఱి చేసియుండుట సంభవింపదు.

ఇట్లు విశిష్టాద్వైత సిద్ధాంత సంసక్త చిత్తములతో భాగవతాంధ్రీకర్తలు కావించిన శ్రీ తత్త్వ ప్రతిపాదనమును బరిశీలింతము –

1) పోతనామాత్యుఁడు గ్రంథారంభమున స్తుతి పద్యముల యందే శ్రీ తత్త్వముతో నపృథక్సిద్ధమైన నారాయణ తత్త్వమును వివరించియున్నాఁడు. తొలుత శ్రీకృష్ణ పరబ్రహ్మముయొక్క వర్ణనము–తదుపరి యాతని శరీర స్థానీయు లగు దేవతాంతరుల వర్ణనము - కట్టకడపట శ్రీదేవివర్ణనముఁ గావించియున్నాఁడు. శ్రీకృష్ణ పరబ్రహ్మము స్తుతి తరువాతనో, లేక శ్రీకృష్ణ శివ బ్రహ్మల స్తుతుల వెనుక సరస్వతీ పార్వతుల స్తుతులకు ముందో - ఏదియో యొక క్రమమున

1. ముముక్షుప్పడి — ద్వయ ప్రకరణము.
2. రహస్యత్రయసారము — ద్వయాధికారము పుట, 569, 571

ఏ శ్రీ స్తుతి ప్రవక్తమైయుండుట సామాన్యమగు విధము. కాని పోతన శ్రీకృష్ణస్తుతి పిమ్మట కవులు బ్రహ్మ, వినాయకుడు సరస్వతి, దుర్గ వీరల స్తుతుల వా పిమ్మటఁ దిద్ద చివరగా శ్రీదేవి స్తుతిఁ గావించి పోతన శ్రీమన్నారాయణుని తత్త్వములో నపృథక్సిద్ధమగు లక్ష్మీ తత్త్వమును ప్రతిపాదించి శ్రీమన్నారాయణుని యేకత్వ మును బ్రబోధించి యున్నాఁడు.

ఈ తత్త్వాంశ మిట్లుండగాఁ బోతన కావించిన శ్రీదేవి స్తుతి శ్రీదేవి స్వరూప స్వభావములను వివరించునదిగా నున్నది.

పోతన కావించిన శ్రీస్తుతి —

"హరికిం బట్టపుదేవి పున్నెముల ప్రో వర్థంపు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీ గిరిసుతల్ తోనాడు పూబోఁడి తా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి సిరి యిచ్చున్ నిత్య కల్యాణముల్"

(1–11)

1. ఈ పద్యమున "హరికిం బట్టపుదేవి" యనగా పెక్కురు దేవు లున్నను రాజునకుఁ బట్టపుదేవితోఁ గల సంబంధము విశిష్టమై యుండుట లోక సహజము. అట్లే పెక్కు గుణముల కూడలియైన నారాయణుని ప్రధాన తత్త్వమీ శ్రీతత్త్వము. ఈమెతో గూడిననే యాతనికిఁ బర బ్రహ్మత్వ పరిపూర్తి - మోక్ష దాయకత్వము నని విశిష్టాద్వైత సంప్రదాయము చెప్పినది.

2. పున్నెముల ప్రోవు : శుద్ధసత్త్వమగు వైకుంఠమున నిత్య నివాసము- శ్రీమన్నారాయణునితో భోగానుభూతి - అపృథక్సిద్ధత్వము లను సూచించు విశేషణమిది.

3. జగముల్ మన్నించు నిల్లాలు : శ్రీమన్నారాయణునితో దివ్య దాంపత్యమును సూచించు విశేషణ మిది.

4. భాసురతన్ లేములు వాపు తల్లి : జీవుల కొరతలను మాతృ మూర్తి తండ్రితో విన్నవించి మధ్యవర్తిత్వము నెరపి తీర్చినట్లు జీవులందఱకుఁ బురుషకారము నెరపి వారికిఁ గల కొరతలను (లేములను) దీర్చుతల్లి యీ శ్రీదేవి.

5. సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్ : సృష్టి స్థితి లయ కారకుఁ డైన శ్రీమన్నారాయణ పరబ్రహ్మముతో నిత్య సాహచర్యము గల్గియుండిన

శ్రీదేవి నిత్య కల్యాణములను జీవకోటి కిచ్చుటలో సామర్థ్య విశేషము కలిగినదే. ఆ విషయమును సమర్థించునదే — అర్థంపు పెన్నిక్క ఇత్యాదులు. ఇట్టి స్తుతి పద్యమున శ్రీతత్త్వము విశిష్టాద్వైత సంప్రదాయ బంధురముగా వను పంధింపఁ బడినది. ఈ పద్యమునఁ గల "తల్లి" అను నిర్దేశము వలన మధ్యవర్తిత్వము, పురుషకారము వను నభిప్రాయములకు పీఠ కలిగినది. శ్రీదేవి మధ్యవర్తిత్వము నెరపి శ్రీమన్నారాయణుని వలన భక్తులకు మోక్షము ప్రసాదింప జేయుటయే గాక స్వయముగా గూడ భక్తులకు భుక్తి మోక్షముల దయచేయగల సామర్థ్యము కలదిగా సంప్రదాయజ్ఞులు పేర్కొని యున్నారు.

2. పోతనామాత్యుఁడు తృతీయ స్కంధమున యజ్ఞ వరాహ వృత్తాంతమున శ్రీవరాహమూర్తి తన దంష్ట్రాగ్రమున భూమి నెత్తిన సందర్భమున సమూలకముగా శ్రీతత్త్వము ప్రకటించినాఁడు.

ఆ సందర్భమునఁ బోతన వ్రాసిన పద్యమిది—

"బాల శీతాంశురేఖా విడంబమాన
ధవళ దంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె
హరికి నిత్యానపాయినియైన లక్ష్మి
నెరయఁ బూనిన కస్తూరి నికరమనఁగ" (3-421)

ఇందు లక్ష్మీదేవి హరికి నిత్యాన పాయని యనెడు నీ యమూలక కల్పనము వలనఁ బోతనకు విశిష్టాద్వైత సిద్ధాంతమునందలి యభినివేశమును, తత్సిద్ధాంతము నందలి పరిజ్ఞానమును మిక్కుటముగ వెల్లడి యగుచున్నది.

3. తృతీయ స్కంధమున సనక సనందనాదులు జయ విజయులను శపించిన సందర్భమున నా విషయము నెఱిఁగిన శ్రీమన్నారాయణుఁ డభ్యంతర మందిరము నుండి శ్రీ సమేతుఁడై వారున్న చోటునకు వచ్చినట్లు మూలమున నుండగాఁ బోతన యా సందర్భమున కారుణ్య రూపిణి, పురుషకారభూమిక యగు శ్రీదేవి యొక్క తత్త్వము సమూలకముగా నెలకొల్పినాఁడు.

ఈ సందర్భమున మూలమున నిట్లున్నది —

"తస్మిన్ యయౌ పరమహంస మహా మునీనా
మన్వేషణీయ చరణౌ చలయ న్సహశ్రీః" (3-15-37)

ఇందు శ్రీదేవితోఁ గూడిన వాఁడై శ్రీహరి వెడలినట్లున్నది. ఈ సందర్భమున విశిష్టాద్వైత వ్యాఖ్యాత యగు శ్రీవీరరాఘవాచార్యులుగారు.[1]

"మిథున స్యైవోపాస్యత్వ ప్రాప్యత్వ ద్యోతనాయ, మాతృవన్మితా సుతరాం తేషాం కోపముపశమయితుం చ సశ్రియ ఆగమన మిత్యభిప్రాయః"

అని వివరించి యున్నారు. పోతన యీ నిర్వహణమునకుఁదగినట్లు ప్రస్తుత పట్టమును సతపియున్నాఁడు. పై శ్లోక భాగమును పోతన యిట్లను వదించి యున్నాఁడు—

"పద్మాలయా
సంసాలాప వినోదసౌఖ్య రచనల్ పాలించి"— (3–532)

శ్రీమన్నారాయణుఁడు శుద్ధాంతము నుండి వచ్చినాఁడని పోతన యమూలకముగాఁ గల్పించినాఁడు. ఈ కల్పనము వలన శ్రీమన్నారాయణునితో శ్రీదేవికిఁగల నిత్య సాహచర్య వైభవము ద్యోతకమగుచున్నది. మఱియు నారాయణుని భక్తిజన ప్రీతియు వ్యజ్యమాన మగుచున్నది.

ఆ తరువాత "సహ శ్రీః" అను మూలమునమన్న పదబంధమును—

"తరనిరి కన్యకామణియు సంభ్రమ మొప్పగఁ దోడరా—"(3-534)

శ్రీహరి వచ్చినట్లనువదించియున్నాఁడు. ఇందు గుర్తింపఁదగిన యంశము "సంభ్రమ మొప్పగ" అను దళము. ఇది కేవలము యతి ప్రాసల ప్రయాసయో—పాదపూరణ వ్యవహారమో యనుట పోతన వంటి "సహజ పాండిత్యుఁడు", "పాదువయ యుక్తుఁడు" వగు వాని విషయమున మహాపచారము కాఁగలదని నా నమ్మిక.

మఱి యీ శ్రీదేవి సంభ్రమము పురుషకార సంభ్రమమనియే పేర్కొనుట యుక్తతమము. బిడ్డలు దావంపాలై పప్పుతు తల్లి యల్లములోఁ బెల్లుబికెడి కల్లోలపు పెల్లువమే యీ సంభ్రమమని యూహించుటలో నౌచిత్యము కలదు.

4) అష్టమ స్కంధమున — గజేంద్రమోక్షణ పట్టమున పోతన శ్రీదేవి కర్తృత్వము నమూలకముగా విశేషముగా విశిష్టాద్వైత సంప్రదాయ బద్ధముగా నిక్షేపించి యున్నాఁడు.

---

1. శ్రీ వీరరాఘవీయ వ్యాఖ్య 3 - 15 - 37.

గజేంద్రుని రక్షించిన శ్రీమన్నారాయణుఁడు తన లోకమునకు వెడలిన సందర్భమున మూలమున—

"ఏవం విమోక్ష్య గజ యూథప మబ్జనాభ
స్తేనాపి పార్షదగతిం గమితేన యుక్తః ।
గంధర్వ సిద్ధవిబుధై రుపగీయమాన
కర్మాద్భుతం స్వభవనం గరుడాసనోఽగాత్"

(8 స్క - 4 అ - 13 శ్లో)

అనియు—"హర్షయన్ విబుధానీక మారురోహ ఖగాధిపమ్"

(8 స్క-4అ - 25 శ్లో)

అనియుఁ జెప్పఁబడినది. మూలమున గజేంద్ర మోక్షము జరిపి శ్రీహరి యిట్లు వెడలిపోయి నట్లు మాత్రము కలదు.

పోతన శ్రీవైష్ణవ ప్రావణ్యముతో నీ ఘట్టము నింకను బాగుగాఁ బెంచి శ్రీమన్నారాయణుఁడీ సందర్భమున శ్రీదేవితో ముచ్చటలాడినట్లొక యనల్పకల్పనముఁ గావించినాఁడు. దీని వలన శ్రీదేవీతత్త్వము-నామెకు శ్రీమన్నారాయణుని తోడి సంబంధము వెల్లడియగుట కవకాశ మేర్పడినది.

గజేంద్రుఁడు గ్రాహబద్ధుడై యున్నపుడు సమయమునకు శ్రీహరి "రమా వినోదియై" యున్నాఁడు. గజేంద్రుని రక్షించు త్వరలో "వివాద ప్రోత్థిత శ్రీ కుచో పరి చేలాంచలమైన వీడఁడ" వదువెత్తినాఁడు. లక్ష్మీదేవి "గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యాన చేలాంచలయై"— తానును పోయినది.

గజేంద్ర మోక్షమైన తరువాత శ్రీహరి శ్రీదేవితో నిట్లు పలికినాఁడు—

"బాలా ! నా వెనువెంటను
హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట
కేలో కేమంటి నన్ను నంభోజాక్షీ !" (8 స్క—129 వ)

ఇది యామెను "లౌకిక మర్యాద" ననుసరించి బుజ్జగించుటకుఁ బలికిన పలుకు. అటు పిమ్మట నిజతత్త్వము నిట్లు వెల్లడించినాఁడు.

"ఎఱుఁగుదు తెలిసి యెవ్వరు
మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్
మఱతునని యెఱిఁగి మఱుఁగక
మఱవక యెఱుఁగుదురు యేని మఱియన్యములన్"

(8 స్క - 130 వ)

ఇది శ్రీహరి తన తత్త్వమును వివరించుచు పలికిన సాంత్వన వచనము. దీనికి శ్రీదేవి యిచ్చిన సమాధానము శ్రీతత్త్వ నిర్ణాయకములగు నిశ్చయ వాక్యములు -

"దేవా! దేవర యడుగుల
భావంబున నిలిపి కొలుచు పని నా పని గా
కో వల్లభ! యేమనియెద
నీ వెంటన వచ్చుచుంటి నఖిలాండపతీ!" (8 స్క-112)

ఈ పద్యమున-నీ కనుకూలవతిని - నిన్ననుసరించెడిదానను - నీ ప్రవర్తనకు నేనే మందును - అని యనినాభావ చరితమగు శేషత్వము (అనగా భగవత్పారతంత్ర్యము) ప్రకటింపఁబడినవి. ఇందును-దేవా-వల్లభ-అఖిలాండపతీ-అను సంబోధనము లన బలకములై నారాయణుని పరబ్రహ్మత్వమును వ్యక్తీకమానము చేయుచున్నవి.

పై పద్యమున వ్యక్తము చేయఁబడిన తత్త్వాంశమిది-కారుణ్య రూపిణియగు లక్ష్మీదేవితో గూడియే శ్రీమన్నారాయణుఁడు రక్షకుఁడని సర్వవేదాంతములచే బోధింపఁబడినది- అని విశిష్టాద్వైత సంప్రదాయమునుబట్టే రక్షకుఁడైన శ్రీహరి వెంట శ్రీదేవి యుండుట ముఖ్యలక్షణము. గజేంద్ర మోక్షణ ఘట్టమున మూల గ్రంథమున లక్ష్మివెంట వచ్చినట్లు లేదు. మఱి పోతన పరసముగా నీ లక్ష్మి ప్రస్తావమును శ్రీవైష్ణవ సంప్రదాయము నెఱిఁగియే- శ్రీమన్నారాయణుఁడు లక్ష్మీదేవితో గూడియే రక్షకుఁడగుచున్నాఁడని యావిశేషము నెఱిఁగింపఁ దలఁచియే-యమూల్యమైన యీ యమంద సుందర కల్పనా శిల్పమును ప్రదర్శించియున్నాఁడనుట యుక్తము.

శ్రీదేవి కారుణ్య రూపిణియు, పురుషకారభూతురాలునని విశిష్టాద్వైత మత సంప్రదాయమున శ్లాఘింపఁబడుచుండుటచే శ్రీహరి గజేంద్రుని రక్షించుటలో నామె కావిముఖ్యమేకాని యాగ్రహకారణము లేకుండుట సహజ విషయము. ఈ విషయమే పైన లక్ష్మీదేవి పలికిన పలుకులతో వ్యక్తమగుచున్నది.

ఆ తరువాత నున్న పద్యము లక్ష్మీ పురుషకార వైభవమును మఱింత చేట తెల్లము చేయుచున్నది మఱియు భక్త పాలనమున శ్రీమన్నారాయణుని పారీణత్వ మును సమర్థించుచున్నది—

"దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన ! నీ కొప్పును
దీన పరాధీన ! దేవ దేవ ! మహేశా !

(8 స్క-133ప)

ఈ పద్యమున దీనుల రక్షించుట నీకుఁ దగియున్నది యని యాతని భక్త పాలనము పట్ల తన యానుకూల్యమును బ్రకటించినది. శ్రీహరి నభినందించుచున్నట్లుగా నాతనిని భక్త రక్షణకై ప్రోత్సహించుచున్నది ఇదియే గదా పురుషకార స్వభావము.

ఈ లక్ష్మీ పురుషకార స్వభావమును గూర్చి విశిష్టాద్వైత సంప్రదాయమున నాచార్య కోటిలోఁ బ్రథమగణ్యులు, రామానుజ సిద్ధాంతమును విశేషముగాఁ బ్రచా రము చేసినవారునగు భట్టరువారు ఈ విధముగా వర్ణించియున్నారు-

"పితేవ త్వత్ప్రేయాన్ జనని ! పరిపూర్ణాగసిజనే
హితస్రోతో వృత్త్యా భవతి చ కదాచిత్కలుషధీః ।
కిమేతన్నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః
ఉపాయై ర్విస్మార్య స్వజన యసి మాతా తదసినః ॥[1]

దీని తాత్పర్యమిది- తల్లీ! నీ భర్త యపరాధములచే నిండియున్న మనుజుని యందు తండ్రివలె హితమును జేయగోరి కోపించినచో- "ఇదేమి! లోకములో దోషములేని వాఁడెవఁడు ?" అని సముచితముగా నుపాయముతో నాతని కోపమును మాన్పి జీవుని భగవంతుని యొక్క స్వజనముగాఁ జేయుచున్నావు-అని

గజేంద్ర మోక్షణ ఘట్టమునఁ బ్రస్తుత సందర్భమున భట్టరు వారి వాక్యముఁ ననుసరించుచు నీ లక్ష్మీతత్త్వమును సూచించుచుఁ బోతన—

"సముచిత సంభాషణంబుల నంకించుచున్న య వ్వరవ
వైష్ణవీ రత్నంబు" (8 స్క-134 ప)—

1. శ్రీ వైష్ణవస్తోత్రమాల-శ్రీ గుణరత్నకోశము శ్లో - 52.

లని యామెను శ్లాఘించియున్నాఁడు అమూలకముగా నిట్లు పోతన యిట్లు శ్రీతత్త్వమును వివరించుటచే నీతనికి శ్రీవైష్ణవ సంప్రదాయము కరతలామలకమనియు, దాని ప్రచారమీతని యనువాదముపైఁ గలదనియుఁ దెలియుచున్నది.

5) క్షీర సాగర మథన ఘట్టమున లక్ష్మీ ప్రాదుర్భావము వర్ణింపఁబడిన సందర్భమునఁ బోతన యమూలకముగా శ్రీదేవి యొక్క దివ్య మాహాత్మ్యమునిట్లు వర్ణించియున్నాఁడు -

"పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో
  భాషించె వాఁడెపో బ్రహ్మ యనఁగ
నెలయించి కెంగేల నెవ్వని వరియించె
  వాఁడె లోకములకు వల్లభుండు
మెయిడీఁగె నెవ్వని మేనితోఁ గదియించె
  వాఁడె పో పరమ సర్వజ్ఞ మూర్తి
నెఱఁకుక యెవ్వండు నివసించె నేయింట
  నా యిల్లు పరమగు నమృత పదము
నింతి చూపువాతె నెచ్చోటి కచ్చోటు
జిష్ణు ధనద ధర్మ జీవితంబు
గొమ్మ చిన్ననగవు గురుతర దుఃఖ ని
వారణంబు సృష్టి కారణంబు

(8 స్క-273 ప)

ఈ వర్ణనము బ్రహ్మాది స్తంబ పర్యంతమగు చరాచర ప్రకృతి తన శరీరముగాఁ గల శ్రీమన్నారాయణునితో నపృథక్సిద్ధమగు శ్రీతత్త్వమును బ్రబోధించినది. శివాద్యఖిల దేవతల కాతఁడాత్మ. సర్వరూపములు - సర్వనామములు శ్రీమన్నారాయణునివి. అతఁ డే యే రూపములలో నుండునో తత్సన్నిభమగు రూపముతో నాతనికి శేషభూతురాలై -అనగా- పరతంత్రురాలై -యుండుట శ్రీతత్త్వము.

విశిష్టాద్వైత సంప్రదాయ వేత్తలలోఁ బ్రథమగణ్యులు పోతన కంటెఁ బూర్వమున జీవించి శ్రీవైష్ణవాచార్యులుగాఁ బ్రసిద్ధులగు శ్రీ భట్టరు వారు శ్రీతత్త్వమును బ్రకటించుట కొఱకుఁ దాము రచించిన "శ్రీ గుణరత్నకోశము" అను స్తోత్రమున శ్రీదేవి మాహాత్మ్యమును వర్ణించుచు —

"అపాఙ్గా భూయాంసో యదుపరి పరంబ్రహ్మ తదభూత్
అమీ యత్ర ద్విత్రాస్స చ శతమఖాది స్తదభవత్
అతశ్శ్రీ! రామ్నాయ స్తదుభయ ముఖస్త్వామభిజగౌ
ప్రశస్తి ప్పారాజ్ఞో యదపి చ పురీకోశ కథనమ్."[1]

అని శ్రీదేవిని బ్రస్తుతించి యున్నారు. దీని భావమిది —

"ఓ లక్ష్మీ! నీ యొక్క కటాక్షము అధికముగా నెవనిమీద ప్రసరించెనో వాఁడు పరబ్రహ్మము. ఎవరి మీద రెండు మూడు ప్రసరించునో వారు పర బ్రహ్మము కంటెఁ దక్కువవారైన దేవేంద్రాదులు. అందువలన వేదము రెండింటిని దెలియపరచుచు నిన్ను స్తుతించెను. రాజుయొక్క పట్టణ ధన కోశాదిక ధనముల పొగడ్త రాజు యొక్క పొగడ్తయే గదా."

పై పోతన పద్యమీ శ్లోక భావముతోఁ బూర్తిగా సంవదించుచున్నది — అనగా — సరిపోయి యున్నది. శ్రీదేవిని గూర్చి భట్టరాద్యాచార్య వర్యుల సంప్రదాయబద్ధమైన నిర్వహణ విధానములను బూర్తిగా యెఱిగియే పోతన యిట్టి శ్రీతత్త్వ నిర్ణాయకమగు కల్పన చేసియుండునని భావింపవలసి యున్నది. లేనిచో మూలమున లేని యిట్టి శ్రీదేవీ మాహాత్మ్యమును జాటి చెప్పు వర్ణనను పోతన చేయుట కవకాశము లేదు.

6. అష్టమ స్కంధమున బలి చక్రవర్తి - వామనుఁడు శ్రీహరి యని గుర్తించియు, శుక్రాచార్యుని నిషేధ వాక్యములను వెడచెవినిఁ బెట్టి దానము నిచ్చుటకుఁ బూనుకొనిన సందర్భమున "సమూలకముగా" వ్రాయబడిన యీ క్రింది పద్య మాంధ్ర సాహిత్య లోకమున సుందర శైలీ సంశోభితమై వాసికెక్కినది. విశిష్టాద్వైత సంప్రదాయ సిద్ధముగా లక్ష్మీనారాయణుల దివ్య దాంపత్యమును సరసమ్ముగా వర్ణించునది —

"ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాశాయమే."

(85.92)

1) శ్రీ గుణరత్నకోశము శ్లో 30.

శ్రీహరి సౌరభమే గాక విశిష్టాద్వైత వేదాంత విద్యా సౌరభము స్థిరము సంతరించుకొనిన పద్యమిది.

ఈ పద్యమున శ్రీమన్నారాయణునకు స్వరూపమును దివ్య మహిషీ సాహచర్యము నను రెండు విషయములు నిశ్చితములు చేయఁబడినవి.

మఱియు వామనుఁడు శ్రీమన్నారాయణుని యవతారమని స్థిరపడుటచే నవతారములు పరమార్థములను విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయము ప్రకటింపఁబడినట్లు కాఁగలదు.

ఇట్లు మూలకముగాఁ బోతన యీ ఘట్టమున విశిష్టాద్వైత సంప్రదాయమున శ్రీదేవికి నారాయణుని తోడి నిత్య సాహచర్యమును వర్ణించు మార్గముననే తాను గూడ వర్ణించి తత్సంప్రదాయ పరిజ్ఞానమును, దత్ప్రీతిని వెల్లడించి యున్నాఁడు.

7. దశమ స్కంధము పూర్వభాగమున రుక్మిణీ కల్యాణ ఘట్టమున శ్రీకృష్ణుఁడు రుక్మిణినిఁ బెండ్లియాడెనని చెప్పు సందర్భమున మూలమున లేకుండ స్వతంత్రముగాఁ బోతన వ్రాసిన యీ క్రింది పద్యము శ్రీతత్త్వమును చక్కగాఁ బ్రతిపాదించునది.

"ధ్రువ కీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మానసై
కవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణిఁ బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.

(10 పూ. భా. - 1782)

ఈ పద్యమున రుక్మిణి "ఆదిలక్ష్మి" యొక్క లక్షణములతో గూడి యున్నదిగా వర్ణింపఁబడినది.

1) నిజ చేతోహారిణి = శ్రీదేవికి శ్రీమన్నారాయణునితోఁగల దివ్య సంబంధము వ్యక్తమగుచున్నది.

2) నిఖిల సంపత్కారిణి = దయాగుణాన్వితత్వము వ్యక్తమగు చున్నది.

3) సాధు బాంధవ సత్కారిణి = పురుషకార నిర్వాహకత్వము వ్యక్తమగుచున్నది.

4) పుణ్యకారిణి = దివ్య వైకుంఠవాసము ద్యోతకమగు చున్నది.

5) మహాదారిద్ర్య సంహారిణి = మహిమాన్వితత్వము వెల్లడియగు చున్నది.

6) మానవ వైభవ గాంభీర్య విహారిణి —
7) సువిభూషాంబరధారిణి
8) గుణవతీ చూడామణి
} = వల్లికణ లక్షితత్వము తెల్లమగు చున్నది.

ఇట్లు మూలకముగా రుక్మిణీదేవియందు శ్రీదేవియొక్క లక్షణములను ప్రతిఫలింపఁజేయుట యందు పొతనయభిప్రాయ విశేషములను వారి పోతన శ్రీతత్త్వమునుటక్కగా వ్యక్తము చేసియున్నారు. ఈ రుక్మిణీ వర్ణనము శ్రీదేవీ వర్ణనమేయని దశమ స్కంధము పూ. భా. 1786వ పద్యము సాక్ష్యమిచ్చుచున్నది. అందు "ఆదిలక్ష్మియైన రుక్మిణితోఁ గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి" — అని — పేర్కొనబడినది ఇట్లు రుక్మిణికి శ్రీదేవికిఁ బోలిక చెప్పఁబడినది.

8. దశమ స్కంధము—ఉత్తర భాగమున శ్రీకృష్ణుఁడు రుక్మిణితో నర్మోక్తులు పలికిన ఘట్టమున రుక్మిణి పలికిన పలుకులలో శ్రీతత్త్వము చక్కగాఁ పోతన వివరించి యున్నారు.

రుక్మిణి శ్రీకృష్ణుఁడు పల్కిన నర్మోక్తులకు రోదించినది. శ్రీకృష్ణుఁడామె ననునయించినప్పుడామె పలికిన పలుకులు మూలమున నిట్లున్నవి —

"తం త్వామరూప మభజం జగతామధీశ
మాత్మాన మత్ర చ పరత్ర చ కామపూరమ్।
స్యాన్మే తవాంఘ్రిరరణం సృతిభి ర్భ్రమంత్యా
యో వై భజంత ముపయా త్య నృతాప వర్గః॥[1]

ఈ మూల శ్లోకమునకుఁ బోతన గావించిన యనువాదమిది—

"దేవా ! భూలోకమునందును నిత్యనివాసమునందును
సకల ప్రదేశములందును జగదీశ్వరుండవయిన నిన్ను
నభిమతంబులయిన కామరూపంబులుగైకొని పరంతు"

(10 ఉభా 256)

---

1. శ్రీమద్భా 10స్క—60 అ—43శ్లో

ఈ మాటలు స్పష్టముగ శ్రీతత్త్వ నిర్ణాయకములు. ఈ రుక్మిణి పలికిన పలుకు లకు శ్రీకృష్ణుఁడిచ్చిన సమాధానమున గల వాక్యము —

"నీ వివాహ కాలంబున ననేక రాజన్య వరులఁ గై కొనక తపస్వియు మధు రాలాప శ్రవణాశక్తుండ నయిన నా సన్నిధికి నా శరీరం బితర యోగ్యంబుగాదు నీకు శేషంబనయి యున్నదాన నని యేకాంతంబునన్ బ్రాహ్మణుం బుత్తెంచిన"
(10 స్క—ఉత్త 268)

ఈ పోతన యనువాదమునకు మూలశ్లోకమిది—

"దూత స్త్వయాత్మలభనే సువివిక్తమంత్రః
ప్రస్థాపితో మయి చిరాయతి శూన్యమేతత్,
మత్వా జిహాస ఇదమంగ మనస్య యోగ్యం
తిష్ఠేత తత్త్వయి వయం ప్రతినందయామః॥[1]

ఈ పై శ్లోకమున పోతన యనువాదములోని — "నీకు శేషంబనయి యున్నదాన" అను వాక్యమునకు సంబంధించిన భావము ప్రస్తుతము కాలేదు. ఇది కేవలము విశిష్టాద్వైతమత సంప్రదాయ ప్రసిద్ధమగు ప్రయోగము.

శ్రీమన్నారాయణుఁడు శేషి —అనగా-స్వామి. తదితరములు శేషము-అనగా దాసులు లేక పరతంత్రులు. శ్రీమన్నారాయణుని కనుకూలపత్నియగు శ్రీదేవి దాస కోటిలో నగ్రగణ్యురాలు. స్వామి కనుసన్నలలో మెలఁగునది.

"శ్రీః" అను శబ్దమున కర్థము చెప్పుటలో శ్రీయతే, శ్రయతే-అను నిర్వ చనము ను బట్టి—"తమ తమ యభీష్టసమఁగోపసిద్ధి చేతనులచే నాశ్రయింపఁ బడినదై హరి నుద్దేశింపఁ జేయుటకు సర్వేశ్వరు నాశ్రయించి యుండునది"[2] అని శ్రీవైష్ణవాచార్యులచే శ్రీతత్త్వము వివరింపఁబడుచున్నది. ఇదియే యామె శేషత్వము. ఇట్టి సంప్రదాయమును క్షుణ్ణముగా నెఱిఁగియే పోతన "శేషంబయి యున్నదాన" అను నీ విలక్షణ ప్రయోగమును జేసియున్నాఁడని యభిప్రాయము. అట్లుగాక

1. శ్రీమద్భా 10 స్క-60 అ-57 శ్లో
2. రహస్యత్రయ సారము-ద్వయాధికారము పుట 570

పోయిన శేషత్వమునకీ సందర్భమైన పరపమగు పేజాక యర్థము కొనఁగదగు పరిశీలింపఁదగినది.

9. పంచమస్కంధమున నాభి వృత్తాంతమున గంగన శ్రీతత్త్వమును అక్కడగా వెల్లడించి తన విశిష్టాద్వైత పరిజ్ఞానమును, తన్మత పరత్వమును ప్రకటించి పోతన మార్గము ననుసరించిన వాఁడాయెను.

నాభి యనునాతఁడు సంతానార్థము భక్తితో వాసుదేవునిఁ బూజింపగా దైవము ప్రత్యక్షమాయెను. ఆ సందర్భమున నా శ్రీమన్నారాయణుని దివ్య మంగళ విగ్రహమును మూలమున వ్యాసభగవానుఁడిట్లు వర్ణించి యున్నాఁడు—

"అథ హ తమావిష్కృత భుజయుగళద్వయం, హిరణ్మయం పురుషవిశేషం కనక కపిశ కౌశేయాంబర ధరం, ఉరసి విలస ఛ్ఛ్రీవత్సలలామం. దరవర వనరుహ వనమాలా చ్ఛూర్యమృత మణి గదాదిభిరుపలక్షితం, స్ఫురత్కిరణ ప్రవర మణిమయ మకుట కుండల కటక కటిసూత్రహార కేయూర నూపురాద్యంగ భూషణ విభూషితం, ఋత్విక్సదస్య గృహపతయోఽధనా ఇవోత్తమం ధన ము పలభ సబహుమాన మర్హణేన అవనత శీర్షాణ ఉపతస్థుః"[1]

ఈ యంశమును గంగన యత్యంత సుందరమైన శైలిలో విల్లమవరిం యున్నాఁడు.

"అంత నావిష్కృతకాంత చతుర్భుజంబు
లును పీతాంబరంబు మ వెలుంగ
శ్రీవత్స కౌస్తుభ శ్రీరమా చిహ్నంబు
లురమందు రమ్యమై యరవు పడఁగ
శంఖచక్ర గదాంబుజాత ఖడ్గాది ది
వ్యాయుధంబుల పేతులందు మెఱయ
నతులిత నవరత్నహాటకాంకిత మూర్ధ
మున కిరీట ద్యుతుల్ గదల కొనఁగ
గర్ణకుండల కటిసూత్ర కనకరత్న
హార కేయూర వరనూపురాది భూష

---

1. శ్రీమద్భా 5 స్క–3 అ–3శ్లో.

ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు
దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్షమయ్యె

(5-43)

గంగన కావించిన యీ యాంధ్రీకరణమున మూలమున లేని "శ్రీరమా చిహ్నములు" అనియు "శ్రీనాయకుఁడు" అనియు సరసముగాఁ జేర్పఁబడినవి. నారాయణ పరబ్రహ్మము శ్రీదేవితో విశిష్టుఁడైయుండుట విశిష్టాద్వైతమున ముఖ్యాంశము. అట్టి సంప్రదాయ స్ఫూర్తి నొక్కచో గాదు రెండు తావులందిట్లు గంగన చేసియున్నాఁడు. మూల భాగవతమున లేని ఈ రమా ప్రస్తావమును సునిశితముగా విశిష్టాద్వైత మత సంప్రదాయము నెఱిఁగియే-పోతన వలె తత్సంప్రదాయప్రీతితో గంగన కావించెనని నా యభిప్రాయము. ఈ వ్యాసమున "భాగవతావతరణ వృత్తాంతము" అను రెండవ యధ్యాయమున పోతన గంగనాదుల కాలమునాటి కాంధ్రదేశమున విశిష్టాద్వైత మత వ్యాప్తి మిక్కిలిగా నుండినట్లు నిరూపింపఁబడినది. సహజసిద్ధమగు విష్ణుప్రీతియు, సమకాలికమైన విశిష్టాద్వైత వ్యాప్తి ప్రాప్తమైన దీప్తియుఁ, బోతన వంటి సాధునయ యుక్తుఁడు, భాగవత నైష్ఠికుఁడు నగు వానితోడి సాహచర్యమును గంగన సిద్ధ్యర్థమగు శ్రీతత్త్వ నిర్ణాయక పరిష్కారమును రెండు పర్యాయములు కావించునట్లు ప్రేరేపించినవని నిర్ణయించుట సత్య సమ్మతము కాఁగలదు.

10. షష్ఠ స్కంధము నాంధ్రీకరించిన సింగనయుఁ బోతన గంగనల మార్గముననే శ్రీ శ్రియఃపతుల దివ్య సాహచర్య వైభవమును శ్రీదేవితత్త్వమును విశిష్టాద్వైత సంప్రదాయ బద్ధముగా తన యనువాదమునఁ బ్రత్యేకాభినివేశముతోఁ బ్రదర్శించి యున్నాఁడు. ఈతని యీ శ్రీ తత్త్వ ప్రకటన ప్రీతిని, బరిశీలించి నప్పు డీతని యందు విష్ణుప్రీతియు, విశిష్టాద్వైత సంప్రదాయ పరిజ్ఞానము ను, కేవల పరిజ్ఞానమే కాక తన్మతమువట్ల నాభిముఖ్యమును వ్యక్తమగుచున్నది.

స్కంధారంభ మంగళ శ్లోకముననే—

"శ్రీవత్సాంకిత కౌస్తుభ స్ఫురిత లక్ష్మీదారు వక్ష స్థల
శ్రీవిభ్రాజితు"— (6-1)

ఇత్యాదిగా శ్రీమన్నారాయణ పరబ్రహ్మమునకు లక్ష్మీదేవితో గల నిత్య సాహచర్య స్థితి నభివర్ణించి శ్రీతత్త్వమును వ్యక్తము చేసినాఁడు. మఱియు శ్రీదేవి నిట్లు స్తుతించి యున్నాఁడు—

"విలక్ష్యంకణ రవరప
కలితంబగు వభయ వరద కరములు వెకయుం
జెలరేగి భక్తులకు నల
కలుముల దయసేయు నిందిరి కన్యకఁ దలఁతున్" (6-6)

ఇందు శ్రీదేవి యొక్క కారుణ్యము - నభయ ప్రదాయకత్వము - సంపత్ప్రదాయకత్వము నను గుణములు వివరింపఁబడినవి. శ్రియతే ఇతి శ్రీః అని సంప్రదాయ వేత్తలు చెప్పు నర్థమునకు సింగన చేసిన వివరణమిది. భక్తులచే నాశ్రయింపఁబడి వారి కభయము - వరములు - కలుములు ప్రసాదించి రక్షించు నను నర్థమున సింగన యీ పద్యమును విన్యసించియున్నాఁడు.

11. షష్ఠ స్కంధమున యజామిళోపాఖ్యానమున సింగన విశిష్టాద్వైత సంప్రదాయ ప్రావణ్యముతో - యమధర్మరాజు తన దూతలతోఁ బలికిన పలుకులలో శ్రీతత్త్వమును బ్రతిపాదించి యున్నాఁడు.

యముఁడు తన దూతలతో భాగవతేతరులను బట్టి తెండని పలుకు పట్టమున సమూలకముగా శ్రీదేవీ ప్రస్తావమును స్వతంత్రముగాఁ జేసియున్నాఁడు.

"ఏక నక్కమున నైన నిందిరా రమణునిఁ
బలుకంగ లేని దుర్భాషితులను
గలలోననైన శ్రీకాంతుని పద్మాద
కమలముల్ సూడని కర్మదృకుల
నవ్వుచు నైనఁ గృష్ణ ప్రశంసకుఁ జెవిఁ
దార్చ నేరని దుష్కృతా ప్రపణుల
యాత్రోత్సవమునైన నీశుని గుడి త్రోవఁ
ద్రొక్కఁగ లేని దుష్పదులను
బరమ భాగవతుల పాదధూళి సమస్త
తీర్థ సారమనుచుఁ దెలియలేని
వారి వారి వారి వారిఁ జేరిన వారిఁ
దొలఁగఁ గట్టి తెండు దూతలార" (6-188)

ఈ పై పద్యమునందు - ఇందిరా రమణుఁడని - శ్రీకాంతుఁడని - రెండు తావులందు మూల గ్రంథమున లేకపోయినను స్వీయ కల్పనచే నిట్లు పేర్కొనుట

(షడక్షర, న్యాయమునఁ జెప్పఁబడినవిగాక) సంప్రదాయము నెఱిఁగియే - హృదయపూర్వకముగనే సింగన భావించెనని నా యభిప్రాయము. ఇట్లు శ్రీ తత్త్వమును వెల్లడించుట భాగవతాంధ్రీకర్తలందఱకు సామాన్య స్వభావము.

12. షష్ఠ స్కంధమున ప్రచేతసుల వృత్తాంతమున సింగన యమూలకముగా నారాయణుతో నపృథక్సిద్ధయు, మోక్షప్రదాన సమయమున శ్రీమన్నారాయణునితో గూడి భక్తుల ననుగ్రహించునదియునగు శ్రీదేవి యొక్క తత్త్వమును - పోతన గంగనాదుల రీతిలో సింగన వ్యక్తీకరించి యున్నాఁడు. ఇట్లు శ్రీ విశిష్టుఁడగు నారాయణ పరబ్రహ్మమును సింగన సమయము కలిగినప్పుడెల్ల సమూలకముగా వర్ణించు నని చెప్పుటకు వీలు కలిగించు పట్టమిది—

పృథమునను గాల్చుచున్న ప్రచేత సుపుత్రులతోఁ బ్రంద్రుఁడు పలికిన పలుకులు మూల భాగవతమున నిట్లున్నవి

"అంతర్దేహేషు భూతానా మాత్మాస్తే హరి రీశ్వరః।
సర్వం తద్ధిష్ణ్య మీక్షధ్వ మేవం వస్తోషితో హ్యసౌ॥"[1]

ఈ మూల శ్లోకములోని భావమును సింగన యిట్లనువదించినాఁడు—

"అఖిల భూతముల దేహాంతస్థమగు నాత్మ
యీశుఁడచ్యుతుఁడని యెఱుఁగ వలయు
నెఱిఁగి సర్వంబైన యిందిరారమణులోఁ
జూపులు తనరిగాఁ జూడ వలయు" (6-201)

ఈ సింగన యనువాదమున నారాయణుఁడే పరబ్రహ్మమనియు - నతఁడిందిరా రమణుఁడనియు వ్యక్తీకరించియున్నాడు. ఈ యిందిరా రమణత్వమును మూలమున లేకుండ విశిష్టాద్వైత సంప్రదాయమున ముఖ్యాంశమని యెఱిఁగియే సింగన ప్రయోగించి యున్నాఁడని నా యభిప్రాయము.

13. షష్ఠ స్కంధమున వృత్రాసుర వృత్తాంతమున సింగన మూలమున లేక పోయినను శ్రీతత్త్వమును మహావిశేషముతోఁ దనయనువాదమున వివరించి యున్నాఁడు -

వృత్రాసుర వృత్తాంతమున దేవతలు శ్రీమన్నారాయణుని శరణువేఁడి స్తుతింపగా నతఁడు ప్రత్యక్షమైన సందర్భమున మూలమున గల శ్లోకము లివి—

---

1. శ్రీమద్భా 6స్క - 4 అ - 13 శ్లో.

ఇతి తేషాం మహారాజ సురాణాముపతిష్ఠతామ్ ।
ప్రతీచ్యాం దిశ్యభూదావిః శంఖ చక్ర గదా ధరః ॥
ఆత్మతుల్యైః షోడశభి ర్వినా శ్రీ వత్స కౌస్తుభౌ ।
పర్యుపాసిత మున్నిద్ర శరదంబురుహేక్షణమ్ ॥[1]

ఈ శ్లోకము అందు శంఖ చక్ర గదాధరుఁడు-శ్రీ వత్స కౌస్తుభములు తప్ప తక్కిన లక్షణములతో నున్న పదునార్గురతో గూడి ప్రత్యక్షమైనాఁడని శ్రీమన్నారాయణుని గూర్చి చెప్పఁబడినది.

ఈ శ్లోకమునకు పింగన గావించిన యనువాదమున మూలమున లేకపోయి నను శ్రీదేవిని గూర్చి ప్రస్తావము గావింపఁబడినది. పింగనయను వాద పద్యమిది—

తగు శంఖచక్ర గదా ధరుండగువాని
శ్రీవత్స కౌస్తుభ శ్రీలవానిఁ
గమనీయ మాణిక్య ఘన కిరీటము వాని
దివ్య విభూషణ దీప్తివాని
మండిత కేయూర కుండలంబుల వాని
సిరి యుర స్స్థలమునఁ జెలఁగు వాని
దనుబోలు సేవక దండంబు గలవాని
జిలుగైన పచ్చని వలువ వానిఁ
దెల్లదమ్మిరేకులఁ దెగడు కన్నుల వాని
నవ సుధాద్రవంబు నవ్వు వాని
గనియె వేర్పు పిండు కప్పర పాటుతోఁ
గన్నులందు నున్న కఱవుతీఱ" (6–332)

ఈ యనువాదమున పింగళి విష్ణుమూర్తి దివ్యమంగళ స్వరూప వర్ణనముతో పాటు లక్ష్మీదేవిని గురించి పైతము ప్రస్తావించి యున్నాఁడు. ఇందుకు మూలమున నాధారము లేదు. శ్రీదేవీ సాహచర్యము తోడనే నారాయణునకుఁ బరబ్రహ్మత్వ పరిపూర్తి యనెడు విశిష్టాద్వైత సంప్రదాయము నెఱిఁగియే మూలమున లేకున్నను— "సిరియుర స్థలి జెలఁగువాని"నిగా నారాయణుని వర్ణించి తన సంప్రదాయ పేక్షత్వమును పింగన వెల్లడించిన వాఁడాయెను తరువాత పద్యమున పైతము—

1. శ్రీమద్భా 6స్క - 9 అ - 28, 29 శ్లో.

"ఎల్ల లోకములకు నిలైన భాగ్యంబు
గాపురంబుండెడి కమల దేవచ" (6 - 333)

అని శ్రీదేవి ప్రస్తావమును చేసియున్నాఁడు.

ఈ నిర్వహణమును సింగన యిచ్ఛాపూర్వకముగాఁ గావించి యున్నాఁడని నా యభిప్రాయము.

14. ఏకాదశ ద్వాదశ స్కంధముల నాంధ్రీకరించిన నారయయు శ్రీదేవి విశిష్టమగు నారాయణ పరబ్రహ్మ స్వభావమును వివరించియున్నాఁడు. పోతనాదుల వలె విష్ణుప్రీతియు, విశిష్టాద్వైతాను రక్తియుఁ బ్రదర్శించుచు శ్రీ తత్త్వమును బక్కాగా వెల్లడించియున్నాఁడు.

ద్వాదశ స్కంధమున శుకయోగి భాగవత గాథను వివరించి పరీక్షిత్తుతో మన వంహార వాక్యములను బలుకు సందర్భమున మూలమగు శ్రీమద్భాగవతమున నిట్లు కలదు -

1) "త్వంతు రాజన్ మరిష్యేతి పశుబుద్ధి మిమాం జహి।
న జాతః ప్రాగ భూతో – ద్య దేహ వత్త్వం నవఙ్క్ష్యసి॥

2) న భవిష్యసి భూత్వాత్వం పుత్రపౌత్రాది రూపవాన్।
బీజాఙ్కురవ ద్దేహాదేర్వ్యతిరిక్తో యథానలః॥[1]

నారయ యీ శ్లోకముల ననువదించుచు —

"ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము, సంభవంబుగల మానవ కోట్లకు చావు నిత్యమౌ
గాన హరిం దలంపుమికఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు మాధవలోక విశాలసౌఖ్యముల్" (12 - 25)

అని మాధవలోక ప్రసంగముఁగావించియున్నాఁడు. ఈ పద్యము విశేషించి విశిష్టాద్వైతమత సమ్మతములగు పెక్కుభావములతో భాసించుచు-నొక విధముగ భాగవతరచనా ప్రణాళికకు నిది ముగింపు పలుకుగా నున్న కారణమున దీనియందు నారయ "మాధవుఁడు" అని శ్రియః పతిత్వమును శ్రీమన్నారాయణున కాపాదించుట సంప్రదాయ ప్రీతితోడను-ల సంప్రదాయమును పరిపాలింపవలయునను పట్టుదల తోడను నని నా యభిప్రాయము.

---

1. శ్రీమద్భా 12స్క -5 అ-2, 3 శ్లో

భగవద్రామానుజులు విశిష్టాద్వైత మత ప్రదర్శనమున మణి దీపమువంటి తమ "వైకుంఠగద్య"లో శ్రీదేవి వైకుంఠలోక వాసులగు శేష గరుడాది భాగవతులను దమ తమ కైంకర్యాది విధులందు నియమించి పాలించుచుండగాఁ జేర్కొనియున్నారు- అవర్ణనమిది —

"శ్రీమ ద్వైకుంఠై శ్వర్యాది దివ్యలోకం విశ్వం ఆత్మకాన్త్యా ఆప్యాయయన్త్యా, శేష శేషాశనాది సర్వ పరిజనం భగవతః తత్తదవ స్థోచిత పరిచర్యాయాం ఆజ్ఞాపయన్త్యా శీల రూప గుణ విలాసాదిభిః ఆత్మానురూపయా శ్రియా సహ ఆసీనమ్"[1]

ఇత్యాదిగా నీ విషయము వివరింపఁబడియున్నది

ఈ రామానుజాచార్యులవారి వర్ణనమును బాగుగా నెఱిఁగియే మూలమున లేకపోయినను స్వేచ్ఛ వహించి శ్రీ వైకుంఠమును "మాధవలోకము" అని లక్ష్మీపతిత్వ సూచకమగు సమాసముచే సూచించి తన "ముచ్చటఁ" దీర్చుకొనినాఁడు నారయ.

మూలమున లేకపోయినను నారయ ఈ విధమగు సంప్రదాయ సూచకమగు ప్రయోగము చేసియుండుట చేతను, నారయ విశిష్టాద్వైతియే యని పలువురు విమర్శకులు భావించియుండుట చేతను, నాతని యనువాదమునఁ జెప్పఁ విశిష్టాద్వైత సమ్మతములగు సంస్కారములు గోచరమగుచుండుట చేతను- ఈతని సహచరులగు గంగన, సింగన మఱియు నీతని గురువుగాఁ బలువురు విమర్శకులచేఁ జేర్కొనఁబడిన పోతనయు నిట్టి శ్రీతత్త్వ నిర్వహణమును సంప్రదాయ బద్ధముగా విష్ణు ప్రీతితో- విశిష్టాద్వైతానురక్తితోఁ గావించి యుండుట చేతను పై పద్యమున నారయ "హృదయ పూర్వకముగనే" విష్ణు ప్రీతితో - విశిష్టాద్వైతానురక్తితో-శ్రీవైష్ణవ సంప్రదాయ పాలనము చేయవలయునను నభినివేశముతో నీ విధమగు ననువాదము కావించెనని నాయభిప్రాయము. ఇందులకా కాలము నందలి సహజ పరిస్థితులు దోహదము గావించి యున్నట్లు పూర్వమే పేర్కొనఁబడినది.

ఈ విధముగ భాగవత కవులు పోతన, గంగన, సింగన, నారయ యనువారు నల్వురు "విశిష్టాద్వైత దర్శనమున" విశిష్ట స్థానము నాక్రమించిన శ్రీతత్త్వమును దమ యనువాదమునఁ విపులముగాఁ బ్రదర్శించి తమ సంప్రదాయానురక్తిని వెల్లడించినారని చెప్పవచ్చును.

1. శ్రీ వైకుంఠ గద్య.

మఱియు సమూలకముగను, సమూలకముగను భాగవతమున శ్రీదేవికి శ్రీమన్నారాయణుని తోడి సంబంధము తత్పరత్వముతో వెల్లడింపఁబడినది. ఇట్లు నారాయణుఁడే పరబ్రహ్మమని వ్యవహరింపఁబడిన కావున నాతనికి శ్రీదేవి నిత్య సాహచర్య సంబంధము విశిష్టాద్వైత సంప్రదాయము కాఁగల్గదు కావున నట్టి యుదాహరణములు "ఆంధ్రభాగవతము విశిష్టాద్వైత పరముగా ననువదింపఁబడినదనుటకుఁ జెప్పఁదగు నిదర్శనములు కలవు"-అను నభిప్రాయమును సమర్థింపఁగలవు. మఱియు భాగవతాంధ్రీకర్తలు విష్ణు ప్రీతియు-విశిష్టాద్వైతాను రక్తియుఁ గలవారనుటను గూడ నిర్ధారణ చేయఁగలవు.

ఆంధ్ర భాగవతమునఁ జెప్పఁదావులందు గోచరించు శ్రీతత్త్వ సూచకము లగు నుదాహరణములలో దిగ్దర్శనార్థము కొన్నింటినిచ్చటఁ బేర్కొందును.

1. "కోరెదు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి
   ప్రార్థించె నెవ్వని పాదరజము" (1-451)
2. ..... "లక్ష్మి
   సంభావనములు వాసుదేవ పద సేవనముల్" (1-445)
3. "చిరశుభాకార ! యిందిరా చిత్తచోర !" (3-423)
4. "లక్ష్మీనాథ ! దేవోత్తమా !" (3-431)
5. . నీ పొనర్చు పెం
   పలరిన కార్యముల్ నరఁప నన్యులకుం దరమే రమేశ్వరా" (3-433)
6. "ఇందిరాధీశ్వర" (3-436)
7. "లక్ష్మీమహిళాధి నాథ" (3-490)
8. శ్రీరమణీశ్వరు పదాబ్జసేవా నిరతిన్ (3-503)
9. "నిత్యానపాయిని యైన యిందిరా సుందరీరత్న పరిష్వంగంబునం దనరు" (4-711)
10. "చిర దయా కార నిత్యలక్ష్మీ విహార" (3-753)
11. ... .... ఇందిరా
    "వరుఁ దల పోయుచుంటె జనవంద్యుఁడు భక్తినితాంత చిత్తుఁడై" (3-761)
12. "సదా నపాయిని సాగర కన్యక" (4-586)
13. "ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ దప్పటి వారల నాదరించి" (5-1అ-98)
14. "లక్ష్మీకాంతుని సంతుష్ట స్వాంతుం జేయువాఁడై" (6-2 0)
15. "లక్ష్మీ సమేతుండగు" (11-103)

# 7వ అధ్యాయము

## "భాగవతోపాఖ్యానములు - విశిష్టాద్వైత సమన్వయము"

శ్రీమద్భాగవత మహాపురాణము శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని, శ్రీకృష్ణుడా నారాయణుఁడేయని, మోక్షప్రదాత యాతఁడే యని, యాతనిలో భక్తులు కోరుకొనఁదగిన యనేక కల్యాణగుణములు కలవనియు, శ్రీమన్నారాయణుఁడు భక్తపాలన కళానిపుణుఁడనియు, భక్తియే యాతనిఁ గృపను బొందుటకు సాధనమనియు, సర్వశక్తిమంతుఁడగుటచే భక్తుల నెట్టి స్థితిలో నైనను గాపాడఁగలఁడని ప్రబోధించినది.

ఈ ప్రబోధము ననేకోపాఖ్యానముల సాయమున భాగవతము విశదము కావించినది. అట్టి యుపాఖ్యానము లీ భాగవతమున ననంఖ్యాకములుగా నున్నవి. అందుకొన్ని "ఉపక్రమోపసంహారాది సమన్వయము"న మనవర్తియను నంశము నందు వివరింపఁబడినవి. ప్రస్తుతాధ్యాయమున స్థాలీ పులాకన్యాయమునఁ గొన్ని ముఖ్యములగు నుపాఖ్యానములను బరిశీలించి యందు విశిష్టాద్వైత సిద్ధాంత మేవిధముగాఁ బ్రతిపాదింపఁబడినదో వివరింతుము.

### 1. అజామిళోపాఖ్యానము

మోక్షము శ్రీమన్నారాయణ పరాయణులకేగాని తదితరులకుఁ గాదని తెలుపునట్టి దీ యుపాఖ్యానము. శ్రీమన్నారాయణుఁడే మోక్షప్రదాతయనియుఁ, దదాప్తి ముఖ్యమునకు భక్తియే యుపాయమనియు నీ యుపాఖ్యాన సారాంశము. ఇట్లీ యుపాఖ్యానము పెక్కు విశిష్టాద్వైత మతసంబంధులగు సంప్రదాయాంశములను ప్రదర్శించునది. ఆ యంశముల వివరణమిది—

## 1. శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మము

యమకింకరులు విష్ణుకింకరులచేఁ బ్రత్యాఖ్యాతులై యముని కడకేగి జరిగిన వృత్తాంతము వివరింపగా నతఁడు వారితో శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని పేర్కొనియున్నాఁడు. ఆ సందర్భము నందలి యీ క్రింది పద్యమును బరిశీలింతము —

"కలఁడు సదస్యుండు ఘనుఁడొక్కఁడతఁడెందు
వెలికిఁ గానఁగ రాక విశ్వమెల్ల
నతి లీలమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి
నుండును గోక నూలున్నభంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడి మాడ్కి
నామ సంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసిత మత్స్యాజ
లెవ్వని పదముల నివ్వటిల్లుఁ
గనుట వినుట చనుట కల్గు నెవ్వని లీల
నందు లోక మెవని యందుఁ బొందు
నెవ్వఁడడుచుఁ బరమి నెవ్వని నామముల్
గర్మబంధనములఁ బేర్మివడచు (6-169)

ఈ సందర్భమువనే తదితర దేవతల యవరత్వమును గూడ యముఁడిట్లు వివరించియున్నాడు—

"వినుఁడు నేను మహేంద్రుఁ డన్వతి పితిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరి సంయమి సిద్ధులున్
మొనసి కన్గొనఁజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తిమై (6-170)

మఱియు శ్రీమన్నారాయణుని తత్త్వము నెఱుఁగుటకు శివబ్రహ్మాదులకు సాధ్యముకాదని యిట్లు వివరించినాఁడు—

"ఎన్నఁడుఁ దెలియంగ నేరరు
పన్నగ పతిశాయి తత్త్వభావము మేనం
గన్నుల వేల్పుమ దావలఁ
జన్మమరణ వేల్పు ముదుక చదువుల వేల్పున్ (6-177)

ఇట్లీ షట్టమున శ్రీమన్నారాయణునితే నోత్రము నార్హమని నిరూపింపఁబడినది.

## 2. విష్ణుభక్తియే మోక్షహేతువు

యమకింకరులకు విష్ణుకింకరులు హరికీర్తనమును గూర్చి వివరించిన సందర్భమున విష్ణుభక్తి ప్రాశస్త్యమిట్లు వివరింపఁబడినది —

మహిత యోగోగ్ర నిత్యనమాది విధుల
నలరు బ్రహ్మాది సురలకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్యభోగభాగ్య
ఫలసంబులు హరినామ కీర్తనములు (6-118)

ఇట్లు స్పష్టముగా హరినామ కీర్తన రూపమగు భక్తియోగము మోక్షమునకుఁ గారణమని చెప్పఁబడినది.

ఆ సందర్భముననే—

"ముక్తి కాంతైకాంత మోహన కృత్యముల్
గేలిమై హరినామ కీర్తనములు (6-119)

అనియు —

"మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషిక్తముల్
గేలిమై హరినామ కీర్తనములు (6-119)

అనియు భక్తి యొక్క ప్రాభవము ప్రస్తుతింపఁబడినది.

అజామిళుఁడు విష్ణునామ స్మరణముచే మోక్షము నందినట్లు స్పష్టము చేయఁబడినది—

"అరయఁ బుత్రోపచారితమైన విష్ణు
నామ మవసాన కాలంబునను భజించి
శార్ఙ్గి నిలయంబుఁ జేరె నజామిళుండు
నిట్లు నద్భక్తి పలికిన నేమి సెప్ప (6-158)

యమధర్మరా జీవిషయమును నిర్ధారించుచు—

"పెనుదోసి యజామిళుఁ డంతమొందుచుం
బాటిఁగ విష్ణునామ సూతుఁ బల్కుచుఁగేవలముక్తి కేగఁడే" (6-182)

అని వర్ణించినాఁడు. మఱియు విష్ణుభక్తి విముఖులఁబట్టి తెంతను సందర్భమున

> "అరయఁ దనదు జిహ్వ హరిపేరు నుడువదు
> చిత్తమతని పాదచింతఁ జనదు
> తలఁపఁ దమకు ముక్తి తంగేటి జున్నొకో
> సకల విష్ణుభక్తులకును బోలె (6–190)

అని విష్ణుభక్తులందఱకు ముక్తి తంగేటి జున్నువలె సులభ సాధ్యమని చెప్పక చెప్పియున్నాఁడు.

ఆ వెను వెంటనే మఱింత విస్పష్టముగా భక్తియే ముక్త్యుపాయమని- పేర్కొని యున్నాఁడు —

> "పద్మనయను మీఁది భక్తి యోగంబెల్ల
> ముక్తియోగమనుచు మొదలెఱుంగు
> వారి వారి వారి వారిఁ జేరిన వారి
> ద్రోవఁ దలఁప వలదు దూతలార ! (6-191)

ఇట్లీ యజామిళోపాఖ్యానము భక్తి ప్రాశస్త్య ప్రబోధకము.

### 3. మోక్షము వైకుంఠలోక గమనమే

దేహమును విడచిన "ముక్త పురుషుఁడు" విలక్షణ రూపమును ధరించి, విష్ణు పార్శ్వచరులచే వైకుంఠలోకమునకుఁ దీసికొని పోఁబడుననియు, ఆ వైకుంఠలోకమున శ్రీమన్నారాయణ కైంకర్యానందమే మోక్షమనియు విశిష్టాద్వైత సిద్ధాంతము. తదనుసారమే యజామిళుఁడు గంగా తీరమున దేహమును విడిచి — "హరి పార్శ్వ వర్తులైన దానవరుల స్వరూపము" (6-155) దాల్చినట్లు విష్ణుసేవకులతోఁడంగూడి (6-155) వైకుంఠమునకుఁ బోయినట్లు వర్ణింపఁబడినది. మఱియు నజామిళుఁడు —

> "శ్రీమన్నారాయణ పదారవింద సేవాపరతా పరిణామ స్థితిం జనియె" (6-155)

అని విస్పష్టముగా విశిష్టాద్వైత ముక్తి స్వరూపము పేర్కొనఁబడినది. ఈ సందర్భముననే —

> "హా గ్గినిలయంబుఁ జేరె నజామిళుండు" (6–158)
> "దనుజారి లోకమందుండు మహావిభూతిఁగనియె" (6-158)

అనియు వర్ణింపఁబడినది. ఇది కేవలము విశిష్టాద్వైతము క్రియే. ఇట్లు వైకుంఠలోక గమన మే యను విశిష్టాద్వైత సిద్ధాంత సమ్మతమైన ముక్తి విధానమే యీ యుపాఖ్యానమున నుల్లేఖింపఁబడినది.

## 4. భాగవత వైభవము

విశిష్టాద్వైత సిద్ధాంతమున విశిష్ట స్థానము నాక్రమించిన "భాగవత నిష్ఠ" యీ యజామిళోపాఖ్యానమున ప్రముఖముగ వివరింపఁబడినది. భగవంతుని సేవ కంటె భాగవతుల సేవయే మిన్న యన్నది యీ సిద్ధాంతమున వన్నెకెక్కిన విషయము. భగవంతుఁడు తన్ను సేవించిన వారికంటె భక్తులను సేవించిన వారిపై మిక్కిలి మక్కువఁ గలిగి యుండునను నది విశిష్టాద్వైతుల తాత్పర్యము. అట్టి భగవద్భక్తి యుక్తుల వైభవ మీ యుపాఖ్యానమునఁ జక్కగాఁ జిత్రింపఁబడినది.

యమ శ్రీహరి కింకరుల వాదమును వినిన యజామిళుఁడు శ్రీ వైష్ణవ జ్ఞానము కలవాఁడై—

"భగవద్ధర్మ పరాయణోత్తముల సంభాషైక మంత్రంబులన్
మిగులన్ జ్ఞానముఁ బట్టి—" (6-152)

విష్ణుభక్తి పరీత స్వాంతుఁడైనట్లు వివరింపఁబడినది. మఱియు—

"హరి భక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడని పుణ్యధనముల మూటల్
పర ముక్తికాంత తేటలు
పరిషద్వర్గంబు సౌరని యరుదగు కోటల్" (6-153)

అని భాగవతులతోడి సంభాషణము యొక్క మహత వివరింపఁబడినది.

యముఁడు తన కింకరులతో- "విష్ణుభక్తులఁ గదియగఁ జనవలదు"(6-187) అనియు "పరమభాగవతుల పాదధూళి సమస్త తీర్థ సారమనుచుఁ దెలియలేని" (6-188) వారిని మాత్రము పట్టితెండను సందర్భమున భాగవతుల వైభవమును వర్ణించినాఁడు. మఱియు భాగవతుల లక్షణములను దన భటుల కిట్లు విశదముగా వివరించియున్నాఁడు —

"క్రుతక్వంత విక్రాంత మత్యమక్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
పనకాది మునియోగి జన వదానంపైత
పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యాన కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకావీత పరిభవ ప్రక్రియా
పరుషోగ్రమూర్తులు భాగవతులు
భావతత్త్వార్థ వేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
సిరులు దనరంగ నెప్పుడుఁజేటులేని
పదవి నొప్పారు వారు వో భాగవతులు

(6–187)

ఇట్టి లక్షణములన్నియు భాగవత మహాపురాణమున సందర్భము కలిగినప్పుడెల్ల వివరింపఁబడినవి. ఇట్టి భాగవతలక్షణ లక్షితులగు వారిపైఁ దనకుఁగల వాత్సల్యమును శ్రీమన్నారాయణునిచేఁ బెక్కు చోటులందు వ్యక్తము చేయించినది భాగవతపురాణము.

ఈ సందర్భముననే యముఁడు –

"హరి పేర్యంబుల నాకర్ణించు వారల చిత్తంబు లతి నిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులం గావనియు, శ్రీకృష్ణపదపద్మంబుల హృత్పద్మంబుల నిలుపువార లన్యపాప కర్మంబులగు నవిద్యావ్యపనంబు లంటొరయ నేర రనియు"—
పేర్కొని యున్నాఁడు. (6-192)

ఇట్లు పరిశీలింపగా భాగవతుల వైభవము నీ యుపాఖ్యానము స్పష్టముగా వివరించినట్లు చెప్పవచ్చును.

పైనఁ దేర్కొనినట్లు శ్రీమన్నారాయణుఁడే పరముఁడనియు నితరులు కారనియు - భక్తియోగమే ముక్తికి హేతువనియు - ముక్తియనగా వైకుంఠ లోక గమనమనియు - భాగవతుల సేవ యనంత మహామాన్వితమనియు - ఏ యజా

మిళోపాఖ్యానము వివరించబడెను. ఇవియన్నియు విశిష్టాద్వైత మతమున ముఖ్యాంశములు. అట్టి యంశములీ యుపాఖ్యానమునఁ బ్రత్యేకాభినివేశమున వివరింపఁబడినవి. అందుచే నీ యజామిళోపాఖ్యానము విశిష్టాద్వైతానుకూలముగా నిర్వహింపఁబడినదని చెప్ప నొప్పియున్నది.

## 2. అంబరీషోపాఖ్యానము

శ్రీమన్నారాయణుని భక్తవత్సలత్వ మీ యుపాఖ్యానమున ముఖ్యముగా వర్ణింపఁబడినది. భగవదనుగ్రహ పాత్రులగు భాగవతుల ప్రాధాన్యము గూడ విశేషముగా వివరింపఁబడినది.

ఈ యంబరీషోపాఖ్యానము విశిష్టాద్వైత మతమునఁ గడు ముఖ్యమగు సంప్రదాయాంశములను దెక్కింటినిఁ జక్కఁగా వివరించుచున్నది.

### 1. శ్రీమన్నారాయణ పారమ్యము.

అవక్రచక్ర పరాక్రమ త్రస్తుఁడైన దుర్వాసుఁ డాత్మ రక్షణార్థము బ్రహ్మను శరణువేడగా నాతఁడు శ్రీమన్నారాయణుని యొక్క పారమ్యము నిట్లు పేర్కొని నాఁడు—

"ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా
పతులు భృగుఁడు భూతపతులు శరము
లందు దాల్త మతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరి కార్యమతుల మనుచు"

(9—111)

తనను శరణువేడిన దుర్వాసునితో శంకరుఁడు నైతము బ్రహ్మ చెప్పిన విధముగనే—

"అట్టి నిఖిల నాథుని యాయుధ్ర శేషంబుఁ బొలఁగఁజేయ మాకు దుర్లభంబు"

(9-113)

అని చెప్పి తన యశక్తతను వెల్లడించియున్నాఁడు. ఈ ఘట్టము శ్రీమన్నారాయణుని పారమ్యమును నిరూపించుచున్నది.

## 2. శ్రీమన్నారాయణ పరబ్రహ్మముయొక్క కల్యాణగుణ గరిష్ఠత

విశిష్టాద్వైత మత సిద్ధాంతమున పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణుఁడు నిర్గుణుఁడు—నిర్విశేషుఁడు కాక హేయ గుణరహితుఁడు, కల్యాణ గుణ భరితుఁడు సవిశేషుఁడును.

శ్రోతనాదులచేఁ బ్రాచీనుఁడును - విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులలో నగ్రగణ్యులు నగు శ్రీ పిళ్ళ లోకాచార్యుల వారు తమ ద్రావిడ గ్రంథమగు తత్త్వత్రయమున—

"ఈశ్వరన్ అఖిల హేయ ప్రత్యనీకానన్త జ్ఞానానన్దైక స్వరూపనామ్, జ్ఞాన శక్త్యాది కల్యాణ గుణగణ భూషితామ్"[1]— ఇత్యాదిగా-'పరబ్రహ్మ' స్వరూపమును సూత్రీకరించియున్నారు. ఇట్టి భగవద్గుణములందు "కృప"—యను గుణ మంబరీషునివల్ల ప్రదర్శింపఁబడినది.

భగవంతుని కల్యాణ గుణములు మూఁడు తెగలుగా విభజింపఁబడినవి. 1) వాత్సల్యాదులు 2) శౌర్యాదులు, 3) జ్ఞానశక్త్యాదులు. ఇందు వాత్సల్యాదు లాశ్రితులను రక్షించుటలో నుపయుక్తములగును. శౌర్యాదు లాశ్రితుల యొక్క విరోధులను శిక్షించుటలో నుపయుక్తములగును. ఇఁక జ్ఞానశక్త్యాదులు 'అందఱివల్ల' నుపయుక్తములగును. అనగా వార్తానుగ్రహమునందు, దుష్టనిగ్రహమునందు జ్ఞానశక్త్యాదులుపయుక్తములగును.

ఇట్టి వానిలో నార్తులను రక్షించుటలో నుపయుక్తమగు కృప ప్రస్తుత మంబరీషుని వల్ల ప్రదర్శింపఁబడినది. కృపయనగా నితరుల దుఃఖమును జూచి సహింపలేకుండుట. అంబరీషునిపై గృపతో రక్షించుటకుఁ జక్రమును బంపినాఁడు నారాయణుఁడు.

## 3. భక్తవశ్యత.

దుర్వాసుఁడు బ్రహ్మమహేశ్వరులచేఁ దిరస్కరింపఁబడి తన యొద్దకు వచ్చినప్పుడు శ్రీమన్నారాయణుఁడు పలికిన పలుకు లాతని భక్తజన వత్సలతకు నిదర్శనములు —

1. తత్త్వత్రయము - ఈశ్వరప్రకరణము.

"వలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీలఁ దాం
గిలి కొని పోవఁజాలుదురు రకిల్బిష భక్తిలతా చయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదవంతులై వడిన్
వలలఁ జిక్కి భక్తజన వత్సలతం జనకుందు తాపసా!
(9-118)

ఇది భక్తుల విషయమునఁ దానవలంబించు విధానమును శ్రీమన్నారాయణుఁ డిందు వివరించి యున్నాఁడు. కావుననే దుర్వాసుఁడీ దైవమును "ఓ భక్తి రక్ష విద్యా వంశచంద్ర" (9-115) అని సంబోధించియున్నాఁడు. మఱియు నాతని భక్తజనప్రీతి స్పష్టముగా నిట్లు వ్యక్తము చేయఁబడినది —

1) "నాకు మేలు గోర నా భక్తులకు దాని
భక్తజనుల కేను పరమగతియు
భక్తుఁ డెందుఁ జనినఁ బరితెంతు వెనువెంట
గోవు వెంటఁ దగులు క్రేపు భంగి" (9-119)

2) "సాధుల హృదయము నాది
సాధుల హృదయంబు నేను జగముల కెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధులెఱుంగుదురు నాదు చందము విప్రా" (9-123)

ఇట్లు భక్తజనులకు వశమై యుండునట్టి శ్రీమన్నారాయణ పరబ్రహ్మము యొక్క తత్త్వ మీ యుపాఖ్యానమున వెల్లడింపఁబడినది.

## 4. భాగవత వైభవము.

భగవంతుని కృపకు పాత్రులై భక్తవశంవదుఁడగు నాతని ప్రీతికి హేతుభూతులగు పరమ భాగవతుల భవ్యమాహాత్మ్య మీ యంబరీషోపాఖ్యానమున నిరూపింపఁబడినది.

శ్రీమన్నారాయణ పరాయణుఁడగు నంబరీషుని పై నకారణముగా నలిగిన దుర్వాసుని బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు రక్షింపఁజాలరైరి. చివర నా యంబరీషుఁడే యాతనికి రక్షకుఁడాయెను.

"మంగళ కీర్తిపాము హరి విష్ణుని దేవదేవేశునిన్
అకలంక స్థితిఁ గొల్చు భక్తులకు లే పద్ధంబు" (9–142)

అని యీ యుపాఖ్యానము యొక్క పిండితార్థము. స్వయముగా శ్రీమన్నారాయణుఁడే తన యాంతర్యమును దనకు భక్తజనులతోఁగల బాంధవ్యమును —

"తనువు మనువు విడిచి తనయులఁ జుట్టాల
నాలి విడచి సంపదాలి విడచి
నన్నుఁ గాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టి వారినైన" (9 - 121)

అని వివరించియున్నాఁడు.

నారాయణ పరాయణుల నిర్భయత్వము, వారికి తన రక్షణమును భగవంతుఁ డిట్లు ప్రకటించియున్నాఁడు—

"నా పేఁడము సాధులలో
నా తతమై యుండు వారి నలఁచు జనులకున్
హేతిక్రియ ఫలి నిచ్చుం
జేతో మోదంబుఁ జెఱచు సిద్ధము సుమ్మా" (9-125)

ఇట్లీ యుపాఖ్యానమున భగవ ద్దాసానుభావము—వారికిఁగల భగవదను గ్రహమును వివరింపఁబడినవి.

## 5. వర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానము

వర్ణాశ్రమోచిత కర్మానుష్ఠాన సహితమగు భక్తి రూపాపన్నమగు ధ్యానము చేతనే శ్రీమన్నారాయణుఁడు సంతసించి ముక్తి నొసఁగునను విశిష్టాద్వైత సిద్ధాంత మీ యంబరీషోపాఖ్యానమున సమగ్రముగా సమర్థింపఁబడినది.

భగవద్రామానుజులు తమ వేదార్థ సంగ్రహమున— "సర్వైః కర్మభిరారాధితః పరమేశ్వరః భగవాన్నారాయణః తత్తదిష్టం ఫలం దదాతీతి వేదవిదో వదన్తి"

అనియు— ... "తదుపాసనాది విహిత కర్మానుష్ఠాయినః తత్ప్రసాదాత్త త్ప్రాప్తి పర్యన్తాని సుఖాని అధయంచ యథాధికారం భవన్తి"

అనియు "ఇతిహాస పురాణేషు సర్వేష్వేవ వేదేషు వర్ణ్యాని కర్మాణి సర్వేశ్వ రారాధన రూపాణి, తైస్తైః కర్మభిరారాధితః పురుషోత్తమః తత్తదిష్టఫలం దదాతీతి తత్రతత్ర ప్రపఞ్చితమ్"—

అనియు — పేర్కొనియున్నారు.[1]

దీనిని బట్టి శ్రీమన్నారాయణు నారాధించుటకు వారిని నానంద పరచుటకు వర్ణాశ్రమాచారపరులై భక్తితో సేవించుటయే జనుని కర్తవ్యమని భగవద్రామానుజ సిద్ధాంతముగాఁ దెలియుచున్నది

ఇట్టి రామానుజ సిద్ధాంతానుకూలమైనదే మన యంబరీషుఁ డొనర్చిన ద్వాదశి వ్రతము. విశిష్టాద్వైత సిద్ధాంతోక్తమైన స్వవర్ణోచిత కర్మాచరణముతో గూడిన యంబరీషుని పరభక్తి రూపావన్నమగు వేదనా మాతని నిత్యవర్తనమున నిట్లు వ్యక్తము చేయబడినది.

"చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద
వలుకులు శ్రీహరి పఠనమంద
కరములు విష్ణు మందిర మార్జనములంద
శ్రవములు హరికథా శ్రవణమంద
చూపులు గోవింద రూప వీక్షణమంద
శిరము కేశవ నమస్కృతుల యంద
వదము లీశ్వర గేహ పరిసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద
సంగమచ్యుత జన తను సంగమంద
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రికమల మంద
రసన తులసీదళములంద రమణి పుణ్య
సంగతుల యంద యారాజ చంద్రునకు" (9-82)

ఏతా దృశ్య పుణ్య వర్తనమును — వసిష్ఠాదుల గూడి సరస్వతీ తీరమున వాజి మేధములు చేయుటయును, "విహిత రాజవృత్తి విడువక" "రాచ తపసిగా" నుండుటయు — నివి యంబరీషుని వర్ణాశ్రమ కర్మ నిష్ఠాయుక్తమగు భక్తి

1) వేదార్థ సంగ్రహః.

భావమును సూచించుచున్నవి. అతని భక్తి భావ బంధురమైన భవ్య భాగవత లక్షణమిట్లు వర్ణింపఁబడినది.

"హరి యని సంభావించును
హరి యని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరి యని పనిఁ గొనదలఁచును
హరి హరి యను నంబరీషు నలవియె పొగడన్" (9-86)

దృశ్యమానమగు విశ్వమంతయు 'చిదచిద్విశిష్టుఁడగు' శ్రీమన్నారాయణుని శరీరమే యనునది విశిష్టాద్వైతుల నిర్వాహము. తదనుగుణముగా నంబరీషునకు సర్వ ప్రపంచమునందు నా దైవమే గోచరించుచున్నట్లు పేర్కొనఁబడుట గమనింపఁదగిన యంశము.

## 6. దివ్యాయుధ ప్రసంగము

అంబరీషోపాఖ్యానమున శ్రీమన్నారాయణుని దివ్యాయుధ రాజమగు చక్రము యొక్క ప్రసంగము ప్రముఖముగాఁ బ్రస్తావింపఁబడినది. ఇట్టి దివ్యాయుధ కలితత్త్వము విశిష్టాద్వైత సిద్ధాంతమున ముఖ్యము—పారమార్థికము.

## 7. ముక్తి విధానము

ఉపాఖ్యానమునకుఁ గట్టకడపట నంబరీషుఁడు కుమారునకు రాజ్యము నిచ్చి యడవులకేగి కామాదుల గెలిచి విష్ణు సాయుజ్యమును బొందినట్లు పేర్కొనఁబడినది. ఈ వర్ణనము విశిష్టాద్వైత సంప్రదాయ సమ్మతమైన ముక్తి విధాన కథనమే.

ఇట్లే యంబరీషోపాఖ్యానము పెక్కు విశిష్టాద్వైత సంప్రదాయాంశములను వివరించుచున్నది.

# 3. ప్రచేతసులకు రుద్రుండు తత్త్వము నుపదేశించిన వృత్తాంతము

విశిష్టాద్వైత సిద్ధాంతమును వ్యాఖ్య నొనర్చిన ఘట్టములలో నిది యొకటి. భాగవతుల వైభవ మిందు స్వయముగా రుద్రునిచేఁ ప్రచేతసులకు వివరింపఁబడి నది. చతుర్థ స్కంధము లోనిదిది.

ప్రాచీన బర్హికి శతధృతి యను భార్యవలన పదుగురు కొడుకులు జన్మించి ప్రచేతసులను పేర వ్యవహరింపబడిరి. ప్రజా సర్గమునకుఁ దండ్రిచేత నాజ్ఞాపింపఁబడి తపస్సు చేయుటకు వనములకుఁ బోవుచుండగా వారికి రుద్రుఁ డెదురు పడి శ్రీమన్నారాయణ తత్త్వమును భాగవతుల వైశిష్ట్యమును వివరించి శ్రీహరి స్తోత్రమును వారికి బోధించెను ఈ సందర్భముననే —

> "సూక్ష్మముఁ ద్రిగుణాత్మక
> ము నగు నా ప్రకృతి కంటెను ధరణిపైఁ
> బరఁగు జీవుని కంటెఁ బరుఁడైన వాసుదే
> వుని చరణాబ్జముల్ దనరు భక్తి
> నర్థి నెవ్వరు భజియింతు రట్టివారు
> నాకుఁ బ్రియతముల్ వారికి నయ చరిత్రు
> లార యేను బ్రియుఁడనై భూరి మహిమ
> వెలయ చుందును" — (4-698)

అని వాసుదేవ భక్తుల పట్లఁ దనకుఁ గల యాసక్తిని వెల్లడించి తన భాగవత జనాభిముఖ్యమును ప్రకటించినాఁడు రుద్రుఁడు.

రుద్రుఁడు విపరించిన ముక్తి విధానము విశిష్టాద్వైత సంప్రదాయ విధేయము. రుద్రుఁడు ప్రచేతసుల కిట్లు చెప్పియున్నాఁడు —

"స్వధర్మ నిరతుండైన పురుషుండనేక జన్మాంతర సుకృత విశేషంబులం జతుర్ముఖత్వంబు నొంది తదనంతరంబునం బుణ్యాతిరేకంబున నన్నుం బొంది యతి కాలాంతంబున నేనును దేవతా గణంబులును నవ్యాకృతంబైన యే హరిపదంబును బొందుదు మట్టి పదంబు భాగవతుండు తనంతనే పొందును గావున మీరు భాగవత తత్త్వంబు నొందుటం జేసి నాకుం బ్రియంబు ఘటియింపుడు" (4–699)

అని రుద్రుని ప్రబోధము. ఇందు వలన హరి పదమును బొందుటకు భాగవతులే యుత్తమాధికారులని బోధించిన వాఁడాయెను.

"భాగవత జనంబులకు నాకంటె నధిక ప్రియుఁడు లేఁడు"— (4-699)

అని స్పష్టముగా ఈ సందర్భమునందే భాగవతజనులతోడి తన ఋణానుబంధమును విస్పష్టముగా వెల్లడించినాడు.

అటు పిమ్మట వారికి — 'సర్గాదిని బ్రహ్మ నిజనందనుల కెఱింగించిన శ్రీహరి స్తోత్రంబును' - ఎఱింగించినాఁడు. ఏతత్స్తోత్రోపదేశాంతమున "భగవదర్పితాశయులై" - "వాసు దేవ పరాయణులై" "శ్రీహరింబూజించువాఁడు" శ్రీమన్నారాయణుని వలన సమస్తాభీష్టములను బొందుదురని రుద్రుఁడు వివరించియున్నాఁడు. (4-732)

ఆ ప్రచేతసులు రుద్రాదేశముచే మహోగ్ర తపము చేసినారు. వారి తపస్సునకు మెచ్చి శ్రీహరి ప్రత్యక్షమై "మారిష" అను కన్యను వారందఱు వివాహమాడవలసినదిగా నాజ్ఞాపించెను. ప్రచేతసులు సంతోషించి - "భాగవత సంగతిని" — వరముగా వేడిరి. శ్రీహరి వారు కోరిన వరము నొసఁగెను. ప్రచేతసులు ధరణీ - రుహముల వలన మారిష యను కన్యను బొంది వివాహము చేసికొని దక్షుఁడను పుత్రునిఁ బొందిరి. వారి యొద్దకు నారదుఁడు వచ్చి నారాయణ మాహాత్మ్యమును వివరించి రుద్రాదిష్ట మార్గమున శ్రీహరి నారాధింపుడని బోధించెను. వారట్లు గావించి ముకుంద చింతనా నిరంతర భక్తిని బొంది హరి నిత్య పదమును బొందిరి.

ఈ ఘట్టమున వర్ణితములైన ముఖ్యాంశము లివి —

1. ప్రాచేతసులు భాగవతులతోడి సంసర్గమును గోరుకొనుట.
2. రుద్రునిచే శ్రీమన్నారాయణ మాహాత్మ్యము వివరింపఁబడుట.
3. నారదునిచే నారాయణ భక్తియే ముక్తి హేతువని బోధింపఁబడుట.
4. నారాయణ భక్తిచేతనే ప్రచేతసులు ముక్తియగు "విష్ణు పదమును" బొందినట్లు పేర్కొనఁబడుట.

ఇట్లీ ప్రచేతసుల వృత్తాంతము - శ్రీమన్నారాయణ పారమ్యమును, భక్త్యుపాయ వైభవమును, భాగవత నిష్ఠయొక్క వైశిష్ట్యమును జాటి తెల్పుచు విశిష్టాద్వైత సిద్ధాంతమున కనుకూలముగా నిర్వహింపఁబడి యున్నది.

# 4. కుచేలోపాఖ్యానము

కుచేలోపాఖ్యానము భగవంతునియందలి భక్తి సులభత్వమును భక్తిస్వరూప మును విశదీకరించునది

భగవద్గీతలోని యొక శ్లోకమునకీ పట్టము కరా రూపమగు వివరణముగాఁ దోచుచున్నది. ఆ శ్లోకమిది

"పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।[1]
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥"

దీనికి భగవద్రామానుజుల వ్యాఖ్యా వాక్యములివి —

"సర్వ సులభం పత్రం వా పుష్పం వా ఫలం వా తోయంవా
యో భక్త్యా మే ప్రయచ్ఛతి-అత్యర్థ మత్ప్రియత్వేన
తత్ప్రదా నేన వినా ఆత్మధారణమలభమాన తయా
తదేక ప్రయోజనో యోమే పత్రాదికం దదాతి, తస్య
ప్రయతాత్మనః తత్ప్రదానైక ప్రయోజనత్వరూప
శుద్ధియుక్త మనసః, తత్-తథావిధ భక్త్యుపహృతం,
అహం-సర్వేశ్వరో నిఖిల జగదుదయ విభవలయ
లీలో_వాప్త సమస్త కామ స్సత్య సంకల్పో-ఽనవధికా-
తిశయా సంఖ్యేయ కల్యాణ గుణగణః స్వాభావి
కానవధి కాతిశయానంద స్వానుభవే వర్తమానోఽపి
మనో రథపథ దూర వర్తి ప్రియం ప్రాప్యేవాశ్నామి—"[2]

ఈ వ్యాఖ్యాన సారాంశమిది—

సర్వ సాధారణములైన పత్ర పుష్పాదులనైనను ననన్య భక్తితో నొసఁగినచో సకలమునకుఁ బ్రభువు, పరబ్రహ్మము నైన నారాయణుఁడు గొప్పగా సంతోషించును-అని. ఇట్టి భగవదభీష్టమును సౌలభ్యగుణవైభవమును నిపుణముగా నిరూపించు నుపాఖ్యాన మీ కుచేలుని కథ.

తన యింటికి వచ్చిన కుచేలునితోఁగృష్ణుఁడు పలికిన పలుకులివి—

"కిముపాయన మానీతం బ్రహ్మన్మే భవతో గృహాత్।
అణ్వప్యుపాహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మేభవేత్॥
భూర్యప్యభక్తోప హృతం నమే తోషాయ కల్పతే।

---

1 భగవద్గీత 9-4.

2. శ్రీమద్గీతాభాష్యమ్ (రామానుజభాష్యము) 9-4

పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యు పహృత మశ్నామి ప్రయతాత్మనః॥[1]

ఈ ప్రసంగమునం గల చివరి శ్లోకము భగవద్గీతలోని శ్లోకమే. దానికి వివరణ ప్రాయముగాఁ బై శ్లోక పాదములున్నవి.

ఈ సందర్భమునఁ బోతన యనువాదమిది –

"సమస్త భావాభిజ్ఞుండగు పుండరీకాక్షుండు మందస్మిత సుందర వదనార విందుండగుచు వతనిం జూచి నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తింజేసి నాకు నుపాయనంబుగ నేమి పదార్థంబు దెచ్చితి వప్పదార్థంబు లేశమాత్రంబయినఁ బదివేలుగా నంగీకరింతు నట్లుగాక నీచ వర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నా మనంబునకు సమ్మతంబుగాదు. కావున—

"దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్[2]

ఈ ప్రసంగమున భక్తున కుండ వలసిన యోగ్యతయు, నెట్టి భక్తికి భగవంతుఁడు వశ్యుఁడగునను విషయమును వివరింపఁబడినవి. ఈ పద్యము శ్రీకృష్ణుని పరబ్రహ్మత్వమును నిరూపించుచునది.

భగవంతుఁడగు శ్రీమన్నారాయణుని భక్త ప్రియత్వమును కుచేలుని భార్య చక్కఁగా వివరించినది. దారిద్ర్యమున గ్రుగ్గి పోవుచున్న తన స్థితిమంచి ముక్తిఁ బొందుటకు శ్రీకృష్ణు నాశ్రయింపుమని భర్తను ప్రోత్సహించు సందర్భమున నామె పలుకులివి —

"కలలోనం దను మున్నెఱుంగని మహా కష్టాత్ములై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁ పన్నంతన మెచ్చి యార్తి హరుఁడై తన్నైన నిచ్చున్ సుని
శ్చల భక్తిన్ భజియించు వారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్"

(10 స్క-ఉ.భా 971 ప)

1. శ్రీమద్భా 10 స్క-81 అ-2, 3 శ్లో.
2. ఆం-భా 10- ఉ.భా 1009, 1010 శ్లో.

శ్రీకృష్ణుని భక్తవశంవదత్వమును శుద్ధాంతకాంత లిట్లు విస్తారముగాఁ జెప్పుకొనినారు.

"ఏమి తపంబు సేసెనొకొ యీ ధరణీ దివిజోత్తముండు తొల్
ధామున యోగి విస్ఫుర దుపాస్యకుఁడై తనరారుచుం జగ
త్స్వామి రమాధి నాథు నిజతల్పమునన్ వసియించి యున్న వాఁ
డీ మహనీయమూర్తి కెనయే ముని పుంగవు లెంతవారలున్
(10-ఉ-భా-985)

పరమ యోగీశ్వరుల కలభ్యమైన భోగము కుచేలున కబ్బినదఁట.

తన్నాదరించిన శ్రీకృష్ణుని దివ్య చేష్టలను కుచేలుఁ డిట్లు ప్రశంసించి యున్నాఁడు—

"మలిన దేహుండను జీర్ణాంబరుఁడని చిత్తంబున హేయంబుగఁ బాటింపక నాచేనున్న యటుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యాతని నిర్హేతుక దయయ కాదె. యట్టి కారుణ్యసాగరుండయిన గోవిందుని చరణారవిందంబుల యందుల భక్తి ప్రతిభవంబున గలుగుం గాక" (10-ఉ-భా-1031)

ఈ ప్రసంగమువలన భగవంతుఁడగు శ్రీకృష్ణుని భక్తజన పాలన కళా వైదగ్ధ్యముతో బాటు దయాగుణము కూడ ప్రసక్తమైనది.

శ్రీకృష్ణుఁడే నారాయణుఁడనియు, నారాయణుఁడే పరబ్రహ్మమనియు, సద్ది నారాయణ పరబ్రహ్మము నిర్గుణుఁడు నిర్విశేషుఁడు కాక హేయగుణరహితుఁడు కల్యాణ గుణోపేతుఁడుననియుఁ జెప్పు విశిష్టాద్వైత మతమును కమనీయముగా నున్నది గుణప్రస్తావము. పోతన యనువాదములోని యౌచిత్యము—విశిష్టాద్వైత సంప్రదాయ పరిపోషణ నైపుణ్యము మూలభాగవతమును పరిశీలించినప్పుడు మఱింత స్పష్టము కాఁగలదు.

"తస్యైవ మే సౌహృద సఖ్యమైత్రీ
దాస్యం పునర్జన్మని జన్మని స్యాత్।
మహానుభావేన గుణాలయేన
విషజ్జత స్తత్పురుష ప్రసంగః"[1]

1. శ్రీమద్భా 10స్క-81 అ-44శ్లో.

ఇందుగల "గుణాంబుధిని" అను పదమునకుఁ బోతన కథాంశమున వ్యక్తమైన యనంత కారుణ్యము వర్ణముగాఁ జెప్పినాఁడు. 'నిష్కైతవకరుణ' — 'కారుణ్య సాగరుఁడు' — అను రెండు సమాసముల సాయముఁన పోతన శ్రీమన్నారాయణుని కల్యాణ గుణాశ్రయత్వమును గటా సందర్భముఁతో సమన్వయించి వివరించినాఁడు.

'తవైవ మే సౌహృద సఖ్యమైత్రీ
దాస్యం పునర్జన్మని జన్మని స్యాత్' — అను శ్లోకార్థమును

పోతన యను వదించుట – గోవిందుని చరణారవిందంబుల యందుల భక్తి ప్రతి భవంబునను గలుగుంగాక — యనినాఁడు.

ఈ భావము భగవంతుని పట్ల భక్తుని యవ్యవసాయము నిరంతర ప్రీతి యను వానిని వ్యక్తము చేయుచున్నది. ఈ వాక్యమును పన్నిద్దరాళ్వారులలో నొకరగు శ్రీ కులశేఖరాళ్వారుల శ్రీసూక్తితోఁ బోల్చి చూచినప్పుడు కుచేలోపాఖ్యానమున నుద్దిష్టమగు భక్తియొక్క లక్షణము స్పష్టము కాగలదు. శ్రీకులశేఖరులు తమ ముకుందమాలలో —

"ఏ తత్ప్రార్థ్యం మమబహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలాభక్తిరస్తు ॥[1]

లౌకిక భోగములు, స్వర్గ సుఖములను నిరసించి శ్రీకులశేఖరులు జన్మజన్మలలో నిరంతర నారాయణభక్తినిఁ గోరుకొనియున్నారు. ఈ సందర్భమున శ్రీ యామునా చార్యులవారి శ్రీ సూక్తి నిచ్చట యనుసంధింప వలసి యున్నది—

"తవ దాస్య సుఖైక సంగినాం
భవనేష్వస్త్వపి కీటజన్మమే।
ఇతరావసథేషు మాస్మభూ
దపి మే జన్మ చతుర్ముఖాత్మనా॥"[2]

ఈ శ్లోకమున శ్రీ యామునులు భక్తి హీనుల గృహములందుఁ జతుర్ముఖ బ్రహ్మ జన్మమును సైతము తిరస్కరించి శ్రీమన్నారాయణ పరాయణుల గృహములందుఁ గీటకముగా జన్మించుటకుఁ దహతహలాడినారు.

---

1. ముకుందమాల శ్లో. 5
2. స్తోత్రరత్నము శ్లో. 55.

కుచేలునిచే నారాయణ భక్తితత్త్వమిట్లు వివరింపఁబడినది —

“పురుషోత్తముఁడు భక్తి నిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థం బైన భక్తి పూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె” అని కుచేలుఁడు శ్రీకృష్ణుఁడు దనకుఁ గావించిన సన్మానమునకు సంతోషించి పలికినాఁడు. ఇందు భగవంతుఁడగు శ్రీమన్నారాయణుఁడు భక్తుల భక్తికెట్లు సంతోషించునో నిరూపింపఁబడినది.

కుచేలుఁడు దనకుఁ బట్టిన యదృష్టయోగమును గూర్చి యిట్లు వివరించి యున్నాఁడు —

“పరికింపఁ గృపణ స్వభావుండ నైనట్టి
యేనెట నఖిలావనీశ్వరి యగు
నిందిరా దేవికి నెనయంగ నిత్యని
వాసుఁడై యొప్పు నవ్వాసుదేవుఁ
డెట నస్పర్థిమైఁ దోడఁ బుట్టిన వాని
కైవడిఁ గౌఁగిటఁ గదియఁజేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్ప
మున నుంచి సత్క్రియల్ పూని నడపి
చారు నిజవధూకర సరోజాత కలిత
చామరానిలమున గతశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్త చందనాంచిత కరాబ్జ
తలములను నడుగులొత్తె వత్సలత మెఱసి (10-ఉత్త-1017)

ఇట్లు భక్తుని గౌరవించి పరిచర్యలు నెఱపునంతటి వశ్యతను శ్రీకృష్ణుఁడు ప్రదర్శించి యున్నాఁడు.

ఈ విధముగా నీ కుచేలోపాఖ్యానమున భగవంతుఁడగు శ్రీమన్నారాయణుని పరబ్రహ్మత్వము—నాతని భక్త వశ్యత— భక్తి స్వరూపము నను నంశములు విశిష్టాద్వైత సంప్రదాయము వ్యక్తమగు రీతిలో వివరింపఁబడినది.

# 5. గజేంద్ర మోక్షణోపాఖ్యానము

ఈ యుపాఖ్యానము నందు విశిష్టాద్వైత మతమున సంప్రదాయవేత్తలు ప్రముఖముగాఁ బరిగణించు "నర్థపంచకము" చక్కగా సమన్వయము చేయఁబడి యున్నది.

1. ప్రాప్యుఁడగు శ్రీమన్నారాయణుని పరబ్రహ్మత్వము.
2. జీవుని స్వరూప స్వభావములు.
3. ప్రాప్త్యుపాయమగు భక్తియోగ స్వరూపము.
4. ప్రాప్తి విరోధియగు నవిద్యాస్వరూపమును.
5. ప్రాప్తి ఫలమగు శ్రీమన్నారాయణ సామ్యమును.

అను నీ యైదంశములు సంప్రదాయాను కూలముగా నీ ఘట్టమున విస్తరింపఁబడినవి ఆ విషయమును బరిశీలింతము—

## 1. ప్రాప్యుఁడగు శ్రీమన్నారాయణుని పరబ్రహ్మత్వము

గజేంద్రుఁడు మకరము వలనఁగలిగిన యాపదను బోఁగొట్టుటకుఁబరబ్రహ్మమును శరణు కోరినాఁడు. అతని దృష్టిలోఁబరబ్రహ్మము యొక్క లక్షణము లివి—

> "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
> యెవ్వని యందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
> బెవ్వఁ డనాది మధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁదానయైనవాఁ
> డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్" (8-73)

ఈ వర్ణన మంతయు బ్రహ్మసూత్రములందు —

"జన్మాద్యస్యయతః"—ఇత్యాదిగా వివరింపఁబడిన పరబ్రహ్మస్వరూపము. మఱియు - జగముల నొకపరి బయట నుండ నిచ్చి, యొకపరి లోపలకుఁగొనుచు సర్వమునకు సాక్షియగు సకలంఁకుఁడు, నాత్మసాక్షియుఁ బరబ్రహ్మము. లోకులు, లోకస్థులు, లోకములునశింపఁగా నలోకమైన పెంజీఁకటి కావల వెలుఁగునట్టి యే కాకృతి. అట్టి వానిని మునులు దివిజులు కీర్తింపఁజాలరు. అఖిల రూపములు తన రూపైనవాడు. ఆది మధ్యాంత రహితుఁడు. భక్తజనముల పాలిటివాఁడు. దీనులఁ గాపాడువాఁడు- ఇది గజేంద్రుఁడుల్లేఖించిన పరబ్రహ్మస్వరూపము. అట్టిపరబ్రహ్మ

మనే యాఁతడు [illegible] గజేంద్రునిచేఁ బర బ్రహ్మముగాఁగీర్తింపఁబడినవారని విచారింపఁగా నీ క్రింద పేర్కొను పద్యమును బట్టి శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని గజేంద్రుఁడు భావించినట్లు స్పష్టమగు చున్నది —

"ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్షవిపక్ష దూర! కు
య్యో! కవియోగి వంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమల ప్రభావ! రా
వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁగావవే!"

(8 - 92)

ఇందున్న "కమలాప్త" యను సంబోధనము సాభిప్రాయము. ఇది కేవలము శ్రీమన్నారాయణునకే వర్తించునది. పిలిచినది పరబ్రహ్మమును, ఆ పరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడే యను నభిప్రాయము గజేంద్రునకు పూర్వజన్మ సంస్కారము వలనఁ గలిగినది.

ఈ పద్యము విశేషమగు శ్రీమన్నారాయణ పరబ్రహ్మముయొక్క శీలభవ్య సౌశీల్య బలవీర్యాదుల వ్యక్తము చేయుచు విశిష్టాద్వైత సంబంధమై యొప్పుచున్నది. ముఖ్యముగా నీ "కమలాప్త" యను సంబోధనము ప్రస్తుత పద్యమున విశిష్టాద్వైత సంప్రదాయ పారభమును సంపాదించి పెట్టినది.

ఈ గజేంద్రుని మొరను సకలదేవతానీకముమ వినినను మందొక్కరును కదివరుని కావఁగాఁదలపోయలేదు అందుకు హేతువు 'విశ్వమయత' యను పర బ్రహ్మత్వలక్షణము వారిలెవ్వరికి లేకపోవుటయే. ఆ సందర్భమున భాగవత పురాణ కథనమిది —

"విశ్వమయత లేమి వినియు నూరకయుండి
రంబుజాప నాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డపడఁదలంచె"

(8 - 94)

పరబ్రహ్మత్వ [illegible] "విశ్వమయత్వ" [illegible] "విష్ణుత్వ" [illegible]
[illegible] స్పష్టముగా [illegible] లక్ష్మీ

భగవత్సాక్షాత్కారమునకు భక్తియే యుపాయమని కూడ "భక్తియుతునకు" అను సమాసయుక్తమగు సమాసము వలన భక్తపోతన వివరించియున్నాఁడు.

మఱియు వైకుంఠపురము-సిరి-శంఖచక్రాద్యాయుధవ్రాతము-అవరోధవ్రాతము-పక్షీంద్రుఁడు-వైకుంఠపురమున నిత్యనివాసము చేయుచున్న యాబాల గోపాలము ఇవి యన్నియు నీ పద్యమునఁ బ్రసక్తములైనవి.

విశిష్టాద్వైత సిద్ధాంతమున నీ వర్ణన మంతయుఁ బారమార్థికము. ఈ సిద్ధాంతమునఁ బరబ్రహ్మముగాఁ జెప్పఁబడుచున్న శ్రీమన్నారాయణునితో నివి యవ్యృత క్సిద్ధములు.

ఈ సందర్భమునసే శ్రీమన్నారాయణ పరబ్రహ్మము— "భక్తజన పాలన పరాయణుండును, నిఖిల జంతు హృదయార వింద సదన సంస్థితుండగు నారాయణుండు" —అని వర్ణింపఁబడుట (8-97) గమనార్హము.

## 2. జీవ స్వరూపము

జీవుని యొక్క స్వరూప మీ పద్యమునఁ జక్కగా విశదీకరింపఁబడినది. గజేంద్రుఁడు జీవికి ప్రతీక. ఇతఁడు గ్రాహబద్ధుఁడై స్వశక్తిపై నమ్మిక కలిగి వేయి వత్సరములు దానితోఁ బోరాడెను ఇట్లు పోరాడి పోరాడి యలసిన కరీంద్రుని కవి యిట్లు వర్ణించియున్నాఁడు—

> "ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
> మోహ లతా నిబద్ధ పదమున్ విడిపించుకొనంగలేక సం
> దేహము పొందు దేహి క్రియ దీనదశన్ గుఱియయ్యె భీషణ
> గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాద ఖురాగ్ర శల్యమై"
>
> (8—67)

ఈ పద్యమున గజేంద్రుఁడొక జీవుఁడు. ఈ జీవుఁడు జీవితమునఁ బోరాటము సాగించుచున్నాఁడు. మోహలతచే బంధింపఁబడినాఁడు. ఆ మోహమే గ్రాహము. మనుగడ సాగించు పోరాటములో జీవి యలసి సొలసి జయమును బొందఁగలనను నాశపట్ల సందియము నొందియుండు దశయే గజేంద్రుని దీనదశగాఁ జెప్పఁబడినదని యూహింపఁదగును. ఇట్టి దశలో నున్న గజేంద్రునకు

"పూర్వ పుణ్య ఫల దివ్యజ్ఞాన సంపత్తితో" (8–70) పరమేశ్వరుఁడగు శ్రీమన్నా రాయణుని శరణు కోరవలయునను విచార మవలంబించినది.

ఈ సందర్భమున భగవద్గీతలో గీతాచార్యుని యీ క్రింది దివ్య సూక్తి యను సంధింపఁదగినది—

"యత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వ దేహికమ్ ।
యతతేచ యతో భూయస్స సిద్ధౌ కురు నన్దన ॥
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః"[1]

దీని సారాంశమిది—

యోగభ్రష్టుఁ డా జన్మమందును, పూర్వ జన్మమందును ననుష్ఠించిన యోగమును గురించిన బుద్ధితోడ మరల కూడుచున్నాఁడు— ఆ బుద్ధి యొక్క కూడిక వలన మేల్కొన్నవానివలె మరల నే విఘ్నములే లేకను పెద్దతినకుండునట్లు యోగము పెన్నగా సిద్ధించుట కొఱకుఁ బ్రయత్నము చేయుచున్నాఁడు. పూర్వము యోగమభ్యసించుచుండినందున నా యోగ విషయమైన పూర్వాభ్యాసముచే నా యోగ భ్రష్టుఁడు వివశుఁడయ్యును మరల నా యోగమునందే యాకర్షింపఁబడుచున్నాడు.

పై వాక్యములను బట్టి గజేంద్రుఁడు పూర్వ జన్మమున నున్నత శ్రీ వైష్ణవ సంస్కారము కలవాడై యున్నందున మరల నీ జన్మమున శ్రీమన్నారాయణు శరణ వరణము చేయవలయునను నూహ కలిగినది. ఆ సంస్కారము చేతనే గజేంద్రుడు పరమేశ్వరుని విషయమై ప్రపత్తి చేసినాఁడు. తొలుతఁ గొంత సందేహమును వ్యక్తము చేసినాడు—

"కలఁడందురు దీనుల యెడఁ
గలఁడందురు పరమ యోగి గణముల పాలన్
గలఁడందు రన్ని దిశలను
గలఁడు గలం డనెడువాఁడు కలఁడో లేఁడో" (8-86)

అని యాతని సందేహము. కాని వెనువెంటనే తన మనమున "ఈశ్వర సన్నిధానమును" (8-89) కల్పించుకొనినాఁడు. తన శక్తిహీనతయును, ననన్య గతిత్వమును బ్రకటించినాఁడు.

---

1. భగవద్గీత 6–43.

ఆ విధాన మిది—

"లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపంగదే దీనునిన్
రావే ! యీశ్వర ! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా !"

(8 90)

అని తన యకించనత్వమును పైతము విన్నవించుకొనినాఁడు. తదనంతరము సందేహమును బూర్తిగా వీడి సంపూర్ణ ప్రపత్తినిఁ జేపట్టి శ్రీమన్నారాయణ రక్షణమున మోక్షమును బొందినాఁడు.

ఈ విధముగా నీ ఘట్టమున నొక జీవి యొక్క వివిధ దశలు — వాని స్వభావము – వాని వర్తనము — తతకు మోక్షమ్యమగు పరమ పురుషార్థ సాధన పర్యంతము గల యాయా సందేహ సమాధాన స్థితి చక్కఁగా వర్ణింపఁబడినవి.

## 3. ప్రాప్త్యుపాయమగు భక్తి యోగము

గజేంద్రుని భక్తి యీ ఘట్టమునఁ జక్కఁగాఁ బ్రపంచింపఁబడినది. భక్తి యోగమే మోక్ష ప్రాప్తికిఁ గారణమని యీ ఘట్టము వివరించినది భగవదాభిముఖ్యమునకు సర్వ సమర్పణమే యుత్తమ మార్గమని యీ యుపాఖ్యాన ప్రబోధము.

గజేంద్రుడు—

"శరణార్థిని నన్నుఁ గావవే"
"అరక్షిత రక్షకుండయిన యీశ్వరుండా సన్నుతుండైన
నన్నుం గాచు గాత" (8–93)

అనుటలో భగవదనుగ్రహమునకు నుపాయము భక్తియేయను సిద్ధాంతము సమర్థింపఁబడినది.

ఈ ఘట్టమున శ్రీమన్నారాయణుని గూర్చి—
"భక్త జనముల దీనుల పాలివాఁడు" (8-87)
"శరణార్థుల కో
యనుఁట పిలిచిన" (8-91)

"ఓ శరణాగతా మరా వో శహ" (8-92)

"భక్తియుతుని కష్ట తడదలంచె" (8-94)

"అపన్న ప్రపన్నుండను" (8-95)

"భక్తజన పాలక నారాయణుండు" (8-97)

"భక్తజన బృంద ప్రాతపాలంకరిష్ణు" (8-105)

ఇత్యాదులగు నంశములు భక్తియోగ వైశిష్ట్యమును జాటుచున్నవి.

## 4. విరోధియగు నవిద్యా స్వరూపము

భగవదనుగ్రహ ప్రాప్తికి విరోధియగు నవిద్య యొక్క స్వరూప మీ ఘట్టమున విస్తరింపఁబడినది. గజేంద్రుఁడు పూర్వ జన్మ సంస్కార బలమున శ్రీమన్నారాయణ శరణ వరణమును జేయఁ దలపెట్టఁగా నీ యవిద్యా ప్రభావమునఁ బరబ్రహ్మరక్షకత్వము పట్ల సందేహము కలిగినట్లు చెప్పఁబడినది.

జీవులఁ గప్పియున్న యవిద్య వలన స్వస్వరూప జ్ఞానము మరుగునఁ బడినది అది సంసార దుఃఖమునకు హేతువైనది. అట్టి యత్యవిద్యయే భగవదానుకూల్యమునకు, మోక్షప్రాప్తికి విరోధి దాని ప్రభావముచే జీవాత్మకుఁ దాత్కాలిక సందేహము. పరబ్రహ్మము యొక్క యునికి పట్ల సందేహము—

"కలఁడు గలండనెడు వాఁడు గలఁడో లేఁడో" (8-86)

అని పరబ్రహ్మము యొక్క దీనజన రక్షా పరత్వంబు పట్ల సందేహము – దాని ఫలితమే యీ క్రింది పద్యము—

వినుదఁట జీవుల మాటలు
జనుదఁట చనరాని చోట్ల శరణార్థుల కో
యనుదఁట పిలిచిన సర్వముఁ
గనుదఁట సందేహమయ్యెఁ గరుణావార్ధీ" (8 91)

అని గజేంద్రునకుఁ గల్గిన యీ సందేహ మనాద్యవిద్యా ఫలితమే. కాని గజేంద్రుని పూర్వ జన్మ సంస్కారము విశిష్టమైనది. పూర్వ జన్మమున వాఁడు భాగవత శ్రేష్ఠుఁడైన యింద్రద్యుమ్నుఁడు. ద్రవిడాధీశుఁడు. మౌన నియతితో నారాయణుని నవిశేషముగాఁ బూజించిన వైష్ణవ ముఖ్యుఁడు. కావునఁ దనకు భగవంతునకు నడ్డుగ నిలిచిన యవిద్య యనెడు విరోధిపై విజ్ఞాన విజయమును సాధించిన దీనని

పూర్వ జన్మ సంస్కార విశేషము, పిదప సంపూర్ణ శరణాగతి నాశ్రయించి భగవ దనుగ్రహపాత్రుఁడై వైకుంఠావాస ప్రాప్తి నొందినాఁడు.

ఇట్టి యుపాఖ్యానమున భగవదాభిముఖ్య మోక్షములకు నాటంక కారణ మైన విరోధి స్వరూపము విపులముగా వివరింపఁ బడినది.

5. ప్రాప్తిఫలమగు మోక్షము

శ్రీమన్నారాయణునితో "పరమ సామ్యము" నొందుట యను విశిష్టాద్వైత సిద్ధాంత ప్రసిద్ధమైన ముక్తి విధాన మీ ఘట్టమునఁ దేర్కొనఁబడినది.

"హస్తిలోక నాథుఁడజ్ఞాన రహితుఁడై
విష్ణురూపుఁ డగుచు వెలుగుచుండె" (8-121)

అని యీ సందర్భమునఁ జేర్కొనఁబడినది. ముక్తజీవుఁడు విష్ణుని రూపము వంటి రూపము గలవాఁడగుట యను "సారూప్యముక్తి" విశిష్టాద్వైత మత సమ్మత మగు నంశము.

ఈ ఘట్టమున గజేంద్రుఁడు జీవాత్మకుఁ బ్రతీక. అతని నాపేక్షించిన నక్రము సంసార రూపమున జీవుని బంధించి యుంచిన యనాద్యవిద్య. పూర్వ పుణ్య వశమున భగవద్ధ్యాన యోచన కలిగి భక్తి యోగము నాశ్రయించి శ్రీమన్నారాయ ణుని దయకుఁ బాత్రుఁడై రక్షింపఁబడి యా నారాయణ పరబ్రహ్మముతోఁ బరమ సామ్యమును బొందినాఁడు - ఈ వర్ణనమంతయు విశిష్టాద్వైత సంప్రదాయానుసారి. ఈ గాథ వలన - శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మము. అతనికి విశ్వమయత్వము కలదు. అన్య దేవతలకి శక్తిలేదు. కావున వారిలో నెవ్వరినిఁ పరబ్రహ్మ మన టకు వీలులేదు. శ్రీమన్నారాయణ పరబ్రహ్మ మనంత కల్యాణ గుణ సహితుఁడు. జీవుఁడు పరతంత్రుఁడు. భగవంతునిఁ జేరుటయే యాతని "గమ్యము". భక్తియే దానికి సాధనము. అందుకు విరోధి యనాద్య విద్య దానినిఁ బోఁగొట్టువాఁడు శ్రీహరి - అని వివరింపఁబడినది.

ఈ విధముగ ప్రాప్యుఁడగు శ్రీమన్నారాయణుని తత్త్వము, ప్రాప్తయగు జీవుని స్వరూపము, ప్రాప్తికి సహాయమగు భక్తియొక్క స్వరూపము, భగవత్ప్రా ప్తికి విరోధి యగు నవిద్యా స్వరూపము, ప్రాప్తి ఫలమగు విష్ణు స్వరూప లాభము బోధింపఁ బడుటచే విశిష్టాద్వైత సంప్రదాయ స్వరూప నిరూపకులగు పూర్వాచార్యులు

వివరించు మార్గమున నీ పట్టము సాగినదని చెప్పఁదగి యున్నది. అర్థ పంచకము చక్కఁగా సమన్వయమునొంది యీ యుపాఖ్యానము శ్రీవైష్ణవ సిద్ధాంతమున కాదర పాత్రముగా విలసిల్లు చున్నది.

ఈ పట్టమునకుఁ "గొన మెరుపుగా" - తత్త్వాంశ మొకటి వివరింపఁబడి యున్నది. శ్రీమన్నారాయణుఁడు లక్ష్మీదేవితో -

"ఎఱుఁగుదు తెలివా యెప్పుడు
మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్
మఱతునని యెఱిఁగి మొఱఁగక
మఱవక మొఱయిడిర యేని మఱియన్యములన్" (8-130)

సమస్తమును నెఱుఁగుదును. దేనిని మఱపను. నన్ను మఱచినచో వానిని మాత్ర ముపేక్షింతును. ఈ విషయమును గుర్తించి నన్ను మఱువక కపటము లేకుండ మొఱయిడినచోఁ దప్పక రక్షింతును - అని తన విధానము నా శ్రీహరి వివరించియున్నాఁడు.

అందులకా "పరమ వైష్ణవీ రత్నము"(8-134) సముచితముగా విష్ణుతత్త్వ ప్రబోధకముగా సమాధాన మిచ్చినది —

"దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవన లొసఁగన్
దీనావన నీ కొప్పును
దీన పరాధీన దేవదేవ మహేశా" (8-133)

ఈ లక్ష్మీదేవి వచనమున భగవంతుని భక్త పరాధీనత - సౌలభ్యము సమీచీనముగాఁ బ్రస్తావింపఁ బడినవి.

# 6. ప్రహ్లాదోపాఖ్యానము

ప్రహ్లాదోపాఖ్యానము విశిష్టాద్వైత మతమున ముఖ్యములుగాఁ జెప్పఁబడు చున్న యనేక విషయములను వివరించు నుపాఖ్యానము. ఇందు—

1. శ్రీమన్నారాయణుని సర్వ వ్యాపిత్వము నిరూపించుట మూలమున నాతఁడే పరబ్రహ్మమని బోధింపఁబడినది.

2. దివ్యావతారముల ప్రయోజనములను వివరించుచు వాని పారమార్థ్యము నిరూపింపఁబడినది.

3. శ్రీమన్నారాయణునిఁ జేరుటకు భక్తియే ముఖ్యోపాయమని ప్రతిపాదింపఁబడినది.

4. శ్రీమన్నారాయణుఁడే మోక్షప్రదాతయని ప్రకటింపఁబడినది.

ఈ యంశములన్నియు విశిష్టాద్వైత సిద్ధాంతానుసారముగా నీ యుపాఖ్యానమునఁ జెప్పఁబడి యున్నవి. ఈ విషయమును బరిశీలింతము.

## 1. శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మము

ప్రహ్లాదోపాఖ్యానము శ్రీమన్నారాయణుని విషయమున సర్వ వ్యాప్తినిఁ జెప్పినది. ఆ సందర్భమున హిరణ్యకశిపుని ప్రశ్న యిది-

"ఎక్కడ గలఁడే క్రియ నే
చక్కట వర్తించు నెట్టిజాడను వచ్చున్" (7–272)

తండ్రి యడిగిన యీ ప్రశ్నమునకుఁ బరమ భాగవతుఁడగు ప్రహ్లాదుఁ డిచ్చిన యుత్తరము శ్రీమన్నారాయణుని సర్వ వ్యాపకత్వమును సూచించుచున్నది—

"కలఁడంబోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ వ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల యీయాయెడన్"
(7–274)

ఇందుఁ బ్రహ్లాదుఁడు శ్రీమన్నారాయణుఁడుండు తావులను గొన్ని పేర్కొని యంతటను గలఁడనియు, నీ యా తావులని పేర్కొన నేలయని వివరించియుఁ దృప్తినొందక నిశ్చయ వాక్యముల నిట్లు పలికినాఁడు—

"ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే" (7–275)

ఇట్లు శ్రీమన్నారాయణుని సర్వోపగతత్వము చెప్పఁబడినది. తత్ప్రగగణ్యుఁడైన ప్రహ్లాదుని యభిప్రాయము. మఱి శ్రీమన్నారాయణుఁడు సర్వోపగతుండగుట సత్యమా ? యను శంకకు వెంటనే సమాధాన మీయఁబడినది—

"హరి సర్వాకృతులం గలండనుచుఁ బ్రహ్లాదుండు భాషింప న
త్సురుఁడై యెందును లేఁడు లేఁడని సుతున్ దైత్యుండు దర్శింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానా జంగమ స్థావరో
త్కర గర్భంబుల నన్ని దేశముల నద్దండ ప్రభావంబునన్"

(7-271)

ఇట్టుద్దండ ప్రభావమున సర్వాంతర్యామిత్వమును గలిగియుండుటచే శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని స్థాపింపఁబడినది.

శ్రీ నృసింహావిర్భావ సమయమున శ్రీదేవి ప్రస్తావము. బ్రహ్మాది దేవతల స్తుతులు పరిశీలించినప్పుడు స్పష్టముగా శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మ లక్షణము లగు సృష్టి స్థితి లయ కారణత్వాదులు కలవాఁడని స్పష్టపడుచున్నది.

## 2. దివ్యావతార ప్రయోజనము

దివ్యావతార ప్రయోజనమును గూర్చి గీతాచార్యుని పలుకులివి—

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్!
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥[1]

అని వ్యాయముగాఁ దన యవతార ప్రయోజనములను వివరించియున్నాఁడు. ఈ గీతాచార్యుని వాక్యములకు భగవద్రామానుజులిట్లు వ్యాఖ్యానించి యున్నారు—

సాధవః = ఉక్త లక్షణ ధర్మశీలా వైష్ణవాగ్రేసరా మత్సమాశ్రయణే ప్రవృత్తా మన్నామ కర్మ స్వరూపాణాం వాఙ్మనసా గోచరతయా మద్దర్శనాదృతే స్వాత్మ ధారణ పోషణాదిక మలభమానాః క్షణమాత్రకాలం కల్ప సహస్రం మన్వానాః ప్రశిథిల సర్వగాత్రాభవే యురితి మత్స్వరూప చేష్టితావలోకనాలాపాదిదానేన తేషాం పరిత్రాణాయ తద్విపరీతానాం వినాశాయ చ క్షీణస్య వైదికస్య ధర్మస్య మదారాధన రూప స్యారాధ్య స్వరూప ప్రదర్శనేన స్థాపనాయ చ దేవ మనుష్యాది రూపేణ యుగే యుగే సంభవామి. కృత త్రేతాది యుగ విశేష నియమోఽపి నాస్తీత్యర్థః[2]

---

1. భగవద్గీత 4–8
2. రామానుజ గీతా భాష్యము 4–8

దీనిని బట్టియే భగవదవతార హేతువులను ఫలమును విశదీకరించుచు విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులలో నగ్రగణ్యులు లోకవాదులనఁ బూర్వము నవే తీసించిన వారును నగు శ్రీ పిళ్ళలోకాచార్యులవారు తమ ద్రావిడ గ్రంథమున-

"అవతారజ్ఞకుక్కు హేతు ఇచ్చై"
"ఫలమ్ సాధు పరిత్రాణాది త్రయమ్"[1]

అను సూత్రములలో దుష్ట శిక్షణయు, శిష్టరక్షణయు, ధర్మ స్థాపనయు నను మూడు ప్రయోజనములను పేర్కొనియున్నారు.

ఆంధ్రభాగవత కర్త ఈ మార్గముననే భగవదవతార ప్రయోజనములను వివరించినారు — ఉదాహరణకు-

"దుష్టజన నిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు సేయుట కొఱకై
యష్టమ గర్భమున గుణో
త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్" (9-723)

"ఎప్పుడు ధర్మక్షయమగు
నెప్పుడు పాపంబు హెచ్చు నీ లోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి
దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁదా సృజియించున్" (9-725)

ఇట్లిందు దుష్ట శిక్షణము, శిష్ట రక్షణము, ధర్మ సంస్థాపనము నను మూడు ప్రయోజనము లుగ్గడింపఁబడినవి.

శ్రీ నృసింహావతారము వలన గూడ ఈ ప్రయోజనములు సిద్ధించినట్లు ప్రహ్లాద చరిత్రమునఁ జెప్పఁబడినది. ప్రహ్లాదుఁడు నృసింహదేవుని రోషము శాంతఁజేయుటకై ప్రార్థించు సందర్భమున—

............లోకములకు సౌఖ్యక
పన్నగముల భంగి భయముఁజేయు
నసుర మర్దించితివి సాధు హర్షమయ్యె
నవతరించిన పని తీఱె" (7-354)

అని యవతార ప్రయోజన పరిసమాప్తిని సూచించియున్నాఁడు.

---

1. తత్త్వత్రయము—ఈశ్వర ప్రకరణము 194, 195 సూ.

బ్రహ్మ దేవుఁడు శ్రీ నరసింహ దేవునితోఁ బల్కిన పల్కులు—

"మత్తుఁడై సకల ధర్మములఁజెఱచి
నేఁడు భాగ్యంబున నీ చేత హతుఁడయ్యెఁ
గల్యాణ మ మరె లోకముల కెల్ల
బాలు నీతని మహాభాగవత శ్రేష్ఠు
బ్రతికించితివి మృత్యు భయముఁ బాపి" (7-381)

అను నీ పలుకులలో గూడ నవతార ప్రయోజన పరిసమాప్తిని బ్రహ్మదేవుఁడు తెప్పియున్నాఁడు. ఈ రెండు తావులందును దుష్ట నిగ్రహము, శిష్టాను గ్రహము, ధర్మ సంస్థాపనము ననునవి సూచింపఁబడినవి.

శ్రీ నృసింహావతారమున దాల్చి శ్రీ మన్నారాయణుఁడు హిరణ్యకశిపుని సంహరించుటచే దుష్ట శిక్షణమును, దానివలన శిష్టుఁడగు ప్రహ్లాదుని యొక్క రక్షణమును మఱియు నశేష దివిషదుల రక్షణమును, ధర్మ స్థాపనము నను పై మూడు ప్రయోజనములు సిద్ధించినవి.

హిరణ్య కశిపుఁడు దుష్టుఁడు. అతని దౌష్ట్యమును నహంకారము నిట్లు వ్యక్తము చేయఁబడినవి.

"దిక్కుల గెలిచితి నన్నియు
దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక
దిక్కుఁగన కొలుతు రితఁడె దిక్కని నన్నున్" (7-261)

ఇట్టి దుష్టుని సంహారము వలన శిష్టజన మూర్ధన్యుఁడగు ప్రహ్లాదుని రక్షణము సంభవమైనది. నీకు దిక్కెవ్వఁడని తన తండ్రియడిగిన ప్రశ్నమున కే ప్రహ్లాదుఁడిచ్చిన యుత్తరమిది-

"బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు ప్రాణులకును
బలమెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా" (7-264)

ప్రహ్లాదుని యీ పలుకుల వలనఁ బ్రపన్నజన లక్షణమీతనిలో స్పష్టముగ వ్యక్తమై నది. ఇట్టివాఁడే భగవంతునకుఁ జేరువయైనవాఁడు. ఇట్టి యనన్యగతికుని రక్షణమే శిష్టజన రక్షణము. ఇట్టి శిష్టుని రక్షణము నృసింహావతార ప్రయోజనములలో నొకటి.

తమ శ్రీభాష్యములో భగవద్రామానుజులు "సాధూనాం" అను మూలమున గల పదమున కిచ్చిన వివరణమున కిన్ని విధములఁదగినవాఁడు ప్రహ్లాదుఁడు.

ఇఁక ధర్మ స్థాపనము-హిరణ్య కశిపుఁడు తన తమ్ముఁడగు హిరణ్యాక్షుని మృతికిఁ గోపించి శ్రీహరిని సాధింపనెంచి రాక్షసుల నిట్లు పెచ్చుఁగొల్పినాఁడు—

"ఏ స్థలముల గోభూసురేంద్ర వేద
వర్ణధర్మాశ్రమంబులు వరువ నుండు
నా స్థలంబుల కెల్ల మీరరిగి చెఱచి
దగ్ధములు సేసిరండు మీ దర్పమొప్ప" (7-34)

ఈ హిరణ్యకశిపుని యుద్యమ ప్రణాళికను బట్టి యాతఁడు కావించిన వంశోవమును, దానివలన గలిగిన ధర్మగ్లానియు మనమూహింపవచ్చును. ఇట్టి ధర్మ గ్లానిని నివారింపగా నృసింహావతారము నెత్తినాఁడు శ్రీహరి.

ఇట్టి నృసింహావతార వైభవమును బ్రహ్మ మహేశ్వరుఁడు మహేంద్రుఁడు మున్నగు దేవతా శ్రేష్ఠులు కీర్తించినట్లు భాగవతము పేర్కొన్నది. కావున నీ యవతార ప్రసంగము పరమార్థమని భావింపవలసియున్నది. ఇట్లవతార ప్రయోజనము "పరమార్థమనుట" విశిష్టాద్వైత సిద్ధాంత సమ్మతము.

ఈ పరమార్థమును సూచించుటకే యనినట్లు హిరణ్యకశిపుని మాటగాఁ బోతన యిట్లు వివరించియున్నాఁడు—

"నర మూర్తిగాదు, కేవల
హరి మూర్తియుఁ గాదు మానవాకారముఁ గే
సరి యాకారము నున్నది
హరి మాయా విరచితమగు యథార్థము సూడన్" (7-286)

ఇందుఁగల "యథార్థము సూడన్" అనుదానిని గుర్తింపవలయును.

### 3. భక్తియే ముక్త్యుపాయము

ప్రహ్లాదోపాఖ్యానమునకుపోద్ఘాత ప్రాయములైన శుకపరీక్షిత్తుల ప్రశ్నోత్తరములు— తైలధారవలె విచ్ఛిన్నమగు స్మృతి సంతాన రూపమగు భక్తియే మోక్షమునకు నుపాయమను విషయమును స్థిరీకరించుచున్నవి.

"ఏకాగ్రతను సద్ధామధ్యాన గరిష్ఠుఁడైన వారి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా !"
(7-18)

అను నారద వాక్యము లిట దేర్కొనఁదగినవి. ధ్యానమనగా నిరంతర స్మరణము. అదియే భక్తి- నారదుఁడు—

"పెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతి రేకంబులఁ
చిత్తంబు హరి పరాయత్తంబుగాఁ జేసి తద్గతింజెందిరి"
(7-19)

అని వివరించుట చూడగా నిరంతర ధ్యానరూపమైన భక్తియే మోక్షహేతువని స్పష్టపడుచున్నది.

పైనఁ దేర్కొనఁబడినట్టి నిరంతర ధ్యాన గరిష్ఠుఁడు ప్రహ్లాదుఁడు. అతని వర్తనములు, పలుకులు భక్తియోగ ప్రాశస్త్య ప్రబోధకములు.

భాగవతము ప్రహ్లాదుని—

1. "సహజ సంవర్ధమాన నిరంతర ధ్యాన నిరతుఁడు" (7-121)
2. "పూర్వజన్మ పరమ భాగవత సంసర్గ సమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున సహర్వ నిర్వాణ భావంబు" (7-125) విస్తరించినవాఁడు
3. "హరి పాద సరోజ చింతన క్రియాలోలుఁడు" (7-127)
4. "జన్మాంతరావిర్భూతశాశ్వత పాదభక్తి మహామావిష్టుండు" (7-231)
5. "శ్రీనారాయణ పాద పద్మ యుగళీ చింతామృతా స్వాదనాధీనుఁడు" (7 - 256)
6. "అలిత మర్యాదుఁడు" (7–115)
7. "పరమ భాగవత శ్రేష్ఠుఁడు" (7–125)

ఇత్యాదిగా ఁజేర్కొని యున్నది. అతని భక్తి పారివశ్యమిట్లు వర్ణింపఁబడినది.

"శ్రీ వల్లభుఁడు దన్నుఁజేరిన యట్లైనఁ
జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు
నసురారి దన ప్రోల నాడిన యట్లైన
నసుర బాలుర తోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించి నట్లైనఁ
బర భాషలకు మాఱు వలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁజూచిన యట్లైనఁ
జొక్కి సమస్తంబుఁజూడ మఱచు
హరి పదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతఁడు
నిత్య పరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండు జడుని భంగి" (7–122)

ప్రహ్లాదుని నారాయణ ధ్యాన నిష్ఠ యిట్లు వివరింపఁబడినది —

"వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడైఁ
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావ నారూఢ చిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁడింతియ కాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళి నాక్షుఁడను విధానముఁ గంటినేనని
యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ
బలుకు నొకచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుఁడై నిమీలిత నేత్రుఁడై
యొక్క చోట నిలిచి యూరకుండు" (7-124)

ఇంకఁ బ్రహ్లాదుని వాక్యాలలో విష్ణుభక్తి విధానము సాకల్యముగా వివరింపఁ
బడినది—

1. "సర్వమున్నతని దివ్య కళామయమంచు విష్ణుతం
దుల్లముఁజేర్చి తారతని మందుట మేలు" (7-142)

2. "ముముక్షువైన దేహికి దేహావసాన పర్యంతంబు నారాయణ
చరణారవింద సేవనంబు గర్తవ్యంబు" (7-213)

3. నిస్త్రైగుణ్య లక్షణంబునం బరమ పురుషుండైన హరికి
నాత్మ సమర్పణంబు సేయుట మేలు" (7-217)

4. ఇంద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ
నీశ్వరుడయిన విష్ణుదేవుని యందలి గతి సిద్ధించు" (7–239)

5. హృదయ గరుఁడయిన హరిని నిజభక్తి భజింపవలయు (7-241)

6. "లక్ష్మీ నాథు చరణ కమల
ధ్యానంబున నెవ్వఁడైన ధన్యత నొందున్"

7. "చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తినిఁ
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ"

8. చాలదు భూదేవత్వము
సాలదు దేవత్వ మధిక శాంతత్వంబుం
జాలదు హరి మెప్పింపని
శాలోద్యము లార ! భక్తి పాలిన భంగిన్"

9. అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మే రీతి యితరంబుఁజేరనేర్చు"

ఇత్యాదులన్నింటను ప్రహ్లాదునిచే విష్ణుభక్తిని గూర్చి చెప్పఁబడినది. ప్రహ్లాదుఁడు భక్తిలోని నవవిధములను వివరించినాడుఁ —

"తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా"
(7-167)

హరిభక్తి రహితుల నిష్ఫల జన్మములను నిరసించినాఁడు. సర్వేంద్రియ వ్యాపారము లవే నారాయణ భక్తినే ప్రకటించియున్నాఁడు. అకించన వైష్ణవాంఘ్రి సంస్థాన రజోభిషిక్తులగు సంస్కృత కర్మల మహిమను పొగడినాఁడు.

భాగవతము ప్రహ్లాదోపాఖ్యాన నెపమున శ్రీరామానుజ సిద్ధాంతాను సారము భక్తియోగమును వివరించినది —

"గురు శుశ్రూషయు, సర్వలాభ సమర్పణంబును సాధుజన సంగంబును నీశ్వర ప్రతిమా సమారాధనంబును, హరి కథా తత్పరత్వంబును వాసుదేవుని యందలి ప్రేమయు, నారాయణ గుణ కర్మనామ కీర్తనంబును, వైకుంఠ చరణ కమల ధ్యానంబును విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును మొదలైన విజ్ఞాన వైరాగ్య లాభ సాధనంబులైన భాగవత ధర్మంబులపై రతిఁగలిగి, సర్వ భూతముల యందు నీశ్వరుండు భగవంతుండాత్మ గలండని సమ్మానంబు సేయుచుఁ గామక్రోధ లోభ మోహ మద మత్సరంబుల గెలిచి యింద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణుదేవుని యందలి గతి సిద్ధించును"(7-239)

ఈ పై వివరణము భగవద్రామానుజ సిద్ధాంతాను సారియని వేఱుగాఁ జెప్ప పని లేదు.

ప్రహ్లాదుఁడు శ్రీ నరసింహ దేవుని స్తుతించు సందర్భమున ప్రస్ఫుటముగా భక్తియోగ ప్రాశస్త్య ముగ్గడింపఁబడినది.

> ... ........ ..."అధిక బుద్ధి
> భక్తి సేయంగ వలయును భక్తిగాని
> మెచ్చ దర్థంబు లొసఁగెడు మేరలందుఁ
> బరమ కరుణుండు హరి భక్తి బాంధవుండు" (7-252)

ఈ విధముగాఁ బ్రహ్లాదోపాఖ్యానమున భక్తియే మోక్షోపాయముగా వివ రింపఁబడినది. భాగవతమునఁ బ్రారంభము నుండి యంతమువరకు విశిష్ట యుపాఖ్యా నముల వలన నీ భక్తియే విశిష్టముగా నిర్వహింపఁ బడుటచే నీ యపూర్వ విషయ మునే భాగవతము లోకమునకుఁ దెలియఁజేయ సంకల్పించెనని యూహింపఁ దగి యున్నది.

## 4. శ్రీమన్నారాయణుని మోక్షప్రదాయకత్వము

పరబ్రహ్మము మోక్షము నీయఁగలవాఁడు. భాగవతము శ్రీమన్నారాయణునే పరబ్రహ్మముగాఁ జెప్పుచుండుటచే నాతఁడే మోక్షప్రదాతయని పలు తావులలో నిర్దేశించినది. అట్టి విశ్వాసము మీ ప్రహ్లాదోపాఖ్యానమున గూడ గోచరించుచున్నది. ఇది విశిష్టాద్వైత మతమునఁ జెప్పఁబడిన సిద్ధాంతమునకు ననుకూలమైనది—

1. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు (7-213)
2. ముక్తి మార్గవాంఛ నాది దేవు విష్ణునాశ్రయింపుఁడు (7-216)
3. ఇంద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ
   నీశ్వరుండయిన విష్ణుదేవుని యందలి గతి సిద్ధించును (7-239)
4. మోక్షప్రదాతయగు హరి సకల భూతములకు నాత్మేశ్వరుండు (7-241)
5. ఇత్తము చిత్తము హరికిని
   నొత్తము నిర్వాణ పదము శుభమగు మనకున్ (7-249)
6. నీ వర్ణనమున ముక్తికిఁ
   బోవు నవిద్య జయించి పురుషుఁడనంతా (7-253)
7. నిరుపమా పునరావృత్తి నిష్కళంక
   ముక్తి నిధి గానవచ్చునే ముఖ్యమైన
   శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
   తామరస గర్భునకు నైన (7-171)
8. విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తి వివశుఁడగుచు (7-240)
9. పాప జీవులైన ముక్తికిఁ బోదు
   రఖిల జగము విష్ణుఁడనుచుఁ దలఁచి (7-245)

ఈ విధముగా శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమనియు, నాతఁడే మోక్షప్రదాత యనియుఁ దెలుపుచున్నది. మఱియు మోక్షమనగా శ్రీమన్నారాయణుని కడకుఁ జేరుటయే యనియు, తిరిగి పునరావృత్తి నిష్కళంకమనియు వెల్లడియగుచున్నది. ఇట్టి యభిప్రాయము శ్రీరామానుజ సిద్ధాంతాను కూలమైనది కావునఁ బ్రహ్లాదోపాఖ్యానము విశిష్టాద్వైత సిద్ధాంతము చెందిన పెక్కు విషయములను సమర్థించుచున్నదని చెప్పవచ్చును.

ముఖ్యముగా (శ్రైన చర్చించి నిశ్చయించినట్లు

1. (శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని స్థాపింపయత్నించుట చేతను —
2. దివ్యావతార ప్రయోజనములను పారమార్థిక దృష్టితో వివరించుట చేతను —
3. పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణునిఁ జేరుటకు భక్తియే ముఖ్యోపాయమని ప్రతిపాదించుట చేతను
4. శ్రీమన్నారాయణుఁడే మోక్షప్రదాయయని ప్రకటించుట చేతను —

[మోక్ష స్వరూపమును గూడ వైకుంఠమున శ్రీమన్నారాయణ కైంకర్యానంద రూపమైన దానినిగా పల్లేఖించుట గూడ విపేచింపఁదగియున్నది]

ప్రహ్లాదోపాఖ్యానము విశిష్టాద్వైత సిద్ధాంతముతైన యనేక ముఖ్యాంశములతో గూడి తత్త్వంప్రదాయ సౌరభమును గలిగి యున్నదని చెప్పటకుఁ దగియున్నది.

విశిష్టాద్వైతము —'ఉభయ వేదాంతమని'—చెప్పఁబడుటచే నీ ఘట్టము—ద్రావిడ వేదాంతమని ప్రసిద్ధమగు "నాలాయిరమ్" అనఁబడు ద్రావిడ ప్రబంధముల నంపుఁటిని — ఆళ్వారుల సూక్తులను బట్టియు నాచార్యుల పల్కులను బట్టియు నెట్లు పేర్కొనఁబడినదియుఁ పరిశీలింతము —

ముఖ్యముగా నాళ్వారులందఱకీ నృసింహావతార ఘట్టము శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రాముఖ్యము కలదగుటచే మిక్కిలి ప్రీతి పాత్రము. ఆళ్వారులందఱిలో ముఖ్యులని (అంగి) చెప్పఁబడు శ్రీనమ్మాళ్వారుల తమ "తిరువాయ్ మొఴి" యను దివ్యప్రబంధమందీ ఘట్టమునవేక సందర్భములలో వర్ణించియున్నారు. అందొకచో నిట్లు వర్ణించియున్నారు —

"చక్రి సర్వోపగతుఁడని చెప్పిన కుమారునిపై మండిపడి హిరణ్యకశిపుఁడు "ఇక్కడ లేఁడే?" అని స్తంభమును బ్రహరింపగా నా స్తంభమునుండి యాక్షణమే యారక్కసుఁడు చచ్చునట్లుగా నా విర్భవించిన నరసింహమూర్తియగు నా స్వామి వారి వైభవము పరిచ్ఛేదించి యెఱుఁగుటకు శక్యమైవంతటిదా ?"[1]

ఇందు నృసింహావతారమును గూర్చి బహిరంతర్వ్యాప్తులను స్పష్టపరచిన శ్రీమన్నారాయణుని సర్వశక్తిత్వమును బ్రకంసించి యాతని పరతత్త్వమును—బర బ్రహ్మత్వమును-నాళ్వారులు స్థాపించియున్నారు.

---

1. తిరువాయ్ మొఴి 2-8-9

భగవద్రామానుజుల ప్రధాన శిష్యులు శిష్టజన మూర్ధన్యులునగు శ్రీకూరత్తాళ్వార్లు నృసింహావతార ఘట్టమును గూర్చి యిట్లు వర్ణించియున్నారు.—

"నరసింహ తను రగౌణీ సమసమయ సముద్భవశ్చ భక్తగిరః।
స్తంభేన సంభవస్తే పిశునయతి పరేశతాం వరద॥"[1]

[వరదా! సత్త్వాది గుణమయ ప్రకృతి సంబంధము కాని నరసింహ శరీరమును, భక్తుని వాక్యము బయలు వెడలిన వెంటనే స్తంభమునందు బుట్టుటయును నీవు సర్వేశ్వరుఁడవని సూచించుచున్నది]

ఈ శ్లోకమున నాళ్వార్లు శ్రీమన్నారాయణుని పారమ్యమును, సౌలభ్యగుణ పరిపూర్ణతను ప్రస్తుతించియున్నారు.

## 7. వృత్రాసురోపాఖ్యానము

ఈ యుపాఖ్యానము భాగవతమునఁ బ్రముఖ స్థానము నాక్రమించినది. భాగవతమున నీ వృత్తాంత ప్రాముఖ్యమిట్లు గ్రంథారంభమున వివరింపఁబడినది—

"మత్స్య పురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మ విస్తరంబును వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడునదియ భాగవతంబని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీ మహా భాగవతంబన నొప్పుచుండు" అని పోతనామాత్యుఁడీ సందర్భమున వివరించియున్నాఁడు- ఇట్లు భాగవతమున విశిష్ట స్థానము గల యీ వృత్రాసుర వృత్తాంతమున విశిష్టాద్వైత సిద్ధాంత ప్రసిద్ధములగు ననేక విషయములు నిరూపింపఁబడి యున్నవి. ఈ వృత్రాసుర వృత్తాంతమునందుఁ చేర్కొనఁబడిన విశిష్టాద్వైత సంప్రదాయ ప్రసిద్ధములగు నంశములలో ముఖ్యమైన వివి—

1. శ్రీమన్నారాయణ పారమ్యము
2. దివ్య మంగళ విగ్రహ వర్ణనము
3. భాగవతుల మాహాత్మ్యము
4. భక్తియోగ ప్రాశస్త్యము

ఈ యంశములన్నియు సంప్రదాయ సిద్ధముగా నౌచి ముఖ్యముతో వర్ణింపఁబడి- శ్రీ వైష్ణవమత ప్రసంగములలో బ్రచురముగాఁ బ్రస్తావింపఁబడుచున్నవి.

---

1. శ్రీవరదరాజస్తవము 71వశ్లో.

సూక్ష్మములను తత్త్వాంశములను సూటిగ వివరించిన ఘట్టములలో నిదియొకటి. పైనఁ జేర్కొనిన యంశముల నీ ఘట్టమెట్లు నిర్ణయించినదియో పరిశీలింతము—

## 1. శ్రీమన్నారాయణ పారమ్యము

వృత్రాసుర వృత్తాంతమున శ్రీమన్నారాయణుఁడే సృష్టి స్థితి లయ కారకుఁడగు పరబ్రహ్మముగా స్థాపింపఁబడినాఁడు.

వృత్రాసుర పీడితులగు దేవతలందఱు శ్వేత ద్వీపమునకుఁ బోయి శ్రీమన్నారాయణుని శరణుఁ గోరిరి. ఆ సందర్భమున గావించిన వారి స్తుతి వాక్యముల వలన శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని వెల్లడి యగుచున్నది—

“తన సేవకులలోనఁ దనరు నీ రూపంబు
శ్రీవత్స కౌస్తుభ శ్రీలఁ దెలుప
వికచాబ్జముల తోడ వీడ్వడు కన్నుల
కరుణ దైవారెడు కరణిఁ దెలుప
నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ
గాపురంబుండెడు కమల దెలుప
మూడు మూర్తులకును మొదలైన తేజంబు
ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప
నొద్దిఁ దోల్పరాని పుణ్యంబుఁ దత్పాద
కమల జనితమైన గంగ దెలుప
నప్రమేయుఁ డభవుఁ డవ్యక్తుఁ డవ్యయుఁ
డాది పురుషుఁ డఖిలమోది యొప్పె” (6–333)

ఈ పద్యము శ్రీమన్నారాయణుని దివ్యమంగళ విగ్రహమును వర్ణించు నెపమున వాని పరతత్త్వమును నిరూపించుచున్నది.

అట్లే చిత్రకేతునియొక్క మృత కుమారుని దేహములోఁ బ్రవేశింపఁజేసి నారదునిచే నుపదేశింపఁబడిన జీవుఁడు పల్కిన పల్కులలో శ్రీమన్నారాయణుఁడే పరబ్రహ్మమని చెప్పఁబడినది—

“ఒక్కఁడై నిత్యుఁడై యెక్కడఁ గడలేక
సొరిది జన్మాదుల శూన్యుఁడగుచు

సర్వంబునందుండి సర్వంబుఁ దనయందు
　　నుండంగ సర్వాశ్రయుం డనంగ
సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు
　　సామ్యమై స్వప్రకాశమున వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు యఖిల ప్రకాశుఁడై
　　యఖిలంబుఁ దనయందు నడఁచి కొనుచు
నాత్మమాయా గుణంబుల నాత్మమయము
గాఁగ విశ్వంబుఁ దన సృష్టి ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వజంతువులందు
రమణ విశ్వాత్ముఁడయిన నారాయణుండు" (6–464)

ఈ నారాయణ తత్త్వమును శంకరుఁడు పార్వతితో నిట్లు వర్ణించినాఁడు—

"అతని కిం బ్రియుఁ డప్రియుఁ
డే తెఱఁగున లేఁడు నిఖిలమెల్లను దానై
భూతముల కాత్మయగుటయు
భూత ప్రియుఁ డొక్కఁడాది పురుషుఁడు తన్వీ" (6–500)

మఱియు సర్వ దేవతలందును శ్రీమన్నారాయణుఁడే శ్రేష్ఠుఁడని శివుని పలుకులలో వెల్లడింపఁబడినది—

"నేనుఁ గుమార నారదులు నీరజగర్భుఁడు దేవ సంఘమున్
మానిత యోగివర్య ముని మండల మిట్లగువార మందఱున్
దానవ విద్విడంశ జనితంబుల మయ్యుఁ దదీయ తత్త్వముం
గానఁగ నేర మీ కుహన గర్వమునం దలపోసి చూచుచున్ (6–499)

ఇట్లీ ఘట్టమున నారాయణ పారమ్యము నిరూపింపఁబడినది.

## 2. దివ్యమంగళ విగ్రహ వర్ణనము

వృత్రుని వలనఁ గలిగిన యాపదను గూర్చి మొరఁబెట్టు కొనుటకు దేవత లందఱు శ్వేత ద్వీపమునకుఁ బోయి శ్రీమన్నారాయణుని స్తుతింపగాఁ గరుణించి వారికి నా దైవము సాక్షాత్కరించిన సందర్భమున నా దేవదేవుని దివ్య మంగళ విగ్రహమిట్లు వర్ణింపఁబడినది—

"తగు శంఖ చక్ర గదాధరుండగు వాని
    శ్రీవత్స కౌస్తుభ శ్రీలవానిఁ
గమ నీయ మాణిక్య ఘన కిరీటము వాని
    దివ్యవిభూషణ దీప్తివాని
మండిత కేయూర కుండలంబుల వాని
    సిరి యురస్థ్సలమునఁ జెలఁగు వానిఁ
దమఁ బోలు సేవక తండంబు గలవాని
    జిలుఁగైన పచ్చని వలువవానిఁ
దెల్లదమ్మి విరులఁ దెగడు కన్నుల వాని
నవ సుధా ద్రవంపు నవ్వు వానిఁ
గలిమె పేల్మి పిందు కప్పురపాటులోఁ
గన్నులందు నున్న కలుపు దీఱ"  (6-382)

ఇందు వర్ణితములైన దివ్యాయుధములుఁ, దన్నుఁబోలు సేవక తండము, పుండరీకాక్షులు, దివ్యభూషణములు. నురస్థ్సలమునఁ జెలఁగు సిరి– ఇవి యన్నియు విశిష్టాద్వైత మతమున నిత్యములు – నిత్య సత్యములు - పారమార్థికములు. ఇట్లు శ్రీమన్నారాయణుని దివ్య మంగళ విగ్రహమును సమయము గలిగినప్పు డెల్ల వర్ణించుట భాగవత పురాణమునఁ దరచునఁ గానవచ్చు లక్షణము.

## 3. భాగవతుల మాహాత్మ్యము

ఈ వృత్రాసుర వృత్తాంతమున భాగవతుల విశిష్టత విశేష రూపమున వెల్లడింపఁ బడినది. ఇంద్రునితో వృత్రుఁడు పలికిన పలుకులలో నీ భాగవత నిష్ఠ సుష్ఠుగా స్పష్టీకరింపఁ బడినది.

"అద్దేవుని పాదైక మూలంబుగా నుండు దాసులకు
దాసాను దాసుండ నగు చున్నవాఁడను"  (6-398)

అని వృత్రుఁడు తన భాగవత ప్రావణ్యమును బ్రకటించుకొనినాఁడు. మఱియు -

"నాకము సత్యము పుణ్య
శ్లోకులతోఁగాని తత్త్వ భూమ్యలు నంసా

దైవ విమోహాంధ లోకం

గాకుండ బోవచ్చునట్టి కంజదళాక్షా" (6-401)

అని తపను భాగవతులతోడి సంగతిని కాంక్షించెను.

వృత్రాసురుఁడు పూర్వ జన్మమునఁ జిత్రకేతు మహారాజు. ఆ రాజుయొక్క భాగవత వర్తనమిట్లు వర్ణింపఁబడినది—

"ఆడించున్ హరి దివ్య నాటక గుణ వ్యాపార నృత్యంబులం

బాడించున్ జలజాత నేత్ర విశద ప్రఖ్యాత గీతంబులం

గూడించున్ సతతంబు జిహ్వల తుదిన్ గోవింద నామావళుల్

క్రీడం గిన్నర యక్షకామినులచేఁ గృష్ణార్పిత స్వాంతుఁడై" (6-484)

తోడి వారి కాదర్శప్రాయుఁడైయున్న భాగవత శ్రేష్ఠుఁడగు చిత్రకేతు వర్తనమిది—

మఱి కృష్ణార్పిత స్వాంతుఁడగు నితఁడు కేశవ ప్రీతికరముగా మెలఁగిన విధానమిట్లు వర్ణింపఁబడినది -

"వాసించు నాత్మలో వైష్ణవ జ్ఞానంబు

నాశించు భాగవతాశ్రయంబు

భూషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని

భాషించు హరికథాప్రౌఢి మెరసి

ఘోషించు హరినామ గుణ విశేషంబులు

పోషించుఁ బరతత్త్వ బోధమరసి

సేవించు శ్రీకృష్ణ సేవక నికరంబు

సుఖమునఁ జేయు నీడునకు బలులు

పాడుఁ బాడించు వైకుంఠభర్త నటన

రూపవర్తన గుణనామ దీపితోరు

గీత వాద్య ప్రబంధ సంగీత విధులఁ

గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁడపుడు" (6-[illegible])

ఈతని పరమ భాగవత వర్తనమున భాగవత సేవావిష్ట చైతన్యమొక విలక్షణ స్థానము నాక్రమించినట్లు పై పద్యమునందలి- "ఆశించు భాగవతాశ్రయంబు" "సేవించు

శ్రీకృష్ణ సేవక నిష్ఠుండు" అన్న ప్రశస్తిని అందుకొనియున్నాడు.

చిత్రకేతుని పార్వతి శపింపగా నామెను ప్రతిశాపము నీయఁగలిగియు శాంతుఁడై యామెకు నమస్కరించి వెడలిపోయిన యాతని గురించి శంకరుఁడు పలికిన పలుకులు—

"నీకు నిపుడు దృష్టంబయ్యెఁ గదా నారాయణదాస దాసానుచరుల నిస్పృహ భావంబు. హరితుల్యార్థ దర్శనులై నిస్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గనరక భేదభావంబులు లేవు" (6-498)

ఈ వాక్యముల వలన శ్రీమన్నారాయణుని భక్తి గలిగిన భాగవతులఁ, తద్భాగవతానుచరులు పరమశ్రేష్ఠులుగా వర్ణింపఁబడినారు.

## 4. భక్తియోగ ప్రాశస్త్య వివరణము

వృత్రుని వలనఁ గలిగిన కష్టములను భరింపలేక దేవతలెల్లరు శ్రీమన్నారాయణునిఁ శరణుఁజొచ్చిరి.

"భక్తి పరవశులైన" (6 345) వారి వినుతుల విని నారాయణుఁడు పలికిన పలుకులు -

"నా భక్తి పోదము వ్యర్థంబగునే" (6-346)
"ప్రీతుండ నయిన నాయందు భక్తులకుం బొందరాని
యర్థంబు లేదు" (6-347)

ఇత్యాది వాక్యములు భక్తియోగ ప్రాశస్త్య నిర్ధారకములు.

వృత్రుఁ డింద్రునితోఁ బలికిన పలుకులలో భక్తియోగ వైభవమిట్లు వర్ణింపఁబడినది —

"నారాయణుని దాసుండనైన నాకు స్వర్గమర్త్య పాతాళంబులంగల సంపద్భోగంబు లిచ్చగింపఁబడవు" (6-398)

వృత్రుని వేదాంత వాసనా వాసితములగు పలుకులు విని వాసవుఁడు పలికిన పలుకులు—

"నారాయణ రూపామృత
పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ
దార కృత ఖాత కోదక
పూరంబుల నేల తృప్తిఁబొందు మహాత్మా" (6-423)

ఈ పలుకులలో భక్తియోగ ప్రాశస్త్య ముగ్గడింపఁబడినది.

ఈ విధముగా వృత్రాసుర వృత్తాంత మనేక విశిష్టాద్వైత ప్రసిద్ధములగు సిద్ధాంతములను సమర్థించుచు శ్రీవైష్ణవ సంప్రదాయ గౌరవ భాసురమై భాసిల్లుచున్నది.

# 8. ముచికుందోపాఖ్యానము

దశమ స్కంధమునందలి యీ యుపాఖ్యానము శ్రీకృష్ణుఁడే నారాయణుఁ డనియు, నాతఁడే పరబ్రహ్మమనియు, నాతఁడు మోక్ష ప్రదానము చేయఁగల సమర్థుఁడనియు ప్రబోధించి యాతని పారమ్యమును స్థాపించుచున్నది.

మాంధాత తనయుఁడు ముచికుందుఁడు ఇక్ష్వాకు కుల సంభవుఁడు. రాక్షస భీతులైన వేల్పులను చాల కాలము సంరక్షించినాఁడు. దేవతలు మెచ్చి మోక్షము తక్క తక్కిన వరమేదైన నిచ్చెదమని పలికినారు—

"వరమిచ్చెద మర్థింపుము
ధరణీశ్వర ! మోక్షపదవి దక్కను మేమె
వ్వరమును విభులము గా మీ
శ్వరుఁడగు హరిదక్క మోక్షసంగతిఁ జేయన్"

(10 - పూ.భా - 1643)

ఈ పలుకులలో విశిష్టాద్వైత సమ్మతములగు సంగతము లిమిడి యున్నవి. హరి యీశ్వరుఁడని, అన్య దేవతల కశక్యమైన మోక్ష ప్రదాయకత్వ మీతనికి కలద నియు, నందుచే నన్యదేవత లందఱి కంటె నీ హరి పరముఁడనియు, మోక్షప్రదాన ముచే నాతఁడే పరబ్రహ్మమనియు నీ వాక్యముల వలనఁ దెలియనగును. ఈశ్వర శబ్దము పరబ్రహ్మవాచకముగా శ్రీవైష్ణవ సంప్రదాయము. అద్వైత సంప్రదాయ మున "ఈశ్వరుఁడు" మాయలో ప్రతిఫలించిన పరబ్రహ్మమని వ్యవహారము. అట్టి యీశ్వరుఁడు శివకేశవులలో నెవ్వరైన నద్వైతమున కభ్యంతరములేదు. విశిష్టా ద్వైత సంప్రదాయమునఁ బరబ్రహ్మమునకు ఈశ్వరుఁడని వ్యవహారము. అతఁడు శ్రీమన్నారాయణుఁడు మాత్రమే యనియు సమ్మతము. పై పద్య మీ యభిప్రాయ ములకనుకూలముగా నున్నది.

ముచికుందుఁడు శ్రీకృష్ణుని బరబ్రహ్మమగు నారాయణుఁడుగా గ్రహించి భక్తితో స్తోత్రము చేసినాఁడు.

"సంసారిసై యున్న జనులకు నీశ్వర !
నీ కృప యెప్పుడు నెఱయఁగల్గు

అప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు
బంధమోక్షంబైన బ్రాప్తమగును
సత్సంగ మందు సత్సంగమంబున నీదు
భక్తి సిద్ధించు నీ భక్తి వలన
సమ్ముక్తియగు నాకు సత్సంగమము గంటె
మను రాజ్యబంధ నిర్మూలనంబుఁ
గలిగినది దేవ ! నీ యనుగ్రహము గాదె
కృష్ణ! నీ సేవగాని తక్కినవి వలదు
ముక్తి సంధాయి వగు నిన్ను ముట్టఁ గొలిచి
యాత్మబంధం బుఁ గోరునే యార్యుఁ డెందు (10 పూ.భా.1661)

భగవత్కృపచే బంధమోక్షమగుట, సత్సంగమముచే భక్తి గలుగుట భక్తి వలన ముక్తి కలుగుట యను నంశములును, శ్రీమన్నారాయణుఁడగు శ్రీకృష్ణుడే మోక్ష సంధాయి యగుట యనునంశము విశిష్టాద్వైత సంప్రదాయ సంపాదితములు.

ఇట్లే ముచికుందో పాఖ్యాన మీ విధముగా విశిష్టాద్వైత సంప్రదాయ ప్రబోధకము.

# 8వ అధ్యాయము

## “ఆంధ్రభాగవతము-
## ఆళ్వారాదుల రచనలతోఁ బోలిక”

శ్రీమద్భాగవత మహాపురాణము భక్తికిఁ బట్టము గట్టిన మహాగ్రంథము. ఈ భాగవతము శ్రీమన్నారాయణుఁడే ప్రోత్సహించినదియు, తత్ప్రాప్తికి భక్తియే హేతు వనియుఁ బ్రతిపాదించుచున్నది. శ్రీవైష్ణవ కులమునకు బట్టుకొమ్మయై యున్నది. విశిష్టాద్వైత ప్రవర్తకులగు నాళ్వారుల యొక్కయు, నాచార్యుల యొక్కయు సూక్తులకు వాసనలుగా నిలిచి సంప్రదాయ పరులగు భాగవతుల కాదర పాత్రమై శోభిల్లు చున్నది.

భాగవతమును దన ప్రవృత్తికిఁ దగినట్లు విశిష్టాద్వైత సంప్రదాయాను సారముగా సమనువదించిన పోతనయు, నాతఁడేర్పరచిన యా మార్గముననే పయనించిన గంగన, సింగన, నారయలును తమ రచనలను శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రావణ్యము గల వారి కాదర పాత్రములుగా నిర్వహించినట్లు పరిశీలనలోఁ దేలినది.

ఈ పరిశీలనము నందే భాగవతము సనువదించిన పోతనాదుల యనువాదము లందు — ఉభయ వేదాంత ప్రవర్తకులగు[1] నాళ్వారుల యొక్కయు, శ్రీవైష్ణవా చార్యుల యొక్కయు, శ్రీ శంకర భగవత్పాదుల వంటి మనీషుల యొక్కయు సూక్తులతోఁ గొన్ని కొన్ని ఘట్టములలో సామ్యము గోచరించినది. వీనిలోఁ జెక్కులు కేవల స్వతంత్రములు. మూలమున రేఖామాత్రముగాఁ జెప్పఁబడిన దానిని వీరు (అనగా భాగవతానువాదకులు) విస్తరించిన ఘట్టములు కొన్ని.

అట్టి ఘట్టములలోఁ గొన్నిటిని దిక్ప్రదర్శనార్థము ప్రదర్శింతును—

1. ఉభయ వేదాంతమనగా విశిష్టాద్వైతము, 'నాలాయిరమ్' అనబడు తమిళ పాశురములు—వేదోపనిషదాది సంస్కృత వేదాంతము నను నుభయము ప్రమాణముగాఁ గలది.

1. తృతీయ స్కంధమున విదురుడు పాండవులకు రాజ్యము నిమ్మని ధృత రాష్ట్రునితోఁ జెప్పుచుఁ బాండవులను జగన్నాథుఁడగు శ్రీకృష్ణుఁడు చేపట్టియున్నాఁ డని చెప్పు సందర్భమున స్వతంత్రముగా నొక పద్యము రచించి యందు శ్రీకృష్ణునకుఁ బాండవులకు గల సంబంధమును వర్ణించియున్నాడు —

"అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే
పట్టి సఖుండు నెయ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై
యిట్టలమైన ప్రేమమున నెప్పుడుఁ బోద్పడుచుండ వారలన్
జుట్టన ప్రేల నెప్పటికిఁ జూపఁగవచ్చునె పార్థివోత్తమా !

(3-31)

ఈ పద్యమున శ్రీకృష్ణునితోఁ బాండవులకుఁ గల చేరిమి కూరిమి భగవద్రామానుజులు తమ శరణాగతి గద్యలోఁ జేర్కొనిన యొక శ్లోకమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

"త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥[1]

భగవంతునకు భక్తునకుఁ గల సంబంధమును దైశ్లోకమునను పోతన పద్యమునను విపులముగాఁ జూడగలము.

విశిష్టాద్వైత వ్యాఖ్యాకారుఁడగు శ్రీ వీరరాఘవాచార్యులీ ఘట్టమున గల మహాభాగవత శ్లోకములను వ్యాఖ్యానించుచు "మమ ప్రాణాహి పాండవాః" అను భగవంతుని పలుకులను జ్ఞప్తికిఁ దెచ్చియున్నాఁడు[2]

ఈ సందర్భమున భక్తి తత్త్వ మెఱిఁగిన "భక్తపోతన" భక్తిరస తరంగి తాంతరంగుఁడై పాండవులకు శ్రీకృష్ణునకుఁ గల సంబంధమును సమీచీనముగా వ్యక్తీకరించి యున్నాఁడు.

ఈ యనువాద విధానము శ్రీ శంకర భగవత్పాదులవారి ఈ క్రింది శ్లోకముతో సామ్యము కలిగియున్నది.

---

1. శరణాగతి గద్య
2. శ్రీమద్భా-శ్రీ వీరరాఘవీయ వ్యాఖ్య 3-1-13

మాతా నృసింహశ్చ పితా నృసింహః
భ్రాతా నృసింహశ్చ సఖా నృసింహః।
విద్యా నృసింహో ద్రవిణం నృసింహః
స్వామీ నృసింహ స్సకలం నృసింహః॥[1]

మఱియు భగవత్పాదుల వారి పై శ్లోకము భగవద్రామానుజుల పేర్కొన్న శ్లోకము నొక్క రీతిలో నుండుట గుర్తింపఁదగిన యంశము.

పోతన యీ పథమునందే యర్జునునిచే నిట్లు పలికించియున్నాఁడు—

"మన సారథి మన సచివుఁడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుడున్
మన విభుఁడు గురుఁడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా !

(1 – 358)

శ్రీకృష్ణ నిర్యాణముచేఁ గలిగిన యార్తితో గూడిన భగవత్సంబంధ వర్ణన మర్జునుఁడు ధర్మజునితోఁ బలికిన యీ పలుకులలో వ్యక్తమగుచున్నది.

2. సన్నిద్దరాళ్వారులలో నన్యతములగు శ్రీమహాయోగి యని పిలువఁబడు పేయాళ్వారులు తమకు భగవద్గుణానుభవము సిద్ధించి, యా శ్రీమన్నారాయణుని యను గ్రహముచే బరమ భక్తి జనించి, భగవత్సాక్షాత్కారముచేఁ గల్గిన జ్ఞానవైశద్యమగుణముగ స్వరూపోపాయ పురుషార్థముల తత్త్వ విశేషములను దమ "మూడవ తిరువన్దాది" యను దివ్య ప్రబంధమున వివరించి యున్నారు. అందొకచో నొక పాశురమున క్షీరసాగర మథన వృత్తాంతమును దలఁచుకొని శ్రీమన్నారాయణుని యద్భుత చేష్టితమును దాని వలన వ్యక్తమగుచున్న యాదేవుని పారమ్యమును శ్లాఘించి యున్నారు. ఆ పాశురార్థమిది—

"జగములకు మూల కారణముగా నున్న స్వామి, మును తొల్లి నీతడు శిఖరాన్వితమైన మంధర పర్వతమును గూర్మరూపమునఁ దన వీపుపై నుంచుకొని, వాసుకి

1. కరావలంబ స్తోత్రము.

భాగమును దాటి, కొంత పైభాగము నొకవేళ వదిలివట్టి కెరటముల తుంపరలు బ్రహ్మాండపు పై భాగము వరకు నెగిరిపడునట్లు సముద్రమును చిలికెను"[1]

ఈ పాశుర సారాంశము - దేవాసురుల వ్యాజముగాఁ గొని సముద్రమును భగవంతుఁడే చిలికినాఁడు.

ఈ యాళ్వారుల భావమునే 'అష్టమస్కంధమున' సముద్రమథన ఘట్టమునఁ బోతన యీ క్రింది విధముగ మూలమునను సరించి యనువదించి యున్నాఁడు —

"తరిగొండ్రలోన నొకఁ డట
తరిగడవకుఁ గుదురు నొకఁ త్రాడఁటఁ చేరుల్
దరి గవ్వంబునుదానఁట
హరిహరి! హరి చిత్రలీల హరియేయెఱుఁగున్"

(8-205)

ఈ పద్యము హృద్యమైనను మూలాను సరణము వలన సారరణమైనదే. ఆ తరువాత గల పద్యము మాత్రము శ్రీమహాయోగి పద్యుల యూహతో సరిపడునట్లు పోతన యమూలకముగా వ్రాసిన పద్యము—

"జలధిఁగడవ సేయ శైలంబుఁ గవ్వంబు
సేయ భోగిఁ ద్రాడు సేయఁ దరువ
సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క
నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె"

(8-206)

ఈ పద్యమునందుఁ బేయాళ్వారుల వలెనే శ్రీమన్నారాయణుని సర్వశక్తిత్వమును పోతన ప్రస్తుతించి యాతని ప్రగాఢ పారవశ్యమును సూచించియున్నాఁడు.

3. ముకుందమాలా కర్తలు, పరమ భక్తాగ్రగణ్యులునగు శ్రీ కులశేఖరాళ్వారుల దివ్య ప్రబంధము "పెరుమాళ్ తిరుమొళి." ఆ దివ్య ప్రబంధమున శ్రీకృష్ణుని యవతార వైభవమును వర్ణించు సందర్భమునఁ గల యొక పాశురార్థ మిది —

---

1. ఇయర్పా-మూడవ తిరువన్దాది 46వ పాశురము.

"మండలో నున్న వెన్నమంతటిని జుఱ్ఱుకొని యారగించువప్పటి కరాంబుజ సన్నివేశమును, గోపించిన తల్లి యశోద త్రాటిని–చేతఁ గొనగనే చూచి భయపడు సన్నివేశమును, వెడగంటిన ముఖారవింద స్థితిని, రోదనమును, వెఱపు చూపును, నభిరామమైన నధర స్ఫురణమును, గడపట నంజలి బంధమును పీని నన్నింటినిఁ గాంచి యశోద నిత్యానందసీమాభూమిని్ఁ గన్నది" [1]

ఆళ్వారు ఈ విధముగా యశోద పొందిన యనుభవమును దమ యూహకుఁ దెచ్చుకొని సంతోషించి యున్నారు.

పోతన సైత మీ యశోదానందానుభవానందమును దమ యనుభవమునకుఁ దెచ్చుకొనిన సన్నివేశ మొకచో నున్నది. ప్రథమ స్కంధమున నీ క్రింది పద్యము కుంతిదేవి శ్రీ కృష్ణుని స్తుతించు సందర్భములోనిది —

> "కోపము తోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
> గోపిక త్రాటఁగట్టిన వికుంఠిత సాంజన బాష్పతోయ ధా
> రా పరిపూర్ణ వక్త్రిముఁ గరంబులఁ ద్రాయుచు వెచ్చ నూర్చుచుం
> బాపఁడవై నటించుట కృపాపర ! నా మదిఁ జోద్య మయ్యెడిన్"
>
> (1–192)

ఈ పద్యము వ్యాస భాగవతమున నొక శ్లోకమునకు ననువాదమైనను "పాపఁడవై నటించుట కృపాపర ! నా మదిఁ జోద్యమయ్యెడిన్" అను భాగము పోతన స్వీయ కల్పనమై యాతని స్వానుభవమును జాటుచున్నది. "కృపాపర" యను సంబోధన మీ ఘట్టమున భగవానుని యాశ్రిత వాత్సల్యమును వ్యజ్యమానము చేయుచున్నది.

వ్యాస భగవానుఁడు దర్శింపఁ జేసిన యా దివ్య దృశ్యమును దన మనో నేత్రముతో దర్శించి తరించిన శ్రీ కులశేఖరులు, పోతన యన్నఁదాదుల కా యను భవ సుధనీ విధముగ నందించి యున్నారు.

శ్రీ వేదాంత దేశికుల వారీ సన్నివేశమునే తమ "గోపాల వింశతి"లో —

> "హర్తుం కుమ్భే వినిహితకరః స్వాదు హైయ్యఙ్గవీనం
> దృష్ట్వా దామ గ్రహణ చటులాం మాతరం జాతరోషాం।

---

1. పెరుమాళ్ తిరుమొళి VII - 8.

పాయాభీషణశ్రుతిచలిత వదో నావగచ్ఛ న్నతిష్ఠన్
మిథ్యా గోపస్సపది నయనే మీలయన్విశ్వగోప్తా॥[1]

అని మృదు మధుర గంభీర పణితిలో వర్ణించియున్నారు. విశ్వ రక్షకుఁడగు కుహనా గోపాలబాలుఁడు తల్లి వలన భీతిల్లి వెడల లేక నిలువ నేరక కన్నులు మూసికొనిన యపూర్వ సుందర దృశ్యమును మన కనుల యెదుట సాక్షాత్కరింపఁ జేసినారు శ్రీ వేదాంత దేశికులు. వీరు పోతనకుఁ గొంచెము పూర్వులు.

శ్రీ నమ్మాళ్వారులు తమ దివ్య ప్రబంధమగు "తిరువాయ్ మొళి" యందు నీ ఘట్టమును బరమావేశవశీభ స్వాంతులై వర్ణించియున్నారు. ఆ వివరణమిది—

"భక్తి గలిగి చరణము లాశ్రయించిన వారికి సులభుఁడు తక్కిన వారికి దుర్లభుఁడును, నాశ్చర్య భూతుఁడును, కుసుమ సుకుమారియగు లక్ష్మిచే మోహింపఁ బడు వాఁడును, సుదుర్లభుఁడును నగు స్వామి కవ్వము నుండి వెన్నను దొంగిలించుటలో రొమ్ముకుఁ గట్టఁబడిన తోటతో నుండిన యా సౌలభ్య గుణము తానెట్టిదో"[2]

పోతన పద్యమున సమూలకముగాఁ బ్రయోగింపఁబడిన "కృపాపర" యను సంబోధనమునకు మూల మనఁదగిన యీపాశురమునఁ గల—భక్తి గలిగి చరణముల నాశ్రయించినట్టి వారికి సులభుఁడు—అనునది. "నా మది చోద్యమయ్యెడిన్" అను దానికి మూల మనఁదగినది "ఆశ్చర్యభూతుఁడును" అను నీ పాశురమునందలి భావము.

మూలమున లేకున్నను స్వతంత్రముగాఁ బోతన చేర్చిన పై రెండంశము లును, నదే ఘట్టమును వర్ణించు శ్రీ నమ్మాళ్వారుల పాశురమునందు స్పష్టముగా గోచరించు చుండుటచేఁ బోతన యీ పాశురార్థము నెఱిఁగియే, దీనిని దృష్టిలో నుంచుకొనియే పై పద్యమును రచించెనని చెప్పవచ్చును.

భగవద్రామానుజుల ప్రియ శిష్యులు మన పోతనకుఁ బూర్వులు నగు శ్రీ కూరత్తాళ్వానుగారు పైన పేర్కొన్న శ్రీ నమ్మాళ్వారుల పాశురముచేఁ బ్రభావితులై కాఁబోలు—

1. గోపాల వింశతి.
2. తిరువాయ్ మొళి 1–3–1.

తమ శ్రీ వరదరాజస్తవమున నీ సన్నివేశము నిట్లు చక్కగా వర్ణించి యున్నారు —

భవత్సు వాత్సల్య వశాత్సముత్సుకః
ప్రకామ మాత్రాప తరేర్వర ప్రదః
భవేశ్చ తేషాం సులభో ౽ థ కిన్న్విదం
యదగ్ర దామ్నా నియతః పురా ౽ రుదః ॥[1]

[ఓ వరదా ! నీవు భక్తులయందు వాత్సల్యముచే నీ లోకమున నవతరించి వారికి సులభుఁడవై యుండుదువుగాక ! త్రాటిచేఁ గట్టఁబడి యేడ్చుట యను నిది యేమి ? ఆశ్చర్యము !]

ఈ శ్లోకము నందలి - భక్తుల యందు వాత్సల్యముచే - ఇది యేమి ? ఆశ్చర్యము - అను నీ రెండంశములు పోతన పద్యములో నాతనిచే నమూలకముగా నిక్షేపింపఁబడిన "కృపావర", "నా మది చోద్యమయ్యెడిన్" అను రెండంశము లతో బింబ ప్రతిబింబ రూప సామ్యము కలవై యున్నవి.

కావునఁ బై సన్నివేశమును బరిశీలింపగా నాళ్వారులందరిలోఁ బ్రధానులుగాఁ బరిగణింపఁబడుచున్న శ్రీ నమ్మాళ్వారుల దివ్య ప్రబంధ సూక్తిచేఁ బ్రభావితులై శ్రీ కురత్తాళ్వానుగారును - వీరిరువురి దివ్య సూక్తులచేఁ బ్రభావితుడై పోతన యు నా సుందర గోపాలుని బాల్యచేష్ట నిట్లు పరమ రమణీయముగా వర్ణించి యుండినట్లు భావింపవచ్చును. ఇందుచేఁ బోతనకు విశిష్టాద్వైత సంప్రదాయ, ప్రవర్తకుల సూక్తులతోఁ బ్రగాఢ పరిచయము - విశేషాదరము కలవని చెప్పవచ్చును.

4. భగవద్రామానుజులకుఁ బ్రీతిపాత్రులును, శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులలో నగ్రగణ్యులును, బోతనకుఁ బూర్వులును నగు శ్రీ భట్టరువారు తమ శ్రీ రంగరాజస్తవము- ఉత్తర శతకమున సర్వావతార పై భవమును బ్రస్తుతించుచు గజేంద్ర మోక్షణ ఘట్టమును వర్ణించియున్నారు ఆ సందర్భమున —

"దేవీ హస్తాంబుజేభ్యశ్చరణ కిసలయే సంపహద్భ్యో వహ్నాత్య
ప్రత్యస్తాన స్త భోగం ఝటితి చలవుటే చటషి విక్షుణానః

1. శ్రీ వరదరాజస్తవము 70 వ శ్లో.

ఆక్షిప్తోరస్య లక్ష్మీ స్తన కలశ కషత్కుంకుమ క్షోద పంకాత్
దేవ ! శ్రీరంగధామా ! గజపతి ముషితే వ్యాకులం ప్రాదురాసీః"[1]

[గజేంద్రుఁడు మొరఁబెట్టగాఁ బాదము లొత్తుచున్న శ్రీదేవి హస్తముల నుండి తన పాదములను దొలఁగించి, శయ్యామైన యనంతుని శరీరమును ద్రోసివైచి, లక్ష్మీ స్తన కలశపంకము నుండి వక్షస్థలము నాకర్షించుకొని కదలుచున్న రెప్పలుగల నేత్రములను విస్తరింపఁజేసి వ్యాకులుఁడై శ్రీరంగనాథుఁడు మా యెదుట సాక్షాత్కరించు గాక !]

ఈ శ్లోకము జాడలోనే పోతన తెలుఁగు సాహిత్యమునఁ జిరకీర్తి వార్జించిన కొన్ని పద్యముల నీ యష్టమ స్కంధము-గజేంద్ర మోక్షణ ఘట్టమున వ్రాసి యుండుట విశేషము.

ఆపన్న ప్రపన్నుండు విహ్వల నాగేంద్రము "పాహి పాహి" యనగా "సంరంభియై" బయలుదేరినాఁడని పోతన చెప్పినాఁడు. భట్టరువారి పై పద్యమున గూడ శ్రీమన్నారాయణుని సంరంభము "ప్రత్యేకముగా" వర్ణింపఁబడినది గదా !

శ్రీ భట్టరువారి మార్గమునఁ బోతన వ్రాసిన పద్యము—

"సిరికిం జెప్పఁడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగ పతిం బన్నింపఁ డాకర్ణి కాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాద ప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై" (8-96)

శ్రీ భట్టరువారి రచనము నందును, పోతన పద్యమునందును గజ ప్రాణావనోత్సాహము సమానము. సిరికిం జెప్పక, యాయుధముల గ్రహింపక, వాహనమును సిద్ధము చేసికొనక వివాద ప్రోత్థితమైన శ్రీకుచోపరి చేలాంచలమును గూడ వీడక పోతన నారాయణుఁడు పరువులు పెట్టినాఁడు. లక్ష్మీదేవి చేతులనుండి పాదములను లాగుకొని, యనంతునిఁ ద్రోసివైచి, లక్ష్మీ స్తనకలశ కుంకుమము నుండి వక్షస్థలము నాకర్షించుకొని, కన్నులు విప్పార్చుకొని పరుగులు పెట్టినాఁడు శ్రీ భట్టరువారి రంగనాథుఁడు.

---

1. శ్రీరంగరాజ స్తవము-ఉత్తర శతకము-56వ శ్లో

భట్టరువారా తరువాతి శ్లోకమున మఱింత విపులముగా నీ ఘట్టమున రంగనాథుని భక్త రక్షణోద్యోగమును వర్ణించియున్నారు.

"అత త్విరిత చమూపతి ప్రహిత హస్త మస్వీకృత
ప్రణీత మణిపాదుకం కిమితి చాకులాంతః పురమ్।
అవాహన పరిష్క్రియం పతగరాజ మారోహతః
కరప్రవర బృంహితే భగవత స్త్వరాయై నమః॥"[1]

[గజేంద్రుఁడు మొరఁబెట్టగా సేనాపతి యిచ్చిన కయిదండ ననాదరించి, అంతఃపుర జనము తీసికొని వచ్చిన మణిపాదుకలను బరిగ్రహింపక, యంతఃపురములోని వారందఱిది యేమని వ్యాకుల పడుచుండగా వాహనోచితాస్తరణాదులు లేని గరుత్మంతు నధిరోహించు భగవంతుని త్వరకు నమస్కారము]

ఏ పరివారమును జీరక పోవుటయు, ఖగేంద్రునిఁ బన్నింపక పోవుటయుఁ బోతన వర్ణింపగా సేనాపతి హస్తానలంబము పరిగ్రహింపక పోవుటయు, వాహనో చిత పన్నద్ధత లేకపోవుటయు భట్టరువారి వర్ణనలోఁ జోటు చేసికొన్నవి. సంరంభము రెండింటను సమానమే.

ఈ విధముగా నీ యిరువురి నిర్వహణము సాగినది. ముఖ్యముగా నిటఁ బరిశీలింపఁదగిన యంశము— పైనఁ దేర్కొనిన భట్టరువారి శ్లోకము, పోతనగారి పద్యము నీ రెండును స్వతంత్రములు. పోతనగారి యమూలక కల్పన మీ పద్యము. భట్టరువారి శ్లోకములను జదివి, ప్రభావితుఁడై యా ఘట్టమున నిట్టి యమూలక కల్పనానల్ప శిల్ప ప్రదర్శనముఁ బోతన కావించి యుండునని నా నమ్మకము.

పోతన పద్యమును జదివినప్పుడు శ్రీ భట్టరువారి శ్లోకములు స్మృతి పథమున నిలుచుట తప్పనిసరి.

5. పేయాళ్వారులు తమ "మూదప తిరువన్దాది" యను దివ్య ప్రబంధ మున శ్రీకృష్ణుని భక్తవశ్యత నిట్లు ప్రస్తుతించి యున్నారు- వారి పాశురమున కర్థమిది—

"కడుపు నింపుకొనకుండలేని గోప కుమారుఁడు మన్నుఁదినియు రక్కసి చనుబాలు ద్రావియు, దొంగిలించిన వెన్న నారగించియు, దృప్తి బొందఁడాయెను.

---

1. శ్రీరంగరాజ స్తవము-ఉత్తర శతకము 57వ శ్లో

కాని యశోద కట్టివేయగా సర్వశక్తిమంతుఁడగు తాను కట్టుబడి తృప్తిపొందినాఁడు."[1]

ఈ పాశురములో నాళ్వారులు శ్రీమన్నారాయణుని భక్తవశంవదత్వమును ప్రకటించియున్నారు.

విశిష్టాద్వైత సంప్రదాయవేత్తయగు పోతన యీ మార్గముననే యనూంతిముగా దశమ స్కంధమున శ్రీకృష్ణుని దాస్యమును వర్ణించునెడ నీక్రింది పద్యమును విన్యసించి భగవంతుని భక్తజన పరతంత్రతను వెల్లడించియున్నాఁడు—

"తోరము గట్టుకరియు న
బ్జాక్షుఁడు విలసిల్లె భక్తి పరతంత్రుండై
యాలాన సన్నిబద్ధ వి
శాల మదేభేంద్ర కలభ సమరుచి నధిపా"

ఈ సందర్భమున మఱింత స్ఫుటముగాఁ బోతన యిట్లు వర్ణించియున్నాఁడు—

"చిక్కఁడు సిరి కౌగిటిలో
చిక్కఁడు సనకాదియోగి చిత్తాబ్జములం
చిక్కఁడు శ్రుతితతి కావలఁ
జిక్కెనతఁడు లీలఁ దల్లిచేతన్ రోలన్"

పై పద్యమున భక్తవశ్యతను వర్ణించి యీ పద్యమున శ్రీకృష్ణుఁడు పట్టుబడుట లోని వైచిత్రిని బోతన వివరించి యున్నాఁడు. అతఁడు సిరి కౌగిటిలో, సనకాది యోగుల చిత్తములలో, వేద లతలలోఁ జిక్కనివాఁడు, యశోదచేఁ బట్టుబడుట విచిత్రము. ఆళ్వారుల వాక్యములలో మన్నుఁదిన్నను, రక్కసి చనుబాలు త్రాగినను, దొంగ వెన్న తిన్నను తృప్తికలని స్వామి యశోదచేఁ గట్టుబడి తృప్తిపడుట రెండు సందర్భములందును సామ్యము.

6. శ్రీమన్నారాయణ పరాఙ్ముఖులై విషయవాంఛలచేఁ గట్టుపడియున్న మానవుల యజ్ఞానమునకుఁ బరితపించి తమ సూక్తులచే వారిని సన్మార్గమునకుఁ ద్రిప్పుటకు శ్రీ కులశేఖరాళ్వారులు తమ ముకుంద మాలా స్తోత్రమున నీ విధముగాఁ బ్రబోధించియున్నారు—

1. ఇయఱ్పా-మూదల తిరువన్దాది 91 వ పాసురము

"నాథేవః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి।
యం కఞ్చిత్పురుషాధమం కతిపయ గ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూఢా వరాకావయమ్"॥[1]

[సర్వ జీవులకు స్వభావ సిద్ధముగాఁ బాలకుఁడును, ముల్లోకములకు నేకైక నియంతయు, మనసార సేవింపఁదగిన వాఁడును, బురుషోత్తముఁడును నగు నారాయణుని పరచర్యమాని, కొలఁది గ్రామముల కధిపతియు, నించుకంత విత్తము నొసఁగువాఁడు నీచుఁడును, భక్తి హీనుఁడును, నశించువాఁడును, బురుషాధముఁ డునగు నొక మానవునిఁ గొల్చుటకు పత్యంతయత్నము చేయుట యవివేకుల లక్షణము గదా !]

ఈ కులశేఖరాళ్వారుల ప్రబోధమునే జ్ఞప్తికిఁ దెచ్చుచు భాగవతమున దశమ స్కంధమునఁ బోతన వ్రాసిన యీ పద్యము పరిశీలింపఁ దగినది —

శ్రీ కృష్ణుఁడు రుక్మిణీ రమణితో విస్రంభాలాపము లాడుచు నల్పుని నన్నేల వరించితివని నిష్ఠురముగాఁ బలుకగా రుక్మిణి యాతనికి సమాధానము నిచ్చు సందర్భములోనిదీ క్రింది పద్యము—

"విమల జ్ఞాన నిరూఢులైన జనముల్ వీక్షింప మీ పాదకం
జ మరంద స్ఫుట దివ్య సౌరభము నాస్వాదించి నిర్వాణ రూ
పము సత్పూరుష వాగుదీరితము శోభా శ్రీనివాసంబునౌ
మిము సేవింపక మాన వాధముని దుర్మేధాత్ము సేవింతురే"
(10- ఉ.భా-255)

శ్రీనాథుని సేవింపక దుర్మేధాత్ముఁడగు మానవమాత్రుని సేవింప రమ నద్భ్యవసాయంబున నారాయణ పరాయణత్వమునే విశేషముగాఁ బేర్కొనఁదలచిన రుక్మిణి వాక్యములివి—

సేవాతిరేకముచేఁ దన కైంకర్యముచే స్వామిని మెప్పించిన లక్ష్మీ స్వరూప యగు రుక్మిణి పలుకులు- అన్యమెఱుఁగక భగవద్భాగవత సేవాతత్పరులై కీర్తిరన

1. ముకుందమాల 28 వ శ్లో.

మన్నులైన శ్రీకులశేఖరాళ్వారుల వాక్యములు శ్రీమన్నారాయణ భక్తినే ప్రబోధించుచున్నవి. ఆళ్వారుల యొరవరిలోఁగథానుసారముగ సందర్భోచితముగాఁ బాత్రోచితముగాఁ బోతన నోటినుండి వెలువడిన భక్తియోగ ప్రాశస్త్య విస్తారకమైన పద్యమిది.

ఈ పద్య నిర్వహణమునఁ బోతనపైనఁ జెప్పఁబడిన యాళ్వారుల సుప్రసిద్ధ శ్లోక భావమును మనమున నిడుకొని యీతీరుగా శ్రీమన్నారాయణ పారమ్య బోధకముగా తన యనువాదమును సాగించియుండునని నా యభిప్రాయము.

7. ఆళ్వారులలో విష్ణుచిత్తులకుఁ బ్రాముఖ్యము మెండు-వారికి సంప్రదాయమున "పెరియాళ్వార్" అని అనగా- పెద్ద యాళ్వారు- అని వ్యవహారము. గోదాదేవికిఁగన్న తండ్రియై శ్రీరంగనాథునకు సాక్షాత్తు మామగారుగాఁ బ్రసిద్ధులైన యీ యాళ్వారులకు విశిష్టాద్వైత సంప్రదాయమున నగణ్యమగు స్థానము కలదు. వారు తమ దివ్య ప్రబంధమున నొక్కచో శరీరావసాన సమయమున నీ స్మరణము. సాధ్యమగునో కాదో కావున నిప్పుడే నిన్ను స్మరింతును. అను గ్రహింపుము-అని పరి పరి విధముల వేడుకొనుట కాంచనగును. ఆ పాశురసారాంశమిది —

"ఓ రంగేశ్వరా! శేషశయనా! స్వామీ! భక్త రక్షణమున దక్షుఁడవగు నిన్నాశ్రయించుట సర్వేంద్రియములును శిథిలమైయుండు కాలమున రక్షింతువనియే గదా! దానికి నధికారివై గజేంద్రుని యాపదల నుండి రక్షించిన స్వామి నాయాపదలను గూడ దొలఁగించి రక్షింపఁగలఁడనియే యాశ్రయించితిని. ప్రాణావసాన కాలమునఁ గఱణ కళేబరములన్నియు, సర్వేంద్రియములును సన్నగిల్లి పోవును అప్పుడు మిమ్ముదలఁచుటయు దుశ్శకము. కనుక నపుడు పలింప వలసిన వాని నన్నింటిని పటుత్వముండిన యిక్కాలముననే తెల్పితిని"[1]

సమయమున్నప్పుడే కార్యము చక్క దిద్దుకొనవలయు ననునట్లు వయస్సు, పటుత్వము నున్నప్పుడే 'ప్రమాదపరత' భగవంతు నారాధింప వలయునని 'పెరియాళ్వారుల' యధ్యవసాయము- తమ "పెరియాళ్వార్ తిరుమొళి" యను దివ్య ప్రబంధమున నాల్గవ పత్తు పదియవ తిరుమొళి యందుగల పది యవపాశురములందును

1. పెరియాళ్వార్ తిరుమొళి నాల్గవ పత్తు-పదియవ తిరుమొళి-1 పాశురము.

శ్రీ వేదవ్యాసులవారు శ్రీ విష్ణుమూర్తి వలె వలె మహా వేద వర్ణనకులై యుపదేశించి యుండుటచూడగా వీరి కీ యంతటి ప్రసన్నవ్యక్తి ప్రభావము గలదని వెల్లడియగుచున్నది.

వీరి పలుకులతో సరిపడునట్లుగా "శ్రీకృష్ణ కర్ణామృతము" అను గ్రంథమున లీలాశుక మహాకవి శ్రీ కృష్ణునిట్లు ప్రార్థించియున్నారు—

యావన్న మే నరదశా దశమీ దృశో౽పి
రన్ధ్రా దుదేతి తిమిరీ కృత సర్వభావా।
లావణ్య కేలిభవనం తవ తావదేవ
లక్ష్మ్యా స్సముత్క్వణిత వేణు ముఖేన్దు బిమ్బమ్॥[1]

[ఓ కృష్ణా! నన్ను పదియవ మానవావస్థయగు ముదిమి చుట్టుకొనుటయేగాక కన్నులు కూడపోయి ప్రపంచమంతయు నంధకారమయము కాకముందే లక్ష్మీ విహార స్థానమగు వేణుగానము చేయు నీ మోము నొక్కసారి చూపుము]

పైన దెల్పిన పెద్దల పలుకులతో సామ్యము గలిగి భాగవతమున నేకాదశ స్కంధమున నారద- వసుదేవ యదుపుల సంభాషణ సందర్భమున నవదూత పలుకుల నిట్లు వివరించియున్నారు.—

"పరధన పరదార పరదూషణాదుల
బరవస్తు చింత దా బరిహరించి
ముదిమిచే రోగము బుట్టయుండకట మున్న
తనువు చంచల తను దగుల కుంత
బుద్ధి సంచలత చే బొదలక యుండుమున్న
శ్లేష్మంబు గళమున జేరకుంత
శక్తి యుక్తులమది సన్నగిల్లకమున్న
భక్తి భావన చేత బ్రోచుచగుచు .. .... (11-95)

నారాయణ సేవ గావించి కర్మముక్తులై యవ్యయానందమును జీవుడందు నని పల్కుచు, నారద యీ పద్యమున ముదిమిపై బడకముందే శ్రీహరి భక్తి కలిగి దీపముండగనే యిల్లు చక్కదిద్దుకొనినట్లు సద్గతిని బొందవలయునని యుద్బోధించి యున్నారు.

1. శ్రీ కృష్ణ కర్ణామృతము- ప్రథమాశ్వాసము-38 పద్యము.

నారయ పద్యమును పరిశీలించినప్పుడు కులశేఖరముని నారాయణ తత్త్వము నీటఁ దెలిసికొని విశిష్టాద్వైత సంప్రదాయ పథమున సాగినట్లు గోచరించును. ఈ సందర్భమున విశిష్టాద్వైత సంప్రదాయమునఁ గడు ప్రసిద్ధులగు శ్రీకులశేఖర పెరుమాళ్ గారి శ్లోకము—

"కృష్ణ! త్వదీయ పద పఙ్కజ పఞ్జరాన్త
మద్యైవ మే విశతు మానస రాజహంసః।
ప్రాణప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కణ్ఠావరోధన విధౌ స్మరణం కుతస్తే॥"[1]

[ఓ కృష్ణ! నీ పాదాంబుజములను పంజరము నందు నా మనస్సనెడి రాజహంస యిప్పుడే ప్రవేశించును గాక! ప్రాణములు పోవునప్పుడు నిన్ను స్మరించినఁ జాలు నని కొందఱందురు. కాని యా సమయమున వాత పిత్త కఫములు క్రమ్ముకొను టచే నది సాధ్యము కాదేమో]

శ్రీకులశేఖరాళ్వారీ శ్లోకమున భగవత్స్మరణము వెంటనే కావలయునని కోరినారు.

శ్రీ కులశేఖరులు, లీలాశుకుఁడు, పెరియాళ్వారులు మొదలిడి మునుపే శ్రీహరి స్మరణమును గోరుకొనగా నట్లు స్మరణము లభించినచో సద్యయానందమును బొంది జీవి కర్మముక్తుఁడుకాగలఁడని నారయ పూరించి సంప్రదాయ బద్ధముగా నిర్వహించిన వాఁడాయెను.

8. శ్రీకులశేఖరాళ్వారులు తమ దివ్య ప్రబంధమగు "పెరుమాళ్ తిరుమొళి" యందు భక్త జనుల తాదాత్మ్యదశను విపులీకరించి యున్నారు. భక్తుల యవస్థను దమ కన్వయించుకొని వివరించి యున్నారు. ఒక సందర్భమున వారిట్లు వక్కాణించి యున్నారు— ఆ పాశురార్థమిది—

"క్షీరసాగరమునఁ బవళించినవాఁడును, దుళసీదామ భూషితుఁడు నగు పుండరీకాక్షుని ప్రేమించువారు, వ్యామోహాతిశయముచే నర్తించు వారును, పాడువారును,

---

1. ముకుందమాల శ్లో 7

దివ్యదేశములయందు సంచరించువారును, సుస్మిత కల్బులను నగు భక్తుల విల క్షణ సంపదను జింతించి నా మనస్సు వ్యామోహము నొందుచున్నది."[1]

ఆ సందర్భముననే వారు మఱొక పాశురమున

"ఆనంద బాష్పములెడతెగక కాఱుచుండగా దేహములు రోమాంచ కంచు కితములగుచుండగా మనస్సులు భావావేశ వివశములగుచుండగా నిలిచిన చోట నిలు వక, కోలాహలముగ నాడుచుఁబాడుచు, మ్రొక్కుచు శ్రీరంగనాథుని విషయమున పెత్తిత్తి సంచరించువారు పిచ్చివారు కారు, తక్కిన వారందఱును నిజముగఁ బిచ్చివారు"[2]

అని పేర్కొన్నారు.

భాగవతమున నేకాదశస్కంధమున మారన రచించిన పద్యమొకటి యీ పద్ధతినేసాగి పైనఁబేర్కొనిన శ్రీకులశేఖరుల పాశురములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

విదేహుని కడకు వచ్చిన తొమ్మండుగురు ఋషులలోఁ గవియను ఋషి యిట్లు పలికినాఁడు -

"సతతంబును గృష్ణసంకీర్తనంబులు
వీనుల కింపుగా వినఁగవలయు
హర్షంబు తోడుత హరినామ కథనంబు
పాటల నాటలఁ బరఁగ వలయు
నారాయణుని దివ్యనామాక్షరంబులు
హృద్వీథి సతతంబు నిలుప వలయుఁ
గంజాక్షు లీలలు కాంతారమునైన
భక్తియుక్తంబుగాఁ బాడవలయు
వెఱ్ఱి మాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెఱుగ వలయు
భేద మొనరింప వలవదు మేదినీశ !" (11–44)

ఈ పద్యమున దివ్యప్రబంధ పాశురార్థము నందువలె భక్తుల విలక్షణ వర్తనము వర్ణింపఁబడినది. ఆడుట, పాడుట, చరించుట, యున్మత్తుల వలె వ్యవహరించుట

1. పెరుమాళ్ తిరుమొళి - 2 వ దశకము - 8 వ పాశురము
2. " — " 9 వ పాశురము

యను పీ విషకళా విశేషములు రెండు సందర్భములందు సమానముగా వివరింపఁ బడినది.

పై విధముగ ననేక సందర్భములందు విశిష్టాద్వైత సిద్ధాంత పరాయణులగు నాళ్వారుల యొక్కయు, నాచార్యుల యొక్కయు శ్రీసూక్తులలోని భావములు భాగవ తాను వాదకుల యనువాద భాగములందు గోచరించుట యాశ్చర్యకరముగా నున్నది. పైనఁజేర్కొన్నవి దిక్ప్రదర్శనార్థము ప్రదర్శించిన కొన్ని మాత్రమే. ఇట్టి యుదా హరణము లాంధ్రీకర్తల యనువాద భాగములందు లెక్కకు మిక్కిలి.

ఈ విధముగాఁ బరిశీలింపగా నాంధ్రీకర్తలగు పోతనాదులు తమ యను వాద ములను విశిష్టాద్వైత మత సంప్రదాయ శోభితమగునట్లు రచించి రనియు, వీరి కా మత సిద్ధాంతము కరతలామలక మనియు, వీరు కేవలము సిద్ధాంతమాత్రిక వేత్తలేకాక తత్సిద్ధాంత బద్ధాంతరంగులై యనువాదము సాగించిరనియుఁ జేర్కొన వచ్చును. పై రమూలకముగా భాగవతాంధ్రీకరణ సందర్భమునందుఁగావించిన వర్ణ నాదులు విశిష్టాద్వైత సంప్రదాయమునఁ బ్రధానులుగా భావింపఁబడు నాళ్వారుల దివ్య ప్రబంధముల లోని వర్ణనాదులతోడను, నాచార్యులుగా శ్రీవైష్ణవులు భావించి మన్నించు విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులగు వారి రచనలలోని వర్ణనాదుల తోడను నత్యంత సామ్యము గల్గియుండుటచేఁ బోతనాదులు నల్వురు విష్ణుప్రియు లనియు, విశిష్టాద్వైతాను రక్తులనియు నిర్ణయము చేయుట కవకాశమున్నది.

# 9వ అధ్యాయము

## ఉపసంహారము

భాగవతము వేదాంత దీపములకు కాణాచి. ముముక్షువులకు ముంగొంగు బంగారము. భక్తి శాస్త్రమిది. బ్రహ్మసూత్రములకుఁ బురాణ రూప వ్యాఖ్య యిది. తత్త్వార్థులకుఁ గెలఁకుల నున్న తంగెటి జున్ను.

ఆంధ్రుల భవ్య సుకృత పరిపాక లబ్ధమైన దివ్య భాగధేయ ఫలము భాగవత పురాణమును పోతనాదు లనువదించుట. వీరి యనువాదము శ్రుతి సుభగము. రస నిర్భరము-భక్తి భావ పరిపుష్టము. సరసుల డెందములకు నయమైన విందు.

ఇట్టి సంస్కృతాంధ్ర భాగవతములను సూక్ష్మముగాఁ బరిశీలింపగాఁ బోతనాదుల యనువాదమున విశిష్టాద్వైత పాలన మతి మాత్రముగా జరిగినట్లు నిరూపించుటకుఁ బెక్కు లాధారములు గోచరించుచున్నది.

ఈ విషయమును నిర్ధయించుటకుఁ దెనుఁగునను భాగవత మవతరించిన వృత్తాంతమును బరిశీలింపగాఁ బోతన తన్ను గూర్చియుఁ, బోతనను గూర్చి సింగనయుఁ జేర్కొన్న విషయముల వలన బోతన విష్ణుప్రీతియు, విశిష్టాద్వైతానురక్తియుఁ గల వాఁడుగాఁ దెలియుచున్నది. అతని కాలమున సమాజమున వెలసి యున్న విశిష్టాద్వైత మత ప్రాబల్యము కూడ దోహదపడినట్లూహించుట కవకాశము కలదు. అట్లే సింగన తన్ను గూర్చి పేర్కొనిన విషయములాతని విష్ణు ప్రియత్వమును, విశిష్టాద్వైతానురక్తిని వెల్లడించుచున్నవి. ఇఁక గంగన నారయలతో గలిపి మొత్తమీ నలుగురి యనువాదమును సూక్ష్మదృష్టితో, శాస్త్రీయ విధానమున విమర్శించి చూడగా వీరి విష్ణుభక్తియు విశిష్టాద్వైత సిద్ధాంత పరిజ్ఞానమును, దన్మత ప్రీతియు స్పష్టపడుచున్నవి.

ఆంధ్ర భాగవతమున గోచరించు విశిష్టాద్వైత సమన్వయమును విశదీకరించుటకు 'అర్థపంచక సమన్వయమును' పరిశీలింపగాఁ బ్రాప్యుఁడగు పరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడనియుఁ, బ్రాప్తయగు జీవుఁడు పరబ్రహ్మము కంటె భిన్నుఁడనియు, నా పరబ్రహ్మమునకుఁ బరతంత్రుఁడనియు, భక్తి యోగస్వీకారముచే భగవదనుగ్రహమును సంపాదించి భగవత్కైంకర్యానందానుభూతినిఁ బొందుటయే యాతనికిఁ బరమార్థమనియుఁ బ్రాప్త్యుపాయము భక్తియోగమనియు, ఫలము పరమ పురుషార్థమగు మోక్షమనియు నది వైకుంఠలోకమున శ్రీమన్నారాయణుని సాయుజ్యము సమధిగమించుటయే యనియుఁ, దత్ప్రాప్తికి విరోధి యనాద్యవిద్య యనియుఁ గామ క్రోధాదుల రూపమున నా విరోధియే జీవు నాటంక పరచుననియుఁ దెలియుచున్నది ఇట్టి నిర్వహణము విశిష్టాద్వైత మతమునకుఁ బరమార్థముగా నన్వయించును.

అనుబంధ చతుష్టయమును పరిశీలింపగా శ్రీమన్నారాయణ పరాయణుఁడగు ముముక్షువే యధికారియనియు, పరబ్రహ్మమగు నారాయణునందలి భక్తి యోగమే ముక్తి సాధనమను విషయము భాగవతమునఁ బ్రతిపాదింపఁబడినదనియు 'శ్రీమన్నారాయణునందలి భక్తియే మోక్షోపాయము'-అను నీ విషయమునకు మహా భాగవతమను ప్రమాణమునకుఁగల సంబంధము బోధ్య బోధక రూపమైన దనియు, భక్తి యోగమునకు సంతోషించిన పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణునందలి భక్తికి ఫలము మోక్షమును బొందుట యనియుఁ దేలుచున్నది. ఈ దృశమగు సమన్వయము విశిష్టాద్వైతమునకుఁ బరమార్థముగా నన్వయించుచున్నది.

ఆంధ్రభాగవతమునందలి యుపక్రమోప సంహారాదులను బరిశీలింపగా నా యంశములన్నియు విశిష్టాద్వైత పరముగా సమన్వయము పొందుచున్నట్లు స్పష్టమగుచున్నది.

భాగవతమున భాగవత జనుల ప్రశంస యతివేలముగాఁ జేయఁబడినది. భాగవత పదమునకు 'భగవద్భక్తులు భాగవతులు. వారి గాథ యిది కావున భాగవతము' అను నొక నిర్వచనము కూడ లోకమున వినఁబడుచున్నది. అందుకుఁ దగినట్లు వివిధ భాగవతుల విశేషములు భాగవతమున నిండుగ దండిగ వర్ణింపఁబడి యున్నవి. అందుఁ బ్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, నంబరీషుఁడు మున్నగు పరమ భాగవతోత్తముల చరితములు తెలుఁగువారి యాస్యములందు లాస్యము చేయుచుండుట

యనుభవసిద్ధమైన సత్యము. భాగవత నిష్ఠ నిర్దిష్టరీతిలో ముఖ్యముగా భాగవత పురాణ మునఁ బ్రతిపాదింపఁబడినది. భాగవతులను సేవ మోక్షమునకైన యుపాయమని భాగవత పురాణము ప్రకటించినది. ఈ భాగవత నిష్ఠ విశిష్టాద్వైత సంప్రదాయమునఁ బ్రధానాంశములలో నొకటి కావునఁ దక్కిన మతములకంటె విశిష్టాద్వైత మతమే యీ యంశమును బ్రముఖముగా స్వీకరించి యుండుటచే భాగవతము విశిష్టాద్వైత మతమునకుఁ జక్కగా సమన్వయించునని నిర్ణయింప వీలు కలుగుచున్నది.

అట్లే యంతిమోపాయ నిష్ఠ యను పేర విశిష్టాద్వైతు లాచార్య సమాశ్రయ ణమున కత్యున్నత స్థానము నొసఁగియున్నారు. సర్వ మతముల యందుపి గురు ప్రాధాన్యము గోచరించుచున్నను దీని నొక మోక్షోపాయముగా స్వీకరించినది విశిష్టా ద్వైతులే. అట్టి గురు ప్రాధాన్య మీ భాగవతమున సమీచీనముగా దృశ్యమాన మగు చుండుటచే భాగవతమున విశిష్టాద్వైత సంప్రదాయానుసరణము జరిగినదని చెప్పుట కవకాశము కలుగుచున్నది.

ఆంధ్రీ కర్తల యనువాద విధానమును బరిశీలింపఁగా వారు విశిష్టాద్వైత సిద్ధాంతమును బూర్తి నెఱిఁగి, నితాంతాభిముఖ్యముతో తమ యనువాదమును సాగించి నట్లు దాహరణ పూర్వకముగా నిరూపించు నవకాశము కలదు. పోతన, గంగన, సింగన, నారయ యను నీరు నలుగు రొకే ప్రణాళికతో నాంధ్రీకరణము సాగించి నట్లు గోచరించుచున్నది. ఆ ప్రణాళికకు రూపకల్పనఁ గావించిన శిల్పి పోతన. ప్రవృత్తిలోఁ దొలుత కొంత ద్వైతభావము వ్యక్తమైనను గ్రమముగా రామచంద్ర దర్శనముచే నాతఁడు- "మన్నామాంకితంబుగ శ్రీమహా భాగవతంబుఁ దెనుంగు సేయుము నీకు భవబంధంబులు దెగును" అని యానతి నిచ్చుటతోఁ బోతనలో—

"పలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా ?"—

అనునంతటి దృఢాధ్యవసాయ మేర్పడి విష్ణుప్రీతి పెల్లుబికినట్లు కవిత్వమున గ్రంథా రంభ పద్యములను బట్టి తెలియుచున్నది. దీనికి తో డాళ్వారి ఉచిత కాలమున సమాజ మున విద్యుద్వేగముతో నెలకొన్న విశిష్టాద్వైత వ్యాప్తి ప్రణాళికలు ప్రభువులను, మాన్యులను సామాన్యులను గదలించి ప్రబల ప్రభావములకు గురిచేసినది. దాని

ప్రేరణచే వీరు దాని ప్రతిపాదిత రూపకల్పనఁ గావించి దాననుసరించుటయేగాక తక్కిన భాతిక దైవతత్వము వహించినట్లు వారి వారి యనువాద విధానము సాక్ష్య మిచ్చుచున్నది. వీరి యనువాద సరణిలో — మూలములో లేని యనేక విశిష్టాద్వైతైక గోచరములగు సంశములు చోటు చేసికొన్నవి. తత్త్వాంశములను వివరించు తావులలో వీరు శ్రీధరీయము ననుసరింపకుండుటయుఁ, తిరస్కరించుటయుఁ పెక్కు సందర్భ ములలోఁ గానిపించుచున్నది. ఆయా తావులలో విశిష్టాద్వైత సమ్మతమగు రీతిలో ననువదించుటయుఁ గానిపించుచున్నది. కావున వీరలద్వైత పరముగా నాంధ్రీకరించి నారనుటకు గాని — శ్రీ శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యనే యనుసరించి యనువదించి నారనుటకు గాని వీలులేదు.

మఱింత సూక్ష్మముగాఁ బరిశీలింపగా శ్రీమన్నారాయణు పరబ్రహ్మముతో నవినాభావ సంబంధముగల శ్రీతత్త్వమును భాగవతాంధ్రీ కర్తలు సల్వు రతి మాత్ర ముగా, మూలములో నెంతమాత్రము లేని తావులలో స్వీయాభినివేశముతో జోడించి నట్లు పెక్కులు దృష్టాంతములు గాన్పించుచున్నవి. శ్రీమన్నారాయణుఁడు నిత్య లక్ష్మీనివాసుఁడనియుఁ లక్ష్మీసహితుఁడై మోక్షప్రదాత యగుననియు విశిష్టాద్వైత సిద్ధాంతము. పోతనాదు లీ విశిష్టాద్వైత సంప్రదాయమును దమ్మత తన్మయత్వముననే యమూలకముగా నిక్షేపించి యుందురనుట కవకాశము గలదు.

ఆంధ్ర భాగవతమునఁ బ్రతి యుపాఖ్యానము భాగవతముయొక్క సహజ తత్వమునకుఁ దోడాంధ్రీకర్తల శేముషీవిశేష ఫలితముగాఁ జక్కని సమన్వయ ముతో విశిష్టాద్వైత సంప్రదాయమున కన్నివిధముల సరిపడియున్నవి.

ఆంధ్ర సమాజమున నాఁడు నెలకొన్న పరిస్థితుల ప్రభావము చేతను, సహజ మగు విష్ణుప్రీతియు, విశిష్టాద్వైతాను రక్తియుఁ దోడగుటచేతను పోతనాదులు సల్వురు "ఆళ్వారుల" యొక్కయు "విశిష్టాద్వైతాచార్యుల" యొక్కయు వాక్కుల ననేక సందర్భములందుఁ బుణికి పుచ్చుకొన్నట్లుగా ననువాదము సాగించినారు. ఆళ్వా రాదుల వాక్కుల ప్రభావ మీ యాంధ్రీకర్తల పలుకులపైఁ దిరుగులేని యధికార మును నెరపినట్లు పెక్కు స్థలములలో నాధారములు గనిపించుచున్నవి. విష్ణుప్రీతితో విశిష్టాద్వైతాను రక్తితో తత్సంప్రదాయము నాపోశనము పట్టిన వైదగ్ధ్యముతో వెలు వడినట్లు వీరి వాక్కులు శ్రీవైష్ణవ సంస్కృతి పురస్కృతములై విరాజిల్లుచున్నవి.

ఈ హేతువులచే, "నాంధ్ర భాగవత మద్వైతపరమే" యనుటకుగాని, పోతనాదు లద్వైతు లనుటకుగాని, వారునట్టురు రు.ద. తప్పకుండ కేవలము శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యనే యనుసరించి యనువదించి రనుటకుగాని వీలులేదని చెప్పవచ్చును.

అనేక దృష్టాంతములను బట్టి భాగవతాంధ్రీ కర్తలగు పోతన, గంగన, సింగన, నారయలు విష్ణుప్రీతియు, విశిష్టాద్వైతానురక్తియుఁ గలవారనియు, వారికి విశిష్టాద్వైత సిద్ధాంతము కరతలామలకమనియు, సన్నివేశముతో వారలా మత సంప్రదాయమును దమ యనువాదమున విశేషించి నారనియు - మొత్తముమీద నాంధ్రభాగవతమున విశిష్టాద్వైత పాలనము విశేషముగా జరిగినట్లు చెప్పుట కవకాశము కలదు.

# ఉదాహృత గ్రంథములు

## 1. ఆంధ్ర గ్రంథములు


| వరుస | గ్రంథనామము | గ్రంథకర్త |
|---|---|---|
| 1. | అర్చిరాదిసార సంగ్రహము | శ్రీ గోపాలాచార్య |
| 2. | ఆచార్యసూక్తి ముక్తావళి | శ్రీ నంబూరి కేశవాచార్యులు |
| 3. | ఆంధ్ర భాగవతము | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ |
| 4. | ఆంధ్ర భాగవతము | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ |
| 5. | ఆంధ్ర భగవద్విషయము | శ్రీ P. B. అణ్ణంగరాచార్య, కాంచీపురము |
| 6. | ఆంధ్ర భాగవత విమర్శ | శ్రీ ప్రసాదరాయ కులపతి |
| 7. | ఆంధ్ర భాగవతము | చదలవాడ జయరామశాస్త్రి అండ్ సన్స్, నెల్లూరు |
| 8. | ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు | వ్యాస సంకలనము |
| 9. | జీయర్ చైత్రయాత్ర | శ్రీ గోపాలాచార్య |
| 10. | తత్త్వత్రయ సారార్థ దీపిక | శ్రీ P. B. అణ్ణంగరాచార్య, కాంచీపురము |
| 11. | తెలుగు విజ్ఞాన సర్వస్వము | తెలుగుభాషా సమితి |
| 12. | పురుషసూక్తము | శ్రీ గోపాలాచార్య |
| 13. | పోతన భాగవత పంచశతి నీరాజనము | వ్యాస సంపుటి |
| 14. | పోతన సాహిత్యగోష్ఠి | వ్యాస సంపుటి |
| 15. | భక్తుని పరమపదయాత్ర | శ్రీ గోపాలాచార్య |
| 16. | భగవద్గీత | శ్రీ గోపాలాచార్య |
| 17. | భాగవత సుధ | డా॥ వేదం సుబ్రహ్మణ్యశాస్త్రి |
| 18. | భాగవత వైజయంతిక | వ్యాస సంపుటి |
| 19. | మంత్రరాజ మాహాత్మ్యము | శ్రీ గోపాలాచార్య |

| | | |
|---|---|---|
| 20. | ముండకోపనిషత్తు | శ్రీ వ. వ. రఘునాథాచార్యులు |
| 21. | రహస్యత్రయ సారము | వేదాంత దేశికులు-అనువాదము- శ్రీ కందాడై శేషాచార్యులు |
| 22. | విశేషార్థ రత్నమాల | శ్రీ P. B. అణ్ణంగరాచార్య- కాంచీపురము |
| 23. | శఠరి | శ్రీ గోపాలాచార్య |
| 24. | శ్రీమదాంధ్ర శ్రీ భాష్యమ్ | శ్రీ కందాడై శేషాచార్యులు |
| 25. | శ్రీమద్భగవద్గీతా రహస్యము | లోకమాన్య బాలగంగాధర తిలక్ గారి కృతికి అనువాదము శ్రీ బోరి సుబ్రహ్మణ్యశాస్త్రి |
| 26. | శ్రీమద్భాగవతాను శీలనము | డాక్టర్ దూశిపాళ శ్రీరామమూర్తి |
| 27. | శ్రీరామానుజ కౌముది | శ్రీ ధనకుధరం వారు, గుంటూరు |
| 28. | శ్రీరామానందలహరి | పీఠిక, శ్రీ కోగంటి సీతారామాచార్యులు |
| 29. | శ్రీ వైష్ణవాచార నిర్ణయము | శ్రీ తి. వ-రామానుజస్వామి |
| 30. | శ్రీ వైష్ణవ స్తోత్రమాల | శ్రీ మత్పర వస్తు గోవిందాచార్య స్వామి |
| 31. | శ్రీ సూక్తము | శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ |
| 32. | సమగ్రాంధ్ర సాహిత్యము | శ్రీ ఆరుద్ర |
| 33. | సర్వ దర్శన సంగ్రహము | శ్రీ గోపాలాచార్య |
| 34. | సర్వ సిద్ధాంత సారథము | శ్రీ అనుభవానంద స్వాములవారు |
| 35. | సిద్ధాంతత్రయ దీపము | శ్రీ కాంతలూరి వెంకటాచార్యులు |

## 2. సంస్కృత గ్రంథములు

| వరుస | గ్రంథనామము | గ్రంథకర్త |
|---|---|---|
| 36. | అష్టశ్లోకి | శ్రీ పరాశర భట్టరుల కృతి అనువాదం: శ్రీమొలుగు రామానుజాచార్య |
| 37. | ఉత్తర దినచర్యా | శ్రీ దేవ రాజగురు |
| 38. | కరావలంబ స్తోత్రము | శ్రీ శంకర భగవత్పాదులు |
| 39. | గోపాల వింశతి | శ్రీ వేదాంత దేశికులు |
| 40. | తైత్తిరీయోపనిషత్ | |
| 41. | దయా శతకము | శ్రీ వేదాంత దేశికులు |
| 42. | బ్రహ్మాండ పురాణము | వ్యాస-భగవానుడు |

43. భజగోవింద స్తోత్రము — శ్రీ శంకర భగవత్పాదులు
44. మహాభారతము — వ్యాస భగవానుడు
45. ముకుందమాల — శ్రీ కులశేఖరాళ్వారులు
46. యతీంద్ర మతదీపికా — శ్రీవాత్స్యం వెంకట నరసింహ భాష్యకారాచార్య
47. లక్ష్మీతంత్రము — — —
48. విష్ణు పురాణము — పరాశరులు
49. వేదాంత సిద్ధాంత కౌముది — శ్రీ గోపాలాచార్య
50. శ్రీమద్భగవద్గీత — వ్యాసభగవానుడు
51. శరణాగతి గద్య — భగవద్రామానుజులు
52. శ్రీకృష్ణ కర్ణామృతము — లీలాశుకులు
53. శ్రీగుణ రత్నకోశము — పరాశర భట్టరు వారు
54. శ్రీమద్భగవద్గీత — వ్యాస భగవానుడు
55. శ్రీభాష్యమ్ — భగవద్రామానుజులు
56. శ్రీమద్భాగవతమ్ — వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ ప్రచురణ
57. ,, — సిద్ధాంత చంద్రికా వ్యాఖ్య
58. ,, — భావార్థ దీపికా వ్యాఖ్య
59. ,, — విజయ ధ్వజీయ వ్యాఖ్య
60. ,, — శ్రీ వీరరాఘవీయ వ్యాఖ్య
61. శ్రీవరదరాజ స్తవము — శ్రీ కూరత్తాళ్వారు
62. శ్రీవైకుంఠ గద్య — భగవద్రామానుజులు
63. శ్రీరంగరాజ స్తవము – ఉత్తర శతకము — శ్రీ పరాశర భట్టరు
64. స్తోత్ర రత్నము — ఆళవందారు లేక యామునాచార్యులవారు

## 3. తమిళ గ్రంథములు

65. ఇయఱ్పా — — —
66. ఉపదేశ రత్నమాల — శ్రీ మనవాళ మహామునులు
67. తత్త్వత్రయము — శ్రీ పిళ్ళె లోకాచార్యులు
68. తిరుప్పావై — శ్రీ గోదాదేవి

69. తిరువాయ్ మొళి — శ్రీ నమ్మాళ్వారులు
70. పెరుమాళ్ తిరుమొళి — శ్రీ కులశేఖరాళ్వారులు
71. పెరియతిరు మొళి — తిరుమంగై యాళ్వారు
72. పెరియాళ్వార్ తిరుమొళి — పెరియాళ్వారు
73. ముముక్షుప్పడి — శ్రీ పిళ్ళై లోకాచార్యులు
74. శ్రీవచన భూషణమ్ — శ్రీ పిళ్ళై లోకాచార్యులు

## 4. ఆంగ్ల గ్రంథములు

75. The Philosophy of Visitadvaita — Varadacharya
76. Visistadvaita — A. Srinivasa Raghavan



# రచయిత పరిచయం

పేరు : భట్టా లక్ష్మీనరసింహాచార్యులు

జననీ జనకులు : శ్రీ శేషుల రంగరామానుజాచార్యులుగారు
యతిరాజవల్లి తాయారు

భార్య, బిడ్డలు : అర్ధాంగి - వెంకట రామనమ్మ
కుమారుడు - వెంకట శేషరంగరామానుజం
కుమార్తెలు - వసంతలక్ష్మి, మాధవీలత

విద్య : భాషాప్రవీణ; యం.ఏ; యం ఫిల్. పి.హెచ్.డి.

పరిశోధన : 1) యం. ఫిల్. కోర్సు - ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి
కులశేఖర మహీపాల చరిత్రము - సమగ్ర పరిశీలనము
(T.T.D. వారి ద్రవ్య సహాయంతో ముద్రించబడినది)
2) పి.హెచ్.డి. కోర్సు - ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి
ఆంధ్ర భాగవతము - విశిష్టాద్వైత పాలనము
ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి ఉత్తమ పరిశోధక వ్యాసంగా
త్రిపురనేని గోపీచంద్ మెమోరియల్ గోల్డ్ మెడల్
పొందింది. T.T.D. వారి ద్రవ్య సహాయంతో ముద్రించ
బడినది.

వృత్తి : శ్రీమతి గెండేల శకుంతలమ్మ కళాశాల (జగ్గయ్యపేట)లో
ఆంధ్ర భాషాధ్యక్షులు, రీడర్

ప్రవృత్తి అభిరుచులు : భగవద్రామానుజ గోష్ఠి వ్యవస్థాపకులు - 'భరం' అనే ఆధ్యాత్మిక మాసపత్రిక వ్యవస్థాపకులు మరియు గౌరవ సంపాదకులు.
పత్రిక స్థాపన, గ్రంథ ముద్రణ ఉపన్యాసముల ద్వారా ప్రజల్లో ఆధ్యాత్మిక భావాల వ్యాప్తికి కృషి. టౌన్ ఇంప్రూవ్‌మెంట్ కమిటీ (T.I.C.) అధ్యక్షునిగా సమాజసేవకు కృషి.
కవిత్వం, వ్యాసరచనం ద్వారా, ఆచరణ ద్వారా మానవసేవయే మాధవసేవ అనే అంశాన్ని ప్రచారం చేయుట.